ఫిబ్రవరి 1990

117




సాహిత్య - సాంస్కృతిక మాసపత్రిక

20 ఏళ్ళ విరసం మహాసభల దృశ్యాలు

విరసం పతాకాన్నావిష్కరిస్తున్న కా॥ కె. వి. ఆర్.



ఎత్తినాం విరసం జెండా
అలలలలుగ పరదలొత్తు పోటుపోటు జెండా
ఎత్తినాం విరసం జెండా
సుబ్బారావు పాణిగ్రాహి సంధించిన కళలతోప
మా ఎన్నెస్ ప్రకాశరావు మండించిన కథనంలో
పరిటాల రాములన్న ప్రతిఘటనా పాదంలో
జ్ఞానేశ్వర్ జీవించిన జనపదాల జాడలో
కొంప జగత్ పరిశీలన కాగడాల కదలికలో
మా చెర ఏటం బట్టిన మందిపాట ఉరవడిలో
మా శ్రీశ్రీ నినదించిన విప్లవాల గానంలో
పదపదమున పదభేరీ మోగిస్తాం
గళగళమున క్రాంతి ఝంఝ ఝళిపిస్తాం.

# విషయసూచిక

***కవితలు :***



***కథనం :***



***వ్యాసం :***



***రిపోర్టులు :***



***విరసం విశేషాలు :***

**20 ఏళ్ళ విరసం మహాసభలలోని ప్రసంగ వ్యాసాలు :**



**మహాసభల దృశ్యాలు**

**మహాసభల విశేషాలు - వివరాలు :**



ప్రముఖ సాహిత్య విమర్శకుడు, విప్లవ సాహిత్యాభిమాని టి.యల్. కాంతారావు మృతికి విరసం సంతాపం వ్యక్తం చేస్తోంది.

ఫిబ్రవరి 'అరుణతార' ఆలస్యంగా మార్చిలో రావడంవల్ల పాఠకులకు కలిగిన అసౌకర్యానికీ చింతిస్తున్నాం. విద్యుత్ కోత, ప్రెస్‌లో ఏర్పడిన ఇతర సాంకేతిక కారణాలవల్ల ఈ సంచిక ఆలస్యం అయినందుకు మన్నించమని కోరుతున్నాం.

సం॥

'అరుణతార'కు రచనలు, చందాలు, విరాళాలు పంపవలసిన అడ్రసు.

వి. చెంచయ్య

6-5-13, కావలి - 524 201, నెల్లూరుజిల్లా.

## "కలుపుమొక్కలు"

పచ్చని చేన్లో మంచి మొక్కల్ని ఎదగనీకుండా
అడ్డంకిగా పెరిగిన 'కలుపుమొక్కల్ని' తొలగించే తొందర్లో
ఆ కలుపుమొక్కల చాటున ఒదిగిన కొన్ని మంచిమొక్కల్ని
అప్పుడప్పుడూ పెకలిస్తుంటాం.
చప్పున మతికొస్తుంది - పెకలించింది మంచి మొక్కని.
అయ్యో! అనుకొని విచారిస్తాం ఓ క్షణం
అంతటితో కలుపు తియ్యడం మానేస్తామా...!?
మళ్ళీ అలాంటి పొరపాటు జరక్కుండా కలుపుతీస్తాం.
పంట బాగా రావాలంటే కలుపు తియ్యక తప్పదు మరి!

—"చూపు"

## మిత్రభేదం

పాత వేటగాడే-
కొత్త వల పన్నుతున్నాడు!
పావురాలూ! పారాహుషార్!
హిరణ్యకా! నువ్వుకూడా సిద్ధంగా వుండు
వల కొరికి మిత్రుల్ని రక్షించడానికి!

—పి. ఎస్. రమ

## జనం ఒడిలో సురక్షితం

అతను "సముద్రాన్ని" ప్రేమించినందుకు
సముద్రం లోతుల్లో అతన్ని ముంచేశావు
అతను సాయుధమైన మట్టిగాయాలను "సృజించినందుకు"
మట్టి అడుగున పాతేశావు
అతను "భవిష్యత్ వెలుగుల్ని" చూపించినందుకు
చీకట్లో దాచేశావు
ఇప్పుడు నీరూ, మట్టీ, గాలీ అతనికి సెంట్రీ చేస్తున్నాయి
నువ్వు ఇంకేం చెయ్యలేవు!

—ఎమ్. ఎస్. ఆర్.

## మరణం ముగింపు కాదు

ఉషోదయానికి మూడు గంటల ముందే
మమ్మల్ని కాల్చి చంపారు
మాపై తుపాకులు పేల్చి ఏ చిరునవ్వులు మాయం చేయగలిగారు?
ఏ చట్టాలు చేసి ఏ కదలికలు ఆపగలిగారు?
ఆయుధాన్ని గురిపెట్టిననాడే
స్వార్థాన్ని విలువ లోతు పాతేంశా
ఆశయంతో మమేకమైననాడే చావుకు వీడ్కోలు పలికాం
మూడు పదులు నిండకముందే ఎన్‌కౌంటరైన యువ ఆత్మలం
చంపినా చావని చిరంజీవులం
ఆశయం ఆక్సిజన్‌గా పయనించేవాళ్ళకు
మరణం ముగింపుకాదు.

—అజ్ఞాతచంద్రుడు

## సాయుధ సంకేతం

మా అక్షరాలు నిటారుగా నిల్చొనే వున్నాయి
మా అక్షరాలు నినదిస్తూనే వున్నాయి
పాణిగ్రాహి ప్రాణవాయువుల్లో రగిలే మా అక్షరాలు
నక్సల్‌బరి నిప్పురవ్వల వెలుగుల్లో
ఉజ్వలంగా ప్రకాశిస్తూనే వున్నాయి
గోదావరి, మంజీర, ప్రాణహితల
'ఉష్ణ' కాసారాల్లో ఉవ్వెత్తున లేస్తున్నాయ్—
కటకటాల్లో అక్షరాలు
కన్నీటి సముద్రంలో అక్షరాలు
నిప్పుల ఊపిరితో మా అక్షరాలు
నిర్బంధాల కాంక్రీట్ గోశల్లోంచి
తొలుచుకొస్తున్న వృక్షాలు మా అక్షరాలు—
మంటల్లో మాడిపోయిన చంద్రవంక మా అక్షరాల్లో ఉదయిస్తుంది
నాగేటి చాళ్ళలో పగిలిన విత్తనాలు మా అక్షరాల్లో మొలకెత్తుతాయి
అడవిలో ఆకు ఆకు పైనా ప్రాకుతున్న వెన్నెల
మా అక్షరాల్లో ప్రతిఫలిస్తుంది—

భుజానికి వేళ్ళాడే భారం మోస్తూ మోస్తూ అలసిన అన్నకు
మా అక్షరాలు చల్లని నీరై వ్యూహాల వాహికలోంచి జారుతాయి
ఎముకలు కొరికిన చలిలో సెంట్రీ కాస్తున్న కామ్రేడ్ గుండెల్ని
వెచ్చటి అమరత్వ గీతికల్తో కప్పుతాయి—
ఆకురాలు కాలంలో మా అక్షరాలు చిగురులు తొడుగుతాయి
ఈ శతాబ్ది కేసెట్లో కువకువలాడే మా అక్షరాలు
సాయుధ సంకేతాలు—

—కూర్మారావు

# గాయం

తల్లి గాయపడింది
తల్లి గాయాలు మాన్పబోయి తమ్ముడూ గాయపడ్డాడు
చీకటింట్లోకి దీపమై నడచివచ్చినందుకు
గాయం చేసిన వాళ్ళెవరో చెప్పినందుకు
గాయపడినవాళ్ళలో తనూ ఒకడయ్యాడు
తమ్ముడు గాయపడ్డాడు
పాట కట్టినందుకు - పాటలు పాడినందుకు
పాటపై మనస్సు పడ్డందుకు
కళ్ళలోంచీ, కలల్లోంచీ నడిచివచ్చినందుకు
కొత్తరక్తం పోసుకున్నందుకు
నిన్నటి పోరాటాన్ని నేటికి మోస్తున్నందుకు
తమ్ముడు గాయపడ్డాడు
గాయం జ్ఞాపకాలను స్థూపాలు చేసినందుకు
స్థూపాలు కూల్చినా భూమిలా నిలిచినందుకు
భూమిభూమంతా పచ్చిగాయం వాసన వేస్తున్నపుడు
సమస్త ప్రజనీ సాయుధం చేస్తున్నందుకు
తల్లిని ప్రేమించినందుకు తమ్ముడు గాయపడ్డాడు.

—అన్వేషి

# జీవితసత్యం

ఆవు దూడను ఈనినపుడు తన మూతితో ఒళ్ళంతా నాకుతుంది
చిన్నతనంలో ఆ ప్రేమ నన్ను మురిపించింది.
నా తల్లి నాకు జన్మనిచ్చి ఒళ్ళంతా నిమురుతుంటే
ఆ తల్లికే అందులోని ఆప్యాయం, అనురాగం తెలుసు
కలి చల్లిన మరో తల్లి కళ్ళప్పగించి చూసుండాలి
ఈడొచ్చిన నా మనసు
మరో స్త్రీని చుంబించినపుడు 'తొలిప్రేమ' తీపి తెల్పింది
గడుస్తున్న రోజుల్లో, గడ్డురోజుల్లో ఆ ప్రేమ
ఎన్నెన్నో వంకలు తిరుగుతూ గింగురులు కొట్టింది
ఉష్! ప్రేమ ఇంతేనా అనిపించింది
కరువుకాలం, నిరుద్యోగం ప్రేమనూ కరువుచేశాయి.
కామం ప్రేమ కాదనే కఠోరం తెల్సింది
నిజమైన ప్రేమకై నా మనసు కోరుతుంది!
వెతుకుతూ వెతుకుతూ ప్రేమను కనుగొన్నాను
ఈ ప్రేమ జగత్తునే తెలిపింది
ఆ ప్రేమ పేదల ఆదరాన్ని చూపింది
ఆ ప్రేమ గతాన్ని మరిపించింది
కరువు, దారిద్ర్యం, కష్టాలు, కడగండ్లు నిత్యసత్యాలు
కాదన్ననాడే కమ్యూనిస్టు అని నాకు ముద్రవేశారు.
నేను ఒంటరివాణ్ణి కాను.
కారడవుల్లో కాలిబాటల్లో కడుపాకలితో సంచరిస్తూ
దొరికిన పట్టెడు అన్నం పంచుకతింటూ తృప్తిపడ్డాను.
ఖాకీ మూకలు చుట్టుముట్టి కాల్పులకు సిద్ధమవగా
నాకు అండనిచ్చి నిండుమనసుతో నిలబెట్టిన సహచరుడా!
ఒంటినిండా బుల్లెట్ల గాయాలతో నెత్తురు చిమ్ముతుంటే
పొంగుతున్న నెత్తుర్లల్లో నీ ఒళ్ళు తన్నుకుంటూ
నీ కళ్ళతోనే నాకు ఆప్యాయంగా వీడ్కోలు చెప్పావు.
తప్పుకోమంటూ ఆదేశిస్తూనే నీ తుపాకి నాకు అందించావు
నిజమైన ప్రేమ, ఆదరణ, ఆప్యాయత నేర్పిన ఓ నా కామ్రేడ్!
బ్రతుకు విలువలు తెలిపిన నీ ఆశయంకోసం
నేను బ్రతుకుతూ నిన్ను బ్రతికిస్తాను.

— శీను

# వైరితనం

నీరెప్పుడూ నిశ్చలతని కోరదు
దృష్టి సారిస్తున్న నయనాల కనుగుణంగా
కదులుతున్న పాదాల్లాగా ప్రవహిస్తూనే ఉంటుంది
మట్టివాసనల సాహచర్యాన్నీ
పంటపొలాల్లోని బురదచేతుల సాంగత్యాన్నీ కోరుకుంటుంది
నీరు నిదానంగా సాగిపోతుందేమో కానీ
నిర్జీవంగా చలనం లేకుండా ఉండటం దాని నైజంకాదు
తొలకరి చినుకుల ఆవేశాన్నందుకొని
కోయిలంత సహజంగా రాగాన్నాలపిస్తుంది
వరదలై పారేందుకే వాగులై పొంగుతుంది
హృదయంలోని అక్షరాలు ఒక్కొక్కటి పదాలై
కాగితంపై రాలిపడుతున్నంత కష్టంగానే
పగిలిన మేఘం రాల్చిన నీటిచుక్కలు ఒక్కటై
కాల్వలుగా నదులుగా తరంగాల చెక్కిళ్ళను తాకేందుకే
నీరు సముద్ర సాన్నిధ్యాన్ని కోరుకుంటుంది
కడలి హృదయంలో జ్వలించే నీటికి
ఎత్తుపల్లాల్నెదిరించడంలో అలసత్వం ఉండదు
నీటిని కదలకుండా లోతుగా లాఠీల్ని పాతి
ఖాకీ ముళ్ళకంచెల్ని వేశానని సంబరపడకు
నీటి జీవనాడిని నీవు క్షణకాలంకూడా ఆపలేవు
నీ తుపాకీ బయనెట్ కొసలపై మెరిసే
చంద్రుడి చిరునవ్వు వెన్నెలలు ఏనాడూ మాసిపోవు
నీటిని మంచుముక్కగా నిలబెట్టాలనుకుంటావు
కానీ
మృతవీరుడి వెచ్చటి నెత్తురు స్పర్శలో
హిమాలయాలు సైతం జీవధారలై ప్రవహిస్తున్నాయి-

కత్తి పదునుకింద
నీటిని అదిమిపట్టాలనుకోవటం
నిజంగా నీ వైరితనమే.

—లోహిత్

# వంగపండు పాట

(1) గద్దరన్న గొంతుకులో పాటలు పుట్టేయా నేస్తమా రావా
పాటకి పదిపుట్లు జనం వంతలు గట్టేయా నేస్తమా రావా
వంతా వంతకి సింహం గొంతులు పుట్టేయా నేస్తమా రావా
ఆ గొంతులో - ఆ గొంతుల్లో
ఆ గొంతుల్లో విప్లవాల పిడుగులు పుట్టేయా నేస్తమా రావా
(2) జగిత్యాల కొండల్లో దండూ బుట్టిందీ నేస్తమా రావా
దండూ దండుకి దబ్బై సేతులు పుట్టేయా నేస్తమా రావా
సెట్టూ సెట్టుకి చేతులు ఉట్టెలు గట్టేయా నేస్తమా రావా
ఆ ఉట్టెల్లో - ఆ ఉట్టెల్లో
ఆ ఉట్టెల్లో భూస్వాముల బుర్రలు బెట్టాయి నేస్తమా రావా
(3) ఓట్లులు ఏతలు జూసీ ఓటుల్నీ జూసీ నేస్తమా రావా
మన భరతా మాతకి ఏడుపు పుట్టిందీ నేస్తమా రావా
ఏడిసి ఏడిసి తల్లీ కానుపు కాసిందీ నేస్తమా రావా
ఆ కానుపులో - ఆ కానుపులో
ఆ కానుపులో నక్సలైటు బాలుడు పుట్టేడూ నేస్తమా రావా
(4) తూరుపు గోదావరిలో సిరే పొంగిందీ నేస్తమా రావా
కడవా ముంచాబోతే కన్నూ కనిపించే నేస్తమా రావా
ఆ కన్నుల్లో అడిపన్నా చెయ్యీ కనిపించే నేస్తమా రావా
ఆ చేతీనీ - ఆ చేతీనీ
ఆ చేతీనీ జూడగా గన్నూ కనిపించే నేస్తమా రావా
(5) సింగరేని బొగ్గులో సీమలు పుట్టేయా నేస్తమా రావా
కాలు కదపగ సీమలు కత్తులు పుట్టేయా నేస్తమా రావా
కత్తీకత్తికి కార్మిక శక్తులు పుట్టేయా నేస్తమా రావా
ఆ శక్తుల్లో - ఆ శక్తుల్లో
ఆ శక్తుల్లో కాంట్రాక్టుల నెత్తులు గొట్టేయా నేస్తమా రావా
(6) దండాకారణ్యంలో కొండోలు జాతరా నేస్తమా రావా
ఆకలి కడుపులమీదా ఆటల దరువేసే నేస్తమా రావా
ఢిల్లీ కోటకు జాతర ఎల్లాబోతందీ నేస్తమా రావా
ఆ జాతరలో - ఆ జాతరలో
ఆ జాతరలో ఎర్రన్నల స్థూపాలెట్టాలీ నేస్తమా రావా

*కథనం :*

# చావులోని అంతర్యం

—గిరిధర్

దట్టమైన అడవిని ఆనుకొనే ఆ ఊరుంది. ఆ ఊరులోనే 15 మందితో పోలీసు క్యాంపు గత నాలుగేళ్ళుగా తిష్టవేసి కూచుంది. వారంతాను స్పెషల్ రిజర్వు పోలీసులే. ఆ వూళ్ళో ఎంతలేదన్నా దాదాపు 1500 పైనే లోకసంఖ్య (జనాభా) ఉంటుంది. ఆ వూరు సాధారణంగా అక్కడక్కడ అడవిలో విస్తరించుకొని ఉన్న అనేక ఆదివాసీ గ్రామాల్లా కాకుండా తనదంటూ ఒక ప్రత్యేక వాతావరణంతో విలసిల్లుతుంటుంది. వివిధ కులాల కాంపోజిషన్‌తో ఈ గ్రామం ముడిపడి బలపడి ఉంది. అడవిలోని ఆదివాసీ గ్రామాల్లో సాంప్రదాయబద్ధంగా పూజారి, పటేలు మాట చెల్లుబాటు కావడం ఒకవైపు, మరోవైపు గత అర్ధ దశాబ్దం పైగా వందలాది గ్రామాల్లో కొనసాగుతున్న "ఆదివాసీ కిసాన్ ఖేత్ మజూర్ సంఘటన్" మాట నడవడం ఉండగా ఈ గ్రామంమాత్రం ఆ జాబితాలోకి రాదు (రాకుండా చేశారంటే బాగుంటుంది). "తీరొక్క కులం-రీతొక్క బుద్ధి" అన్నట్టు కాలం గడుస్తుంది అక్కడ. ఢిల్లిని చుట్టుముట్టి ఈశాన్య రాష్ట్రాలున్నట్టు ఈ ఊరి చుట్టు 7 గ్రామాలున్నాయి. వాటన్నిటిమీద సార్వభౌమాధికారం చెలాయించేవాడి పేరు సర్కారువారి భాషలో 'దండాధికారి'. ఆ ఊరిపేరు 'పెద్దరాజారం' - ఆ మనిషిపేరు ఆత్రం గంగారాం. మహారాష్ట్రకు చెందిన గడచురోలి జిల్లాలో గల వందలాది గ్రామాల్లో ఈ గ్రామాన్ని ఓ మోస్తరు గ్రామంగా లెక్కిస్తే ఈ పెద్దమనిషిని ఓ మోస్తరు చోటామోటా కాంగీ లీడరుగా గుర్తించడం సబబుగా ఉంటుంది.

13-12-1988 నాటి స్థానిక మరాఠీ పేపర్లన్నీ పెద్దపెద్ద నల్లటి అక్షరాలతో 'ఆత్రం గంగారాం హత్య' అంటూ రాశాయి. ఒకటి రెండు పత్రికలు అందమైన గంగారాం ముఖకవళికలనుకూడ చిత్రించాయి. ప్రచార సాధనాల్లో ఒకడుగు ముందుకుపోయిన ఆకాశవాణి నాగపూర్ కేంద్రం తన గొంతు సవరించుకొని సానుభూతితో మిస్టర్ గంగారాం హత్యను వివరించింది. అలాగే ఆధునిక ప్రచార సాధనం టెలివిజన్‌లో అడవి చూపిస్తూ గంగారాం ఘటనా స్థలాన్ని పేర్కొంటూ చచ్చినవాడి పేరును ఆఖరిసారి చంపేసింది. ఆకాశవాణి వార్త విన్న జనాల్లో కలిగిన రియాక్షన్స్‌కన్నా టివి ప్రేక్షకుల రియాక్షన్స్ అనేకరెట్లు అధికిపుంటూ ప్రచారం సాగుతుంది. దీని ఫ్లాష్‌బ్యాక్

మామూలే. ఏకపక్ష ధోరణి విని న్యాయాన్ని తేల్చివేసే అవకాశాలే కలిగి ఉన్నంతకాలం అలాంటి ప్రేక్షకుల మధ్య జరిగే తంతు ఇలాగే ఉంటుంది. ఈ గాభరా అంతా చంద్రపూర్, గడచిరోలి జిల్లాలను వేరుచేస్తూ పారుతున్న 'వైన్‌గంగా'కు అవలివైపు మహారాష్ట్ర జిల్లాల్లోనే కానీ ఈవైపు అనుకొని ఉన్నా గడచిరోలి తాలూకాల్లో లేదు సరికదా తద్భిన్నంగా మరోరకమైన ఫీలింగ్స్ అడుగడుగునా ఈనోటా ఆనోటా బయటబడినాయి. వీరి కళ్ళల్లో గతమంతా ఒక్కసారే పునరావృతమైంది.

అహిరి తాలూకా రైతాంగ ఉద్యమానికి వన్నెతెచ్చిన కామ్రేడ్ గంగా రాజం (భీమన్న) వీరి కళ్ళల్లో తిరిగాడు. రైతాంగ పోరాటానికి అగ్రభాగాన నిలిచిన కరీంనగర్ జిల్లాలోని మెట్టుపల్లి తాలూకాకు చెందినవాడే వీరి కళ్ళల్లో కనబడుతున్న కామ్రేడ్ భీమన్న. అలాగే అక్కడి కర్కోటకపు భూస్వాముల దోపిడి పీడనను ఎదిరించి యువతకు ఆదర్శమైన మన భీమన్న 'పోరుమళ్ళ' గ్రామస్థుడుగా ఊరిపేరు సార్థకం చేశాడన్నది అందరిలో గల ఏకాభిప్రాయం. తనకోసంకాక "ప్రజలకోసం ప్రాణమివ్వడం హిమాలయాలకన్నా మిన్న" అన్నది తన జీవితంలో ఆచరణద్వారా నిరూపించిన ఘనుడన్న విషయం ఎవరూ కాదనలేరు. 8 మందితో కూడిన తన దళానికి సెంట్రీ చేస్తుండగా ద్రోహి గంగారాం ఇచ్చిన సమాచారంతో పోలీసుల ఉచ్చులో పడి పోయి తన దళాన్ని కాపాడి తన ఆశయాన్ని తనవాళ్ళకు వదలి అసువులు బాసిన భీమన్న శవాన్ని చూస్తున్న వారి కళ్ళల్లో అశ్రుతర్పణం స్పష్టంగా కనబడుతూ వారి పెదవుల మధ్య "కామ్రేడ్ భీమన్న అమర్ రహే" అన్న నాలుగు నుడుగులు వినగలిగేవారికే వినిపించాయి. ఆనాటినుండి ఈనాటివరకు యేటేటా వందలాది ఆదివాసీల గుండెల్లో చెరగని ముద్ర వేసుకున్న భీమన్న పేరు నిత్యం స్మరించబడుతూ ఆ కీర్తి మరింత వ్యాప్తిచెందుతూ వుంది. దిన దినం తన వాసులమధ్య ఆ అమరుడి ఆశయం చిరస్మరణీయంగా వెలుగు తుంది. అందుకే భీమన్న మృత్యుంజయుడు.

కానీ డిసంబర్ 12, 1988 నాడు తన ఇంటికి కేవలం అర కిలోమీటరు దూరంలో గల దట్టమైన అడవిలో ముసిముసి చీకట్లు అలుముకున్నవేళ గ్రామస్థులమధ్య ఆదివాసీ ప్రజల చేపల్లోనే "మృత్యుశిక్ష" అనుభవించిన గంగారాం పరిస్థితి తద్భిన్నంగా వుంది. గంగారాం – గంగారాజం ఇరుపురి పేర్లు దగ్గర దగ్గరే ఉన్నా, ఒకరి పేరులో 'జ' అనే అక్షరం ఉండి మరొకరి పేరులో 'జ' లేకపోవడం వాపులోని లేవాకు ప్రత్యక్ష సాక్ష్యంగా నిలబడుతుంది. 'జ' ఉన్న

వాడు 'జనం' కోసం మరణిస్తే 'జ' లేనివాడు 'జనం' చేతిలో చచ్చాడు. అదీ దిక్కులేని చావు చచ్చాడంటున్నారు స్థానికులంతా.

అతనిభార్య చేతిలో లాంతరుతో అడవిలో ఒంటరిగా తన భర్త శవాన్ని కనుక్కొని గుండె దడతో వేగంగా తన ఇంటికి అర కిలోమీటరు దూరంలో ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తూ ఇంతకాలంగా తిష్టవేసిన పోలీసు క్యాంపు చేరుకుంది. అక్కడ నా అన్నవాళ్ళకు దూరంగా తన వాళ్ళను తలచుకుంటూ మందికోసం తమ ప్రాణాలు 'త్యాగం'చేసే 'పవిత్ర' సేవకులు ఎవరిలోకంలో వారున్నారు. తన భర్త చావుకు ప్రత్యక్ష కారకులయినవారి కాళ్ళవద్దకే తిరిగి సహాయపడమంటూ చేరుకున్న తన దీనావస్థపట్ల తనకే అసహ్యంగా ఉన్నా "కళ్ళెదుట ఉన్న శవం కనుమరుగయ్యేవరకు" తనకీ అవస్థ తప్పదన్నట్లుంది ఆ అభాగ్యురాలి చూపు. గ్రామస్తులెవరూ కూడ అలాంటి విషయాల్లో తనకు సహాయపడడం జరుగదని తెలిసే తాను అటువంటి ప్రయత్నానికే పోలేదు.

పాపం! పోలీసుల సహాయాన్ని అర్థించే ప్రతి భారతనారికీ జరిగే అన్యాయమే 'సోనుబాయి'కి అక్కడ జరిగింది. "అడవిలో నా భర్త శవం పడివుంది - తలా, మొండెం వేరుచేయబడ్డాయి - తెండి" అంటూ విన్నవించగా మున్సిఫ్ మేజిస్ట్రేటు రైతుల కేసులు వాయిదా వేసినట్టు ఆ క్యాంపు పోలీసులు "రేపు ఉదయంవరకు మేము కదిలేది లేదు" అంటూ ఖరాఖండిగా చెప్పేశారు. దీనితో తన భర్త చావుపట్ల జాలిపడింది. క్షణం క్రితంవరకు పోలీసులమధ్య పోలీసులాగ వ్యవహరించిన తన భర్తకు ఇంతటి గౌరవం లభిస్తుందని ఆ 'ఆదివాసీ మహిళ' ఊహించడంకూడ కష్టమే. కానీ ఆచరణలో క్షణాల్లో తెలుసుకోవడం చాలా తేలికైంది.

ప్రతి మనిషి జీవితానికి ఆఖరి సన్నివేశం చావు మూడేళ్ళ క్రితం తన భర్త కారణంగా చనిపోయిన అడ్రస్ తెలియని ఒక విప్లవకారుడి శవం ఊరి మధ్య పంచాయితీ ఆఫీసు ముందు పడివుండగా చివరి వీడ్కోలు చెప్పడానికి వచ్చిన వందలాది ప్రజలు సోనుబాయి కళ్ళల్లో కనపడినారు. పోస్టుమార్టం కోసం శవం అక్కడినుండి లేపేవరకు శవాన్ని విడవడానికి సాహసించలేదు ఆనాడు పోలీసులు - అనుమతించలేదు ప్రజల హృదయాలు. అదో కలలా సోనుబాయి కళ్ళముందు రీలు తిరగసాగింది. తెల్లవార్లూ సోనుబాయి అభాగ్యురాలిగానే కాలం గడిపింది.

ఉదయం 10 గంటలనుండి రాజారం వైపు అధికారుల, అనధికారుల వాహనాల జాతర ప్రారంభమైంది. కెమెరామెన్‌లు, జర్నలిస్టులు, విలేకరులు ఒక్కరేమిటి? "రాజు వెడలె......" అన్నట్టు నాగపూర్‌నుండి రాబోతున్న ముఖ్యమంత్రి శరద్ పవార్ ఆగమన వార్త ప్రభుత్వ వర్గాలలో 'హల్‌చల్' సృష్టిస్తే, ప్రజల్లో కంపరం ఎత్తిచ్చింది. ఇది వర్గస్వభావం - ఇది వర్గన్యాయం విచ్చేసిన అతిథులందరూ క్షణాల్లో ఎవరి పనులు వాళ్ళు చేసుకున్నారు. తిట్లు, దీవెనలు వెళ్ళగక్కారు. మరో క్షణంలో సోనుబాయి చేతిలో పది వేల రూపాయల చెక్కు శరద్ పవార్‌చే సమర్పించబడగా ఒక్కసారి కెమెరా క్లిక్కుమంది. "అప్రజాస్వామ్య శక్తుల్ని, సంఘవ్యతిరేక శక్తుల్ని అడవినుండి దూరం చేసేవరకు - ఆదివాసీలనుండి విడగొట్టేవరకు తన ప్రభుత్వం నిద్ర పోదు" అన్న వాక్యాలతో గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారి ధీరోదాత్త ప్రసంగం ముగిసింది. ఖా(కా)కి గోల సోనుబాయి కన్నీళ్ళను చెక్కు కాగితంతో తుడిచేయగా, ఒక్కరోజు వార్తలతో ప్రచారసాధనాలు అత్రం గంగారాం మరణంపట్ల తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించి మూగబోగా శుష్క వాగ్దానాలతో ముఖ్యమంత్రి చేసిన హామీలన్నీ అసెంబ్లీలో నాలుగు గోడలమధ్య శీతాకాల సమావేశాలు ముగిసేవరకు వర్థిల్లాయి. నక్సలైట్లను నిర్మూలించడం వారి ధ్యేయం - పోలీసు యంత్రాంగాన్ని పటిష్టపరచడం వారి లక్ష్యం.

రెపరెపలాడే ఎర్రజెండాల మధ్య వందలాది స్త్రీ పురుష కంఠాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు తమ ప్రియతమ నాయకుడయిన "కామ్రేడ్ భీమన్న మృత్యుంజయుడు" అన్న నినాదాలు జనవరి 31 నాడు మార్మ్రోగుతుండగా "ఆదివాసీ రైతాంగ పోరాటాలు వర్థిల్లా"లంటూ గుండె లోలోతుల్లోనుండి నినదిస్తున్న ఆ గిరిజన కంఠాలను చూస్తున్న సోనుబాయి కళ్ళల్లో సర్కార్‌వారు సమర్పించిన ముష్టి పదివేల రూపాయల చెక్కు తన గుండెను కోస్తున్నట్లుంది. ఎదిగిన తన కొడుక్కు పోలీసు నౌకరి ఇప్పించి తనను ఆదుకుంటామన్న అధికారుల హామీ ఇక మరో చావును భరించలేనంత బాధగా తనకు బోధపడసాగింది అడవి వెక్కిరిస్తున్నట్లు ఆదివాసీలందరూ అసహ్యించుకుంటున్నట్లు అగమ్యగోచరంగా తయారైన సోనుబాయి బ్రతుకు మధనపడుతుంది. "నీవు ఏ పక్షమో తేల్చుకో" అని నినదిస్తున్న కంఠాలు ప్రశ్నిస్తున్నట్లుంది తనకు ఆ క్షణాన ప్రజలే తనవాళ్ళు - కానీ ఈ ప్రభుత్వం తనది కాదనే పచ్చినిజం తన భర్త చావు ఘంటాపథంగా చాటిచెపుతున్నట్లు సోనుబాయి గుర్తించింది. గంగారాం కాకిస్ (ముఠా) నంతా పెల్లుబుకుతున్న ఆదివాసీ కంఠాలు - వారి

# అడవిలో అన్నలు - ఒక పరిశీలన

—డి. మోహన్‌రావు

అరుణతార పత్రికలో సీరియల్‌గా వచ్చిన 'అడవిలో అన్నలు' నవలిక తెలుగు సాహిత్యంలో, ఒకరకంగా భారతీయ సాహిత్యంలోనే ఒక కొత్త ఒరవడికి నాంది. ఈ నవలని సమీక్షించాలనే ప్రయత్నం సుమారు నెలరోజుల నుండి సాగడంలేదు. ఇలాంటి నవలికను సమీక్ష చేయడానికి - నా వస్తువు, ప్రమాణాల పరిధికి అందకపోవడం అటుంచి ఇందులో చిత్రించిన వస్తువుకు సంబంధించిన పరిమితుల దృష్ట్యా సాగడంలేదనుకుంటాను. ఏది ఏమైనా నా పరిమిత సాహిత్య పరిజ్ఞానంతో నా ఫీలింగ్స్ కొన్ని రాయాలనిపించింది. భారతీయ సాహిత్యక్షేత్రంలో నిస్సందేహంగా సాధనలాంటి రచయితలదే ప్రధాన పాత్ర కానున్నది కనుక - ఈ సమీక్షను అర్థంచేసుకోగలరనే విశ్వాసంతో రాస్తున్నాను.

ఈ నవల దండకారణ్య ప్రాంతంలో సుమారు దశాబ్ది కాలంగా జీవన్మరణ పోరాటం చేస్తున్న దళాల జీవన నేపథ్యంలోంచి వచ్చింది. భారతదేశంలో పీడిత ప్రజానీకం సాయుధ పోరాటాలు నడపడం కొత్తకాదు. అనేక కారణాలరీత్యా అలాంటి సాయుధ పోరాటాలన్నీ స్వల్పకాలంలోనే దెబ్బతిన్నాయి. 1857లో జరిగిన తొలి భారత స్వాతంత్ర్య సంగ్రామం, బీహార్‌లో ముండా తెగ ప్రజలు బిర్సాముండా నాయకత్వంలో జరిపిన పోరాటం, ఆంధ్రప్రదేశ్‌లో నైజాం కాలంలో కొమురం భీం సాగించిన గిరిజన పోరాటం సాంప్రదాయికమైన సాయుధ పోరాటాలైతే - తెలంగాణా సాయుధ పోరాటం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో జరిగింది. మహాశ్వేతాదేవి రాసిన 'బీర్సా ముండా'; సాహు, అల్లం రాజయ్యలు రాసిన 'కొమురం భీం ; దాశరథి రంగాచార్య రాసిన 'మోదుగుపూలు' లాంటి నవలలు ఆయా పోరాటాలు జరిగిపోయిన తరువాత రావడమటుంచి, రచయితలకు ఆయా పోరాటాల చలనంతో పూర్తి

---

గుండెల్లోనుండి ఉప్పొంగివస్తున్న విప్లవనినాదాలు పట్టణాలకు తరుముతున్నాయి ఎటూ తేల్చుకోలేని జీవాలకు ఈ చావు ఆ కంఠాలతో రాజీపడడమే పరిష్కారంగా కనబడింది.

[జనవరి 31, 1989 నాడు జరిగిన కామ్రేడ్ భీమన్న 3వ వర్ధంతి సభలో ఒక రైతు చేసిన ఉపన్యాసం ప్రేరణతో.]

మమేకత్వం లేకపోవడం కనిపిస్తుంది. ఈ నవల, పోరాటంలో నిలబడి పోరాటకారులే రచించుకున్న సమకాలీన సాహిత్యం.

నక్సల్బరి స్ఫూర్తితో ప్రారంభమైన ప్రజాపోరాటం 1978 వరకు కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో ఉవ్వెత్తున లేచింది. ఈ పోరాటాలను రక్షించుకొని విస్తృతపరిచే లక్ష్యంతో (గెరిల్లా జోన్ ఏర్పాటు లక్ష్యంతో) దండ కారణ్య ప్రాంతంలోకి విస్తరించాయి. భారతదేశంలో గతంలో జరిగిన సాయుధ పోరాటాల అనుభవాలతో 1969 నుండి అనేకరకాలుగా ప్రయత్నాలు చేయబడి 1980 వరకు దండకారణ్య ప్రాంతంలో గెరిల్లా దళాలు నిలదొక్కు కున్నాయి. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌లలో విస్త రించియున్న ఈ అరణ్య ప్రాంతంలో, భారతదేశ సాయుధ పోరాట చరిత్ర లోనే ఇంత సుదీర్ఘకాలం నిలదొక్కుకొని పురోగమిస్తున్నాయి. క్లుప్తంగా ఈ చారిత్రక నేపథ్యంలోంచి 1980 నుండి తొమ్మిది సంవత్సరాల గెరిల్లాదళాల అనుభవంలోనుండి ఈ నవల రూపొందింది. ఈ నవలని మూడు భాగాలుగా, ముప్పయ్యొక్క అధ్యాయాలుగా రాశారు.

నూతన ప్రజాస్వామిక విప్లవంకోసం ప్రజాశత్రువు కేంద్రీకరణ బల హీనంగా వున్నచోట గెరిల్లా జోన్ ఏర్పాటుచేసి పల్లెలనుండి పట్నాలను చుట్టు ముట్టి విముక్తంచేసే లక్ష్యంతో గెరిల్లా దళాలు దండకారణ్య ప్రాంతంలో ఏర్ప డ్డాయి. సుమారు 50 కిలోమీటర్ల విస్తీర్ణంలో, అయిదుగురితో ప్రారంభమైన దళాలు కథాకాలానికి పదకొండు మందికి పెరిగాయి. తొమ్మిది సంవత్సరాలు దళం అడవి భౌతిక జీవితాన్ని అధ్యయనం చేయడం, గిరిజనులతో మమేకం కావడం, గిరిజన జీవితంలోని వైరుధ్యాలను పసిగట్టడం, వారిని విప్లవ చైతన్యంలోకి తేవడం, అడవిలో దోపిడి శక్తులను గుర్తించి వాటిమీద క్రమ పద్ధతిలో పోరాటం నడపడం, గిరిజనులను ప్రజాసంఘాలల్లో సమీకరించడం, తద్వారా వారిలోపల విప్లవపార్టిని, సాయుధదళాలను నిర్మించడం, దీర్ఘకాలిక సాయుధపోరాటంద్వారా దేశంలోని ప్రజలతో కలిసి రాజ్యాధికారాన్ని చేపట్టడం ఈ నవలలోని కథావస్తువు. ఈ కథావస్తువును చిత్రించడంకోసం ఎన్నుకున్న భూమిక లేదా కథనం మహారాష్ట్ర ప్రాంతంలోని గడ్‌చిరోలి జిల్లా ఆదివాసుల్లో పనిచేస్తున్న దళం రెండు నెలల జీవితం.

నవల ప్రారంభకాలపు నాటికన్నా ముందుగల దళజీవితంయొక్క అను భవాన్ని దళ కమాండర్ సాయి ఆలోచనల్లో కనిపిస్తుంది. తొమ్మిది సంవత్స

రాల దళజీవితంలో వెళ్ళిపోయినవాళ్ళు, అమరులైనవాళ్ళు, దళసభ్యుల రాజకీయ ఎదుగుదల, దళం మిల్ట్రీ రీత్యా ఎదుగుదల వస్తాయి.

నవలలో దళం పనివిధానం లోపాలతోసహా చిత్రించబడింది. దళం వివిధ ఋతువుల్లో తిరగడం, ఆహారం, షెక్ జాగ్రత్తలు, చలనం, ఆయుధాలు; రాజకీయ, మిల్ట్రీ శిక్షణ - దళం ప్రజలతో మమేకం కావడం, గిరిజన గ్రామాల్లో వైరుధ్యాల అధ్యయనం వగైరాలతోపాటు దళం పొరపాట్లు, వైఫల్యాలు, విజయాలు చిత్రించబడినాయి. దళం చేసిన దాడులను పరోక్షంగా చెప్పి, సెంట్రీ చేస్తున్న దళ సభ్యుని మిస్‌ఫైరింగ్ కొద్దిలో తప్పిన గిరిజనుని చావు, బాంబుల తయారీలో దళ సభ్యుడు కాలిపోవడం, దళ సభ్యుల్లో ఉండే మూఢ నమ్మకాలు, విరుద్ధ ఆలోచనలు, వైయక్తిక దృష్టికోణాలు వగైరా వివరంగా చిత్రించారు. మొత్తానికి దళం పనివిధానానికి రూపకల్పన చేయడానికి ప్రయత్నం చేశారు రచయిత.

ఈ నవల్లో గిరిజన ప్రాంతాలలోని ఉత్పత్తివిధానం, వైరుధ్యాలు చిత్రించబడినవి. గిరిజన ప్రాంతాలలో ఉత్పత్తివిధానం చాలా పురాతనమైంది. నీటిపారుదల సౌకర్యాలు అంతంతమాత్రమే. నీటిపారుదల వున్నాకూడా వ్యవసాయం చాలా పాత పద్ధతిలో చేస్తారు. నాట్లు పెట్టడం, రసాయన ఎరువులు వాడటం, మేలురకం విత్తనాలు వాడటం వారికి తెలియవు. కనీసం వరి నుండి ధాన్యం తీయడం పశువులచేత బంతి తొక్కించడం కాకుండా మనుషులు కాళ్ళతో తొక్కి తీస్తుంటారు. ఈ రకమైన వ్యవసాయంలో పండేది అంతంత మాత్రమే. అందులో విత్తనాలు అప్పే! ఎడ్లు పాలుకే. స్వంత భూమి వికరంగా లేదు. మొత్తంగా ప్రధానమైన వ్యవసాయం (వృత్తి) కడుపునింపడం లేదు. ఈ ప్రాంతంలో విస్తరించిన కలపను పేపరు మిల్లులకు పంపడం పని - సాంప్రదాయిక ఉత్పత్తి విధానంద్వారా రూపొందిన "ప్రీ ఫ్యూడల్ తెగ వ్యవస్థ", పేపర్‌మిల్లు పనిద్వారా వచ్చే "ఫ్యూడల్ సామ్రాజ్య వ్యవస్థ"ల మధ్య గిరిజనులు ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు.

గిరిజన గూడాలలో వంజపటేల్ లాంటి భూస్వాములున్నారు. ఇతనికి సుమారు ఇరవై ఎకరాల భూమి వున్నది (తరి, ఖుష్కి ఎంతెంతో వివరాలు ఇవ్వలేదు). ఎనిమిది నాగండ్లు కడతాడు (తరి ఎక్కువ వుండివుండాలి). పాలేర్ల శ్రమమీదనే మొత్తం భూమి కాస్తుచేయడమే కాకుండా ఆ గూడెంలోని గిరిజనులంతా అతనికి పనులు చేస్తారు. కొంత శ్రమ ఉల్పాగా, మరికొంత

నామమాత్రపు కూలికి. ఈ భూమిమీద వచ్చే ఆదాయంకాక 25 శాతం వడ్డీ రేటు ఇచ్చే అప్పుల ఆదాయం, పశువులు పాలుకు ఇవ్వడం, ధాన్యం బదులు ఇవ్వడం లాంటి వ్యవహారాలద్వారా వచ్చే ఆదాయం. మొత్తంగా దోపిడీమీదనే బతుకుతుంటాడు. దోపిడి స్వరూపం కొంత సాంప్రదాయకంతో కలిసివుంటుంది. దళం మైదాన ప్రాంతంలో చేపట్టినట్టుగా ప్రధానంగా భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటం చేపట్టినట్టులేదు కనుకనే మైదానప్రాంత భూస్వాముల వలె తగువుకు దిగక దళంతో సర్దుకుపోయే ఆలోచనలో ఉన్నాడు. భయంకూడా వున్నది. అందుకే దళం చెప్పగానే రైతులకు వడ్డీ లేకుండా విత్తనాలు ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. ఇలాంటి భూస్వాములందరిమీద అహిరిరాజు విశ్లేశ్వ్రరావు వున్నాడు. అహిరిరాజు సాంప్రదాయం పేరిట చేసే దోపిడిని దళం కూడ పసిగట్టడం కనిపిస్తుంది. గిరిజనులలో పేద మధ్యతరగతి, ధనికరైతులు రైతుకూలీలు లాంటి విభజన స్పష్టంగా కన్పించదు. ఆర్థిక నేపథ్యం స్థిరపడని భూస్వామ్యం కాగా సాంప్రదాయాలుమాత్రం ప్రీ ఫ్యూడల్ తెగ లక్షణాలుగా కనిపిస్తాయి. ఈ నవలలో ఈ స్థితిని ఎటు తీసుకుపోవడం? వ్యవసాయ సంబంధాలలో, ఉత్పత్తిలో ఎలాంటి మార్పులు తేవడం? వాటి ఫలితాలు ఎలా వుంటాయి? మొదలగు ప్రశ్నలు లేవనెత్తబడినాయి.

గిరిజన గూడాలలో వ్యాపారంలో వస్తుమార్పిడీ, డబ్బు చెలామణి రెండూ వుంటాయి. బయటనుండి వచ్చి నిత్యావసర వస్తువులు అమ్మే చిన్న వ్యాపారులు - కలప కూలీతోపాటు వచ్చిన సంస్కృతి మూలంగా విచ్చలవిడిగా తిరిగే సమ్మక్క, అడవి అధికారులు - అడవి సంపదలు - బాబా ఆప్టే వైద్యం - దళాలు ప్రవేశించిన తరువాత ప్రభుత్వం తలపెట్టిన సంస్కరణలు - సూర్యరశ్మి వీధి దీపాలు వగైరా చిత్రించబడినాయి.

గిరిజన సాంప్రదాయాలు పట్టుకోల్పోయే దశలో కనిపిస్తాయి. సాంప్రదాయాల బారిన పడే గిరిజనులు వాటినుండి తప్పించుకోవడానికి పెనుగులాడటం కనిపిస్తుంది. కోర్కి అనే రైతు తన బిడ్డ పెండ్లిబాపతు మూడో భోజనం ఊరందరికి పెట్టజాలక దళాన్ని ఊరివాళ్ళకు నచ్చచెప్పమంటాడు. మంత్రం పంచాయితీ - సాంప్రదాయాన్ని ఎదిరించేవాళ్ళకు పన్నిన ఒక ఉచ్చు అని తెలుతుంది. ఈ రెండు విషయాల్లో దళానికి స్పష్టమైన వైఖరి వున్నాకూడా గూడెంవాళ్ళకు చెప్పలేకపోయింది. కారణాలు ఏమైనాగాని.

జైని అనే యువతికి రవికెలు తీసివేయడంగురించి మహిళా సభ్యుల చొరవతో తప్పించి జైనిని దళంలోకి తీసుకున్నారు. మొదటి రెండు సంఘ

టనలలో గూడెం యావత్తు ఒకరిద్దరికి ఎదురుగా మోహరించి వున్నది. జైని సమస్య ఒక కుటుంబంలోవి సమస్య. ఇలాంటి సున్నితమైన వ్యవహారాలలో ప్రజలమధ్య వైరుధ్యాల పరిష్కారంలో దళం ఎంతో ఓపికతో వ్యవహరించడం కనిపిస్తుంది.

ఇక ఈ నవలలో అనేక సందర్భాలలో స్త్రీ సమస్య చర్చకు వస్తుంది. కావేరి, జైని, సమ్మక్క, పూలక్క, సుగుణక్క, రామక్క, పార్వతి, సీత లాంటి పాత్రలద్వారా వారి జీవితాలద్వారా చాలా వివరంగా చర్చించబడినవి. గిరిజన సాంప్రదాయాలు స్త్రీలపట్ల వ్యవహరించిన మొరటు పద్ధతి, పేపరు మిల్లు కూలి తెచ్చిన సమస్యలవలన తలెత్తిన సంక్షోభం, వీరికి అండగా నిలిచిన దళాలు తెచ్చిన కొత్త సంస్కృతి - వీటి పూర్వాపరాలు, సమస్యల పుట్టుక, అభివృద్ధి, పరిష్కారందాక వివరంగానే చర్చించబడింది.

ఈ మొత్తం సామాజిక పరిస్థితిలో దళం పూసల్లో దారంలాగా కనిపిస్తుంది. దళం గిరిజన గ్రామాలలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ జీవితంలోకి ప్రవేశించడమే కాకుండా వాటి మార్పుగురించి ప్రయత్నం చేయడం - గిరిజన పంచాయతులు, వైద్యం, విత్తనాలు, ఫారెస్టు కంట్రాక్టర్ల దోపిడివి ఎదిరించడం లాంటివి చేస్తూ, గిరిజనుల్లో సంఘాల నిర్మాణం, పార్టీ సెల్ నిర్మాణం, వారి చైతన్యం పెంచడానికి రాజకీయ తరగతులు నిర్వహించడం, వాళ్ళను దళాల్లో సమీకరించడం, మిలీట్రీ శిక్షణ ఇవ్వడం లాంటి పనులు చేపట్టడం చిత్రించబడింది

మొత్తంగా దండకారణ్య ప్రాంతంలో దళాల పనివిధానానికి అద్దంపట్టడానికి ప్రయత్నం చేసింది.

నవలానిర్మాణం గురించి - నవలలోని వస్తువు చిత్రణలో జరిగిన లోపాలు - అంతిమంగా అవి కలిగించే పరిణామాలగురించి ఆలోచించినపుడు కొన్ని లోపాలుగా కనిపిస్తాయి. (అవి నిజంగా లోపాలు అవునో కాదో) ఆలోచించి పనికివచ్చే అంశాలుంటే రాబోయే సాహిత్యంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు ఏమిటో సాధన ఆలోచించగలరనే విశ్వాసంతో రాస్తున్నాను.

నవల ముప్పయ్యొక్క అధ్యాయాల సమాహారంగా మాత్రమే కనిపిస్తుంది. నిర్మాణం పటిష్టంగా లేక చాలా అధ్యాయాలు పునరుక్తితో నిండి పేలవంగా ఉన్నాయి. గతితార్కిక నేపథ్యంలో కథ నడపడం కాకుండా అనగా కథలో అభివృద్ధిలో భాగంగా కాకుండా తోచిన ఘటనలు రాసినట్లుగా అనిపిస్తుంది. ముప్పయ్యొక్క అధ్యాయాలలో దళం చలనం అదీ ఒకేరకమైన

చలనం - సీన్సు-తిండి-మార్చింగ్-సెంట్రీ-కాలకృత్యాలు రాయబడినవి. ఇది ఎందువల్ల జరుగుతుందంటే స్పష్టమైన ప్లాను లేకపోవడంవలన. వస్తువు, ఆ వస్తువును చెప్పడానికి అవసరమయ్యే కథనం, వాతావరణం, పాత్రలు వగైరా స్పష్టంగా నిర్ణయించుకుంటే ఈ పునరుక్తులుండవు. సాధ్యమైనంత వరకు భిన్న రుతువులు, భిన్న వాతావరణం, భిన్న కోణంలోంచి చెప్పడం ద్వారా పాఠకులకు ఎక్కువ జీవితాన్ని హృద్యంగా చెప్పగలుగుతాము. (ఉదా॥ 'కొడుకులు-కూతుళ్ళు' నవల, కొంత రొమాంటిసిజం వున్నాకూడా 'ప్రశాంత ప్రత్యూషాలు' పరిశీలిస్తే బాగా అర్థమవుతుంది.)

ఈ నవలలోని వస్తుపరమైన ప్రధానలోపం - వైరుధ్యాలను చిత్రించినంతగా వైరుధ్యాల అభివృద్ధి, పరిష్కారం చిత్రించబడలేదు. నిజానికి దళం యొక్క ఉనికి, చైతన్యం ఈ వైరుధ్యాల పరిష్కారపు దిశలోనే వున్నది. అడవిలోకి మొదట దళాలు ప్రవేశించినపుడు దళం - అడవికి మధ్య వైరుధ్యం సర్వేద్వారా దళం ప్రశ్నించుకున్నది. రాజు విశ్వేశ్వర్రావు, పంజ పటేల్ లాంటి భూస్వామిక శక్తులు, ఫారెస్టు కంట్రాక్టర్లు, పేపర్ మిల్లు, అడవి అధికారులు, వ్యాపారులు గిరిజనుల మధ్య వైరుధ్యం.

దళం అడవిలో ప్రవేశించిన దగ్గరినుంచి (నూతన ప్రజాస్వామిక విప్లవంకోసం గెరిల్లా జోన్ ఏర్పాటు - దాన్ని అడ్డుకోవడం) ప్రభుత్వ బలగాలైన పోలీసులకు దళాలకు మధ్య యుద్ధమే జరుగుతున్నది. ఈ నవలలోనైతే దళం తిరిగిన ప్రాంతంలోనైతే పెద్ది శంకర్ అమరుడయిన (1980 నవంబర్) నాటినుండి ఈ సంఘర్షణ కొనసాగుతూనే వున్నది. గెరిల్లా జీవితంలో ప్రధానమైన ఈ సంఘర్షణ మిలిట్రీ అనుభవానికి ముఖ్యమైంది. దండకారణ్య ప్రాంతంలోని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడి వ్యూహాన్ని నిర్ణయించుకోవడానికి తరచూ సమావేశమవుతున్నట్లుగా నవలలో రాయబడింది. ప్రభుత్వం సంస్కరణలు ఒకవైపు చేస్తూనే చుట్టుముట్టి మట్టుపెట్టడానికి ప్రయత్నం చేస్తున్నది. ప్రభుత్వ తయారి, నిర్బంధం, దాడులు, మరొకపక్క ఆత్మరక్షణ, గెరిల్లా పోరాటంలోని ముఖ్యమైన అంశం శత్రువును చికాకుపర్చడం - ఏమరుపాటుగా ఉన్నప్పుడు దాడి - వగైరా మిలిట్రీ అంశాలు క్రమపద్ధతిలో చిత్రించబడలేదు దళ జీవితం - చలనం ప్రభుత్వ బలగాల చలనంమీద ఆధారపడి వుంటుంది. ఆ ప్రస్తావన దళజీవితంలో ఒక ముఖ్యమైన అంశం. నవల చివరన తప్ప ఈ ప్రస్తావన నవలలో లేదు. అందుచేతనే నవల చాలా

డల్‌గా నడిచింది. ప్రభుత్వ దాడి, సంస్కరణలపరంగా సాయుధంగా దానికి సిద్ధపడటం, తిప్పికొట్టడంలోనే దళం బతికి బట్టకట్టి ఎదిగింది కూడా.

నవల ముగింపుకు సంబంధించి - చావుతో ముగించడం సాంప్రదాయక మైనదే (నిజానికి పెద్ది శంకర్ అమరుడైన దగ్గరినుండి నవల మొదలైతే ఎలా వుంటుంది?). గ్రామంలోకి పోలీసులు వచ్చారని దళానికి ముందు తెలుసు ఇన్‌ఫార్మర్లు బలంగా వున్న ప్రాంతం. అదివరకే దళ సభ్యులిద్దరు పోలీసుల బారిన పడకుండా కొద్దిలో తప్పించుకున్నారు. ఇవన్నీకూడా శత్రువు కదలిక లను తెలియజేస్తున్నవి. అలాంటి చోటునుండి దళం ఆత్మరక్షణార్థం ఎందుకు తప్పుకోలేదు? పోనీ అలాంటి పరిస్థితిలో అక్కడ ఉండటానికి బలమైన కారణం ఏదైనా ఉందా? అదీ చెప్పలేదు. దళం ఎదురుదాడి చేసే ఉద్దేశంలో ఉన్నట్టుకూడా చెప్పలేదు గ్రామానికి దళం విశ్రమించిన డెన్ దగ్గరే ఉన్న ట్టుగా అర్థమవుతున్నది. ఇదికూడా దళ జీవితంలో తప్పనిసరయిన అంశమే కావచ్చు. కాని అలాంటి సమయంలో సెంట్రీ పోస్టు ఎంచుకోవడంలో లోపం అయినా కావాలి లేదా సెంట్రీ అజాగ్రత్త అయినా కావాలి. శత్రువు తుపాకి పేలి ఇంకో సెంట్రీ దళ కమాండర్ సాయి గుండెలో దూసుకుపోయేదాక తెలి యనే తెలియదు. ఈ రెండు అంశాలూ సంభవమే కావచ్చు. తిండి తినేదగ్గర పది సంవత్సరాల అనుభవం గల కమాండరే సెంట్రీ చేస్తుండగా శత్రువు గుండు పేలడం, కమాండర్ చనిపోవడంకూడా వాస్తవంగా జరిగి ఉండవచ్చు. (అనేకమార్లు చాకచక్యంగా తప్పించుకున్న అనుభవాలున్నాయికూడా) అతి సూక్ష్మ విషయాలుకూడా పసిగట్టి రాయగలిగిన రచయిత ఇంత అసంబద్ధ శత్రు దాడినిఎందుకు చిత్రించినట్టు? ఎందుకు చిత్రించినా ఇలాంటివి ప్రధాన ఉద్దే శాన్ని దెబ్బతీస్తాయి.

మొత్తం నవలలో వాస్తవ సంఘటనలకు సాహిత్యరూపం ఇవ్వడానికి ఇలాంటి తప్పులు రాశారేమో? (బాంబు తయారీలో జోగన్న కాలిపోవడం కూడా) అట్లని కల్పితం లేదని కాదు (ఎ.కె. 47 రైఫిల్ డిప్యూటి కమాండర్ ముందు పడటం).

అయితే మొత్తంగా లోపాలు లేకుండా అన్నీ విజయాలే చిత్రించాలనడం కాదు. లోపాలనుకూడా వాటి పుట్టుక, అభివృద్ధి, పరిష్కారండాకా చూయించ కుంటే వ్యతిరేక ఫలితాలు వస్తాయి.

సాధన మొత్తం దళాల అనుభవాల నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని కొంత ప్లాను ప్రకారం రాస్తే ఈ లోపాలు చాలావరకు రాకుండా వుండేవేమో?

*రిపోర్టులు :*

# ప్రమాద స్థితిలో దక్షిణ భారత ధాన్యాగారం

## —పశ్చిమ గోదావరి జిల్లా విరసం యూనిట్

మహారాష్ట్రలో నాసిక్ చేరువలో పడమటి కనుమల మధ్య త్రయంబకం వద్ద గోదావరి నది పుట్టింది. ఆంధ్రప్రదేశ్‌లో 225 మైళ్ళు ప్రవహించే గోదావరి నది మొత్తం పొడవు 900 మైళ్ళు. భారత దేశ వైశాల్యంలో 10 వ వంతు. గోదావరి అరగాణి వైశాల్యం 1,12,000 చదరపు మైళ్ళు. మంజీర, మానేరు, ప్రాణహిత, ఇంద్రావతి మరియు శబరి గోదావరికి ముఖ్య ఉపనదులు అఖండ గోదావరి తూర్పు కనుమలు దాటిన తర్వాత ధవళేశ్వరంవద్ద రెండుపాయలుగా చీలినది. ఒకటి గౌతమి, రెండు వశిష్ట, వశిష్టనుండి వైనతేయం అనే పాయ విడిపోయింది. గౌతమి, వశిష్ట, వైనతేయం వేరువేరు ప్రదేశాలలో బంగాళాఖాతంలో కలుస్తున్నాయి.

అఖండ గోదావరిపై రాజమండ్రి దగ్గరలో ధవళేశ్వరం, విజ్జేశ్వరంల మధ్య 1947-52లో తూర్పు ఇండియా కంపెనీచే ఆనకట్ట నిర్మింపబడినది. భారత దేశంలోకి స్వేచ్ఛా వ్యాపారం పేరిట వచ్చిన తూర్పు ఇండియా కంపెనీ మన దేశంలో ప్రజలను అనేక విధాల దోపిడీలకు గురిచేసి మన దేశ ప్రజలను నిర్భాగ్యులను చేశారు. వీరి దోపిడీ మూలంగా ప్రజల్లో కొనుగోలు శక్తి క్షీణించిపోయింది. కరువుకాటకాలతో దేశ ప్రజలు సతమతమయ్యారు. ప్రపంచ వ్యాపితంగా 19 వ శతాబ్దపు రెండవ అర్ధభాగంలో పెట్టుబడిదారీ విధానం స్వేచ్ఛా

---

అయితే సాధన కిది మొదటి నవల కావడం - ఇతరత్రా రాయడం వీలుకాని అనేకానేక అననుకూలమైన పరిస్థితుల మూలంగా నిర్మాణం సరిగ్గా రాకపోవచ్చును. సాధన లోగడ అనేక వ్యాసాలు రాసివున్నారు. వాటి ప్రభావంకూడా నవలా నిర్మాణంమీద కనిపిస్తుంది.

రాయడంలోని లోపాలకన్నా ఈ నవలలోని దళ జీవితం ఉదాత్తమైంది. అది భారత దేశ వర్తమాన చరిత్రకు దిక్సూచి. ఈ చరిత్ర చిత్రీకరణలో ఈ నవల ప్రారంభం.

సాధనలాంటి రచయితలు మరింత నైపుణ్యంతో సాహిత్య సృజన చేయగలరనే తపనతో...



వ్యాపారపు పోటీనుండి ద్రవ్య పెట్టుబడిదారీ విధానంలో అడుగుపెడుతున్న సమయంలో ఇంగ్లాండులో పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం అధికారాన్ని కైవశం చేసుకుంది. ఇంగ్లాండులో పారిశ్రామిక అభివృద్ధికి అనుగుణ్యంగా భారత దేశ ఆర్థికవిధానాన్ని మలిచే క్రమం ప్రారంభమయింది. భారత దేశాన్ని ఇంగ్లాండుకు వ్యవసాయ వలసగా (అగ్రికల్చరల్ కాలనీ) మార్చే క్రమంలో వ్యవసాయంలో నీటిపారుదల పథకాలకు బ్రిటిష్ పెట్టుబడి భారత దేశంలోకి ఎగుమతైంది. బ్రిటిష్ పరిశ్రమలకు ఉపయోగపడే పంటలను ప్రోత్సహించడం ప్రారంభం అయ్యింది. ఉదాహరణకు : కాఫీ, టీ, రబ్బర్, నీలిమందు, చెరకు, ప్రత్తి, పొగాకు, జనపనార.

ఈ చారిత్రక పరిస్థితులలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కొన్ని ప్రదేశాలలో నీటిపారుదల ప్రాజెక్టులను అభివృద్ధిచేసి వారికి కావలసిన ముడిసరుకులను సంపాదించుకోగలిగారు. ఈ విధంగా నిర్మించిన ప్రాజెక్టులు రెండు దశలుగా అభివృద్ధిచెందాయి. మొదటి దశలో కావేరి ఉపశాఖ అయిన కాలీరూన్‌పై "ఎగువ" "దిగువ" ఆనకట్టలూ, తూర్పు యమున, పడమట యమున నిర్మాణం గంగా కాలువ నిర్మాణం ధవళేశ్వరం ఆనకట్ట నిర్మించారు. రెండవ దశలో పంజాబులో సట్లెజ్, చీనాబ్ కాలువలు, దిగువ గంగా పనుల పూర్తి సంయుక్త రాష్ట్రాలు (ఇప్పటి ఉత్తరప్రదేశ్) లోని చేత్వి కాలువలు కటక్ హుబ్లీల మధ్య కాలువల నిర్మాణం పూర్తిచేశారు.

సర్ ఆర్థర్ కాటన్‌చే రూపకల్పన చేయబడ్డ ధవళేశ్వరం ఆనకట్ట ప్రధానంగా చెరకు పంటను అభివృద్ధిచేయడానికి ఉద్దేశించబడినది. కాటన్ నివేదికలను పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్లమౌతుంది. ఆనకట్ట బ్రిటిష్ సామ్రాజ్యవాదుల అవసరాలను పరిపూర్తిచేయడానికి నిర్మించబడింది. సర్ ఆర్థర్ కాటన్ ఈ ప్రాజెక్టును రూపకల్పన చేసిన వ్యక్తి మాత్రమే. అతని మేధస్సువల్ల లాభపడింది బ్రిటిష్ సామ్రాజ్యవాదమే. ఈ చారిత్రక పరిశీలన లేకుండా భారత పీడిత ప్రజానీకంపై అపారమైన ప్రేమాభిమానాలు కలిగిన వ్యక్తిలా కీర్తించడం చరిత్రను వక్రీకరించే బానిస భావజాలమౌతుంది.

1847లో గోదావరి డెల్టాను అభివృద్ధి చేయాలంటే చేపట్టవలసిన కార్యక్రమాల గురించి సర్ ఆర్థర్ కాటన్ ఈ విధంగా తెలియచేశారు. (1) ఏటి వరదలవలన పంటలు పాడుకాకుండా నది పొడవునా ఎత్తైన గట్లు పోసి బలపర్చాలి. (2) ఆనకట్టను, నీటిపారుదల కాలువలను ఏర్పరచి నదియొక్క-

నీటిమట్టాన్ని పెంచి మెరకగా ఉన్న పొలాలకు నీరు పారించడం. (3) అధిక వర్షాలవల్ల, ఏటి వరదలవల్ల పల్లపు ప్రాంతాల్లో చేరిన నీరు త్వరగా సముద్రంలోకి పోయేటట్లు మురుగుకాల్వలను ఏర్పాటుచేయడం. (4) రోడ్లు, వంతెనలు కట్టి పెద్ద మార్కెట్లవద్దకు, సముద్రతీర రేవులవద్దకు పంట సరుకుల రవాణా సదుపాయం కల్పించుట. ఈ సూచనలను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఆమోదించిన వెంటనే 1847లో 16 లక్షల రూపాయల అంచనాతో డెల్టా అభివృద్ధి కార్యక్రమం ప్రారంభమైంది. ఆనకట్ట నిర్మాణం, పంటకాల్వలు, మురుగుకాల్వల నిర్మాణం పకడ్బందీగా అమలుజరిగి అనుకొన్న విధంగా 1852 నాటికి ఆధునిక గోదావరి డెల్టా రూపకల్పన పూర్తి అయింది.

ఈ ప్రాజెక్టువలన 10 లక్షల ఎకరాల సాగుభూమికి నీరు అందుతుంది. వరి, చెరకు పంటలకు పూర్తి గ్యారంటీ ఇవ్వబడింది. జొన్నలు, సజ్జలు, రాగులు మొదలగు చిరుధాన్యాల స్థానే వరి, చెరకు పంటలు వేయబడ్డాయి. వ్యవసాయోత్పత్తి ప్రాజెక్టు నిర్మాణం తర్వాత ఒకసారి 30 లక్షల రూపాయల నుండి 2 కోట్ల రూపాయలకు పెరిగింది. భూమిశిస్తు వసూలు 22 లక్షలనుండి 60 లక్షల రూపాయలకు పెరిగింది. ఈ విధంగా సామ్రాజ్యవాదుల అవసరాలకై నిర్మించబడిన ఈ ప్రాజెక్టువలన గోదావరి డెల్టాతోపాటు ప్రజల జీవన పరిస్థితులు మెరుగుపడ్డాయి. 130 సంవత్సరములపాటు ఈ ప్రాజెక్టు ఆధారంగా గోదావరి డెల్టా దక్షిణ భారతానికి ధాన్యాగారంగా వర్ధిల్లగలిగింది.

పాత ఆనకట్ట శిథిలమవడంతో కొత్త బ్యారేజి నిర్మాణాన్ని నేటి భారత పాలకవర్గం 1970లో ప్రారంభించింది. నివేదిక ప్రకారం పాత ఆనకట్టకంటే కొత్తది 4 అడుగుల ఎత్తున నీరు నిల్వచేయవలసి ఉంది (మొత్తం 45 అడుగులు). కొత్త బ్యారేజి పాత ఆనకట్టను ఆధారంచేసుకొని దానికి 132 అడుగుల దూరాన నదికి ఎగువగా కట్టబడింది. దీని మూలంగా పాత ఆనకట్ట కాలంచెల్లి కొట్టుకుపోతుంటే కొత్త బ్యారేజికి ప్రమాదం ఏర్పడుతుంది. దీనితోపాటు కాంట్రాక్టర్ల మోసాలవల్ల బ్యారేజికీ గ్యారంటీ లేకుండాపోయింది. అవకతవకలతోనైనా కొత్త బ్యారేజి నిర్మాణం చేయగలిగారు. కాని ఇంకా మిగిలిన పనులు పూర్తిచేయవలసి ఉంది. అవి :

1. పెంచిన బ్యారేజి ఎత్తుకు సమంగా గోదావరి గట్లను పెంచి పటిష్టం చేయలేదు.
2. కొత్త బ్యారేజితోపాటు నీటిపారుదల కాలువలను, లాకులను, తూములను ఆధునీకరించలేదు.

3. శిథిలమైన పాత మురుగునీటి వ్యవస్థ స్థానే ఆధునిక మురుగు నీటి వ్యవస్థ నిర్మాణం కాలేదు.
4. రవాణా సదుపాయాలు పునర్నిర్మించబడలేదు (ఒకటి రెండు వంతెనలు తప్ప).

1847లో సర్ ఆర్థర్ కాటన్ ఆనకట్టతోపాటు పైన వివరించిన పనులను సమర్థవంతంగా పరిపూర్తి చేయడంవల్ల ఆధునిక డెల్టా రూపకల్పన జరిగి 130 సంవత్సరాలు సుస్థిరంగా నిలవగలిగింది కాని నేటి పాలకవర్గం శిథిలమైన పాత గోదావరి డెల్టా స్థానే కొత్త నీటిపారుదల వ్యవస్థను పకడ్బందీగా ఏర్పరచలేకపోయింది. ఈ కారణాలవల్ల 1983, 86, 89 వరదలలో డెల్టాలో పంటలన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. మిగిలిన సంవత్సరాలలో దిగుబడి తగ్గుతూ వచ్చింది. దీనికితోడు 1960లో అమెరికా ఫోర్డ్ ఫౌండేషన్ రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు సంయుక్తంగా పశ్చిమ గోదావరి జిల్లాలో సాంద్ర వ్యవసాయ పథకాన్ని ప్రవేశపెట్టి హరితవిప్లవం తెస్తామని వ్యవసాయోత్పత్తులు పెంచాలంటే మేలురకమైన విత్తనాలు వాడాలంటూ హైబ్రీడ్ పొట్టి వంగడాలను ప్రవేశపెట్టారు. అప్పటివరకూ ఉన్న సాంప్రదాయక ఎరువుల స్థానంలో రసాయనిక ఎరువుల వాడకం తప్పనిసరి అయింది. దోమపోటు, కొత్తరకం తెగుళ్ళు పొట్టి వంగడాలతోపాటు దిగుమతి అయినవి. సస్యరక్షణకై పురుగుమందుల వాడకం అనివార్యమైంది (నేడు మార్కెట్‌లో లభ్యమవుతున్న పురుగుమందులన్నీ గుత్త సంస్థల ఉత్పత్తులే) ఎరువుల, పురుగుమందుల, తదితర అవసరాలకు పెట్టుబడి అవసరమైంది. పెట్టుబడికొరకు వ్యవసాయదారుడు వడ్డీ వ్యాపారులపైన, పరపతి సంఘాలపైన ఆధారపడవలసి వచ్చింది (పరపతి బ్యాంకులన్నీ సామ్రాజ్యవాదులపై ఆధారపడివున్నాయి). ఈ విధంగా సాంద్ర వ్యవసాయ పథకం పేరుతో నేటి భారత పాలకవర్గంచే రైతు సామ్రాజ్యవాదుల విష కౌగిలిలో బంధించబడ్డాడు. సాంద్ర వ్యవసాయ పథకంలో ముఖ్యాంశాలైన పంటకాలువలను, మురుగునీటి కాలువలను ఆధునీకరించడంలో ప్రభుత్వం నిర్లక్ష్యం చేసింది. దీనితో మొత్తం డెల్టా వ్యవస్థే ప్రమాదంలోకి నెట్టబడింది. దక్షిణభారత ధాన్యాగారం హరించుకు పోకముందే ప్రభుత్వం కళ్ళుతెరవాలి. లేకుంటే రైతాంగమే ప్రభుత్వ కళ్ళు తెరిపించి దక్షిణభారత ధాన్యాగారాన్ని రక్షించుకొంటారు.



# బాధితులను కాటేసిన 'ప్రభుత్వ సాయం'

—వి. సుబ్రహ్మణ్యాం

8-11-1989 రాత్రి 12 గంటలకు ప్రకృతి సృష్టించిన భయంకరమైన బీభత్సం మూలంగా దెబ్బతిన్న కావలి పరిసర ప్రాంతాలను సందర్శించిన విరసం, పౌరహక్కుల సంఘం ప్రతినిధులు సేకరించిన వాస్తవాలను మీ ముందుంచడమే ఈ వ్యాసం ఉద్దేశం.

తుఫాను సృష్టించిన ప్రళయానికి కావలి చుట్టుపక్కల గ్రామాలలోని చిన్నచిన్న గుడిసెలన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. పశువులు, మేకలు ఎన్నో మరణించాయి. దాదాపు వందమందికి పైగా మరణించారు. రేకులతో, పెంకులతో కప్పబడివున్న ఇళ్ళు బాగా దెబ్బతిన్నాయి. రైతులు పంటలకోసం పోసుకున్న నార్లు నాశనమయ్యాయి. మధ్యతరగతి, చిన్న, సన్నకారు రైతులు దాదాపు రెండు రోజులపాటు ఒట్టి చేతులతో, ఎండిన కడుపులతో దిక్కుతోచని స్థితిలో భవిష్యత్తు అంధకారమై వస్తులున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే - ముఖ్యంగా పేదలలో కట్టుబట్టలతో బతికి బయటపడిన వారి శరీరాలే వారి స్థిర చర ఆస్తులుగా మిగిలాయి. 240 కి మీ. వేగంతో వీచిన ఈదురు గాలులు జామ, మామిడి, సపోటా, జీడిమామిడి వంటి వ్యాపారపరమైన తోటలను పూర్తిగా నాశనంచేశాయి. మహావృక్షాలే నేలకూలాయి. బావులలో ఆకులు అలములు చేరి తాగడానికి వీలులేని విధంగా నీరు తయారయ్యాయి. కలరావ్యాధి సోకి కావలి పట్టణంలోనే దాదాపు ముగ్గురు చనిపోయారు.

ప్రభుత్వ గంభీర ప్రకటనలు - వైఫల్యాలు : ప్రభుత్వం రేడియో, టివి, పత్రికలలో పెద్దయెత్తున 'యుద్ధప్రాతిపదికపై సహాయకచర్యలు' చేపడుతున్నట్టు ప్రకటించింది. కాని ఆ సహాయక చర్యలు అమలైన తీరు, వాటి ఫలితాలు భిన్నంగా వున్నాయి.

ప్రభుత్వం మొట్టమొదటగా, పూర్తిగా దెబ్బతిన్న ఒక్కొక్క గుడిసెకు 500 రూ., పాక్షికంగా దెబ్బతిన్న గుడిసెకు 200 రూ. అని ప్రకటించింది (ప్రభుత్వం 'గుడిసె' బదులు 'ఇల్లు' అనే వుపయోగించింది). డబ్బుతోపాటు పది కిలోల బియ్యం; 100 రూ.లు విలువచేసే దుప్పట్లు, పంచలు; ఆ తరువాత 100 రూ. విలువచేసే వంటసామగ్రికూడా పంపిణీ చేస్తారని ప్రకటించింది.

గ్రామాలలో ఎన్ని ఇళ్ళు పూర్తిగా, పాక్షికంగా దెబ్బతిన్నాయో లెక్క గట్టడానికి జిల్లా కలెక్టర్ కొన్ని బృందాలను ఏర్పాటుచేసి పంపారు. ఈ అధికార బృందాలకు సర్వే జరిపే క్రమంలో గ్రామాలలో మునసబులు సాయం చేశారు. ఈ మునసబులు గ్రామంలోని రాజకీయ కక్షలు, ముఠా తగాదాలనుపయోగించుకొని తమ వర్గ స్వభావాన్ని ప్రదర్శిస్తూ, కొన్ని సెక్షన్ల ఇళ్ళను మాత్రమే రికార్డుచేయించి, మిగిలినవాటికి ఏదో కారణం చెప్పి తిప్పించారు. ఈ విధంగానే కాకుండా ఇంకా అనేకరకాలుగా తుఫాను బాధితులకు ప్రభుత్వ సాయం దక్కకుండా పోయింది. ఉదాహరణకు తుఫాను తాకిడికి గురయిన గ్రామాలలో రుద్రకోట గ్రామాన్నే తీసుకుంటే, ఈ గ్రామంలో వడ్డెర కులానికి చెందిన పాళెం ఒకటుంది. ఈ వడ్డెరపాళెంకు చెందినవారు 300 మంది ఉన్నారు. ఈ పాళెంలోని కుటుంబాలు నెలలో పదిరోజులు ఇతర ప్రాంతాల్లో కూలీలుచేసి మిగిలిన 20 రోజులు గ్రామంలో వుంటారు. కొన్ని కుటుంబాలలో మగవారు ఇతర ప్రాంతాలకు కూలీలకు వెళితే, ఆడవాళ్ళు ఇళ్ళలోనే ఉంటారు. తుఫాను తాకిడి వార్తవిని ఆ కుటుంబాలవారు గ్రామానికి తిరిగివచ్చారు. అయితే అధికార బృందాలు అప్పటికే సర్వే ముగించడంతో వారు ఎంత మొత్తుకున్నా తిరిగి వారి పేర్లు తుఫాను బాధితుల లిస్టులో చేర్చలేదు. కొంతమంది పేర్లను భర్త లేడనే సాకుతో నమోదుచేయలేదు. ఈ విధంగా ప్రభుత్వం ప్రకటించిన కనీస సాయం తుఫాను బాధితులకు ఎండమావిగా తయారైంది.

సాధారణంగా పోలీసులకే మెదడు మోకాలులో వుంటుందని చెబుతుంటారు. కాని రెవిన్యూ సిబ్బందికికూడా మోకాలులోనే వుంటుందనే విషయం తుఫాను బాధితులతో వారు ప్రవర్తించిన తీరు తెలియజేస్తుంది. తుఫాను బాధితులకు సక్రమంగా, నిజాయితీగా ప్రభుత్వ సాయం అందించాలంటే, సర్వే బృందాలు సరాసరి బాధితుల గుడిసెల దగ్గరికెళ్ళి, విచారించి వారి పేర్లు నమోదు చేయాలి. కాని వాళ్ళు చేసిందేమిటి? తమ కళ్ళముందే గుడిసె కూలినట్టు కనబడుతున్నా పట్టించుకోకుండా రేషన్ కార్డు ఉంటేనే నమోదు చేస్తామని చెప్పారు. అసలు ప్రభుత్వమే రేషన్ కార్డులు మంజూరు చేయనప్పుడు వారికి అవి ఎలా లభిస్తాయి? ఒకవేళ మంజూరు చేసివున్నా గుడిసె పైకప్పు ఎగిరిపోయి, గోడలు విరిగిపోయి, గాలి తీవ్రతకు గుడిసెలోని వస్తువులు ఎక్కడెక్కడో చెల్లాచెదరైపోతే రేషన్ కార్డులు ఎక్కడినుండి తేగలరు? ఇవేవీ సర్వే బృందాలకు పట్టలేదు.

మొదటగా సర్వే బృందాలలో ఎవరైతే బాధితుల ఇళ్ళ లెక్కలు తీయ డానికి వెళ్ళారో, అదే బృందాలలోని వ్యక్తులు డబ్బులుకూడా పంపిణీచేశారు. దీనితో ప్రభుత్వ రికార్డులలో ఇళ్ళ సంఖ్యను ఎక్కువ చూపించి, మిగిలిన పేర్లకు దొంగ సంతకాలు చేసి తమ జేబులు నింపుకున్న బృందాలుకూడా ఉన్నాయంటే ఆశ్చర్యం, ఆవేదన, ఆక్రోశం అన్నీ ముంచుకొస్తాయి. బహుశా ఇదేనేమో 'శవాలపై పైసలు ఏరుకోవడమంటే'!

కొన్ని గ్రామాలలో ఈ బృందాలు పాక్షికంగా వ్యవహరించినందుకు నిరసనగా వారిని వెనక్కి తిప్పి పంపారు. అటువంటి గ్రామాలలో మరల సక్రమంగా తుఫాను బాధితులందరికీ పంపిణీ చేయడం జరిగింది.

ఇదిలా వుండగా ముఖ్యమంత్రి రామారావు కావలిని సందర్శిస్తూ అనేక హామీలను గుప్పించాడు. అందులో ఒకటి పదివేల 'పక్కా ఇళ్ళ' నిర్మాణం. "ప్రభుత్వ పక్కా ఇళ్ళే తుఫాను తాకిడికి నిలుస్తున్నాయి కాబట్టి మేము వాటినే నిర్మించదలిచాం" అని గంభీరంగా ప్రకటించాడు.

అయితే మేము సముద్రానికి దగ్గరలో వున్న పట్టపుపాళెం (చేపలుపట్టే వృత్తిగలవారి గ్రామం) వెళ్ళినప్పుడు అక్కడ అంతకుముందే ప్రభుత్వం నిర్మించిన 'పక్కా ఇళ్ళ' పరిస్థితి తుఫాను తాకిడికి దయనీయంగా వుంది. కొన్ని 'పక్కా ఇళ్ళు' గోడలుకూలి, కొన్ని పైకప్పులు విరిగి, ఎక్కువభాగం వర్షానికి ఉరుస్తూ (పైనించి నీరుకారడం) స్వాగతం పలికాయి. ఇక పట్టపు వాళ్ళ (మత్స్యకారుల) పరిస్థితి మరీ దారుణంగా తయారయింది.

వారికి వున్న ఏకైక జీవనాధారం సముద్రంలో చేపలుపట్టి బ్రతకడమే ఐదు మీటర్ల ఎత్తున లేచిన సముద్రపు అలలకు వారి నావలన్నీ ధ్వంసమ య్యాయి. ఒక్కొక్క నావ 60,000 రూ.లు ఖరీదు చేస్తుంది. ఈ నావలను మరమ్మతు చేయాలంటే 10,000 రూ.లు ఖర్చవుతుంది. ఇవికాక పెద్ద వల పడవలుకూడా వున్నాయి. ఇవి ఒక్కొక్కటి 10,000 రూ.లు ఖరీదుచేస్తాయి. ఇవి సముద్రంలో కొన్ని కొట్టుకొనిపోగా, కొన్ని ముక్కచెక్కలైపోయాయి. ఎక్కువభాగం నావలన్నీ ఋణాలపై తెచ్చినవే. ఇంకొక రకమైనవాటిని తెప్పలంటారు. ఇవికూడా వారికి మిగలలేదు. చేపలు పట్టడానికి వారు ఉపయో గించే మూడు రకాలైన వలలు పూర్తిగా తెగిపోయి ఎందుకూ పనికిరాకుండా తయారయ్యాయి. వారి జీవనస్థితి స్థంభించిపోయింది.

బియ్యం పంపిణీ చేయడమే మూడు రోజులు ఆలస్యంచేసి తమ ఇష్టం వచ్చిన కొలతలతో 7 లేదా 8 కేజీలే ఇవ్వడం జరిగింది. ఇదే సమయంలో

# విరసం విశేషాలు

## 11-2-90న గుంటూరులో విరసం కార్యవర్గం చేసిన తీర్మానాలు

### 1. విరసం సభ్యుడు కా॥ తిరుపాల్ మృతికి సంతాపం

నిరుపేద కుటుంబంలో పుట్టి విప్లవోద్యమంతో మమేకమైన యువకవి విప్లవ రచయితల సంఘం (విరసం) సభ్యుడు పల్లాం తిరుపాల్ మృతిపట్ల విరసం ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నది.

అనారోగ్యంతో గురువారంనాడు చిత్తూరు జిల్లా రేణిగుంటలో మరణించిన కామ్రేడ్ తిరుపాల్ విరసం త్యాగశీల చరిత్రను మరింత దీప్తిమంతం చేశాడు. విప్లవోద్యమంతో సంబంధం వున్నందుకుగాను ఆయనపై 'మారణాయుధాలు కలిగివున్నట్టు'గా తిరుపతి పోలీసులు తప్పుడు కేసు బనాయించి ఆయనను అనారోగ్యంలోకూడా అవస్థలకు గురిచేశారు. ఆ కేసు ఇప్పటికీ కొనసాగుతోంది

ఒకవైపు అనారోగ్యం, మరోవైపు నిర్బంధాల మధ్యనే ఆయన 'మాట్లాడదాం' అనే కవితా సంకలనాన్ని గత సంవత్సరం వెలువరించారు. భారతి, అరుణతార, ప్రజాశక్తి పత్రికలలో మధుభారతి అనే కలంపేరుతో ఆయన రాసిన కవితలు విశేష సంఖ్యలో అచ్చు అయ్యాయి.

రెండు కిడ్నీలూ చెడిపోయి ఆయన మృత్యుముఖంలో వున్నపుడు రాష్ట్రం నలుమూలలనుంచీ దాదాపు లక్షరూపాయలవరకూ విరాళాలిచ్చి ప్రజలు

---

తెలుగుదేశం రెవెన్యూ మంత్రి వీరయ్య చౌదరి కావలిలో పర్యటిస్తూ తుపాను బాధితులకు అదనంగా పది కిలోల బియ్యం ఉచితంగా పంపిణీ చేస్తున్నట్టు ఒక ప్రకటన విసిరారు ఎంతోమంది సంతోషించారు. కాని అది అమలు కాక పోవడంతో ఎన్నికల స్టంటు అనికూడా గ్రహించారు.

ప్రభుత్వ సాయం దక్కని తుఫాను బాధితులు ఈనాటికి కావలి రెవిన్యూ కార్యాలయం చుట్టూ తిరుగుతున్నారు. దేశం మొత్తం ఎన్నికల తుపానులో కొట్టుకొని పోగా, కావలి పరిసర ప్రాంతాల ప్రజలు అదనంగా ప్రభుత్వ సాయం అనే తుఫానులో కొట్టుకుపోయారు.

[రచనాకాలం : నవంబరు 30, 1989]

బతికించుకున్నారు. కానీ ఆ తర్వాత శస్త్ర చికిత్స ఫలితం ఇవ్వకపోవడంతో ఆయన మరణించారు.

'దిగంబర కవిత్వం' గురించి ఎస్వీ యూనివర్సిటీలో ఆయన చేస్తూ వుండిన పిహెచ్ డి. పూర్తి కాకుండానే ఆగిపోయింది.

కామ్రేడ్ తిరుపాల్ మృతిపట్ల విరసం తన సంతాపాన్ని ప్రకటిస్తోంది.

## 2. విప్లవకారులపై, విప్లవ సాంస్కృతిక రంగ కార్యకర్తలపై అక్రమ కేసులు ఎత్తివేసుకోవాలి

విప్లవకారులకు బెయిలు ఇచ్చి విడుదల చేయడం కాకుండా వారిపై మోపిన అక్రమ కేసులన్నీ ఉపసంహరించుకోవాలని, విప్లవం కుట్రకాదని విరసం మరోమారు ప్రకటిస్తున్నది.

నిన్న కా॥ శివసాగర్‌కు, రేపు కా॥ గద్దర్‌కు బహిరంగంగా తిరిగే అవకాశం ఇస్తే చాలదు. వాళ్ళపైన, వాళ్ళతోపాటు సహముద్దాయిలపైన రాపు నగర్ కుట్రకేసు, ఇతర అక్రమ కేసులు బేషరతుగా వెంటనే ఉపసంహరించుకోవాలి.

కామ్రేడ్ అద్దేపల్లి ప్రభును బెయిలుపై విడుదల చేయడమే గాకుండా ఆయనపై మోపిన అక్రమకేసులు రద్దుచేయాలి.

కరీంనగర్ జిల్లా జగిత్యాలలో అప్పటి మా కార్యవర్గ సభ్యుడు సుప్రసిద్ధ కథా, నవలా రచయిత కా॥ బి. ఎస్. రాములుపై పోలీసులు తప్పుడుకేసు మోపారు. ఆయనను చిత్రహింసలకు గురిచేసి కరీంనగర్ జైల్లో పెట్టారు. బెయిలుపై విడుదలై ఆయన ఆంధ్రప్రదేశ్‌లో నిర్బంధాన్ని వివరించడానికి అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి (AILRC) బృందంలో సభ్యుడుగా భారతదేశమంతా తిరిగి ఆంధ్రప్రదేశ్‌లో 'టాడా' చట్టం రావడంతో అజ్ఞాత జీవితానికి వెళ్ళిపోయాడు.

ఆయన కరీంనగర్ జిల్లా మల్యాలలో ఒక హాస్టల్ వార్డెన్‌గా పనిచేస్తూ ఈ అక్రమ కేసువల్ల అజ్ఞాత జీవితానికి వెళ్ళాడు. ఆయనకు భార్య, నలుగురు పిల్లలు. ఆయన భార్య శ్యామల బీడీలు చేసుకొని ఈ ఐదు సంవత్సరాలుగా తన కుటుంబాన్ని పోషిస్తున్నది.

కామ్రేడ్ రాములుపై ఉన్న అక్రమకేసు ఎత్తివేసుకొని ఆయనకూడా అజ్ఞాతంనుంచి బయటికివచ్చి బహిరంగ జీవితం గడిపే వీలు కల్పించాలనీ,

(కొరప 28వ పేజీలో)

## కా॥ తిరుపాల్ సంస్మరణలో....



# ఆశయాలు ఊపిరిగా బతికిన విప్లవకవి కా॥ తిరుపాల్‌కు విరసం జోహార్లు

"నువ్వు నమ్ముకున్న నీ గూడు పాడవుతుంది
నిరాశను నీ అంచుకు రానీవు
నడుస్తున్న చరిత్ర నీ చుట్టూ ఊహాస్వర్గం నిర్మిస్తుంది
నువ్వు లొంగవు ప్రశ్నిస్తావు
నడిచే దారులన్నీ మూసుకుపోతాయి
నువ్వు కొత్త దారుల్ని అన్వేషిస్తావు
జీవితాచరణ యుద్ధక్షేత్రంగా మారుతుంది
నువ్వు నీ ప్రజల్ని ప్రేమిస్తావు
సహించలేని శత్రువు నిన్ను కాటేస్తాడు
అయ్యో నా బిడ్డని హృదయంలో దాచుకుంటారు - ప్రజలు
సాహసీ అని కొనియాడుతుంది చరిత్ర."

—పల్లాం తిరుపాల్

విప్లవకవి పల్లాం తిరుపాల్ పాతికేళ్ళుకూడా నిండని యువకుడు. తిరుపతిని తన ఆశయాల విద్యాకేంద్రంగా చేసుకొన్నాడు. నేటి దుష్ట సమాజాన్ని మౌలికంగా మార్చాలనే ధ్యేయంతో రాడికల్ విద్యార్థిగాను, కలం పట్టిన సాంస్కృతిక విప్లవ యోధునిగాను పోరాటానికి నడుంకట్టాడు. చివరికి తన శరీరాన్ని కబళించిన మృత్యువుతోసైతం పోరాడి 8-2-1990న అమరుడైనాడు.

తిరుపాల్ స్వగ్రామం చిత్తూరుజిల్లా రేణిగుంట వేణుగోపాలపురం. 1-1-1966న అతి నిరుపేద దళిత కుటుంబంలో పుట్టాడు. తాను చిన్న వయసులో ఉన్నపుడే తండ్రి చనిపోయాడు. తల్లి పల్లాం సుబ్బమ్మ తన రెక్కల కష్టంతో కూలిచేసి కాపురాన్ని నడిపింది. తిరుపాల్‌కు ఒక అక్క, అన్న ఉన్నారు. అన్న భాస్కర్ చదువు చాలించి తల్లికి చేదోడువాదోడుగా ఉంటూ, కూలికి వెళుతూ కుటుంబ భారాన్ని మోయడంలో పాలుపంచుకున్నాడు తిరుపాల్ ఆఖరివాడు కనుక అందరూ ప్రేమతో చూస్తూ, ఉన్నత చదువు చదివించాలనే కోరికతో శ్రద్ధగా చదివించారు. తిరుపాల్‌కూడా శ్రద్ధగా చదివి వారిని సంతోషపరిచాడు. కష్టాలను కళ్ళారా చూస్తూ, చెమటచుక్క సారంతో పెరిగినవాడు కనుక ప్రతి విషయాన్నీ గుడ్డిగా నమ్మక బాగా పరిశీలించి ఆలోచించే దృక్పథం అలవడింది.

ఇంటర్మీడియట్ చదువుతున్నపుడు రాడికల్ విద్యార్థి సంఘంతో పరిచయం కలిగింది. RSU ఇచ్చిన "శాస్త్రీయ విద్యావిధానంకై పోరాడుదాం" అనే నినాదం అతన్ని బాగా ఉత్తేజపరిచింది. ఆనాటినుంచి మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం వెలుగులో కొత్త చదువు ప్రారంభించాడు.

---

(26వ పేజీ కొనసాగింపు)

ఆయనను తిరిగి ఉద్యోగంలోకి తీసుకోవాలనీ, విప్లవకారులపై మోపిన అన్ని కేసులనూ ఎత్తివేసుకోవాలనీ విరసం ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నది.

# 3. మండే నల్లసూర్యుడు నెల్సన్ మండేలాకి స్వాగతం

"దేశాలు స్వాతంత్ర్యం కోరుతున్నాయి, జాతులు విముక్తిని కోరుతున్నాయి, ప్రజలు విప్లవాన్ని కోరుతున్నారు. విప్లవాల యుగం మనది, విప్లవిస్తే జయం మనది" అంటూ అణగారిన ప్రజల ఆక్రందనలని తన కలంలో, గళంలో పలికించిన, వినిపించిన మండేలాకి స్వాగతం విప్లవాన్ని ప్రచారం చేసిన నేరానికి 31 ఏళ్ళుగా జైల్లో మగ్గాడు మండేలా.

పెత్తందారీ పోకడలతో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని పెడతోవలు పట్టించి తద్వారా మార్క్సిస్టు సిద్ధాంతానికి ద్రోహంచేశాయి పాశ్చాత్య కమ్యూనిస్టు పార్టీలు. ఈ తరుణంలో తూర్పు పవనం మరింత బలంగా వీచి ఖండాంతర నానాజాతుల చారిత్రక యదార్థ తత్వాన్ని చాటిచెప్పవలసి వుంది.

మార్క్సిజం అజేయం అని ప్రకటించిన మండేలా తన నిప్పుల కంఠంతో ప్రజల మధ్యకు వస్తున్న మండేలాకి మరోసారి మా స్వాగతం పలుకుతున్నాం!

తిరుపతి గోవిందరాజ ఆర్ట్స్ కళాశాలలో B.A లో చేరినతర్వాత కాలేజి RSU యూనిట్‌లో చురుగ్గా పనిచేశాడు. రాడికల్ చైతన్యంతో ఆలోచించే తీరు బాగా పరిణతి చెందింది. 1985లో రాడికల్ విద్యార్థి సంఘం తిరుపతి పట్టణ యూనిట్‌కు తిరుపాల్‌ను అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. "గ్రామాలకు తరలండి" క్యాంపెయిన్‌లో పీలేరు, వాయల్పాడు, కలికిరి ప్రాంతాలలో RSU ప్రచారంలో విస్తృతంగా పాల్గొన్నాడు. జనాట్యమండలి పాటలుకూడా బాగా పాడేవాడు. జిల్లా JNM దళంతో కలసి "నక్సల్బరి బిడ్డలు" ఒగ్గుకథకూడా చెప్పేవాడు. గద్దర్ దళం తిరుపతికి ఎప్పుడు వచ్చినా ఆ దళంతో కలసి కోరస్ పాడేవాడు. గద్దర్ పాటలంటే తిరుపాల్‌కు ఎనలేని ఉత్సాహం. శ్రీశ్రీ, చెరబండరాజు, శివసాగర్ విప్లవకవుల ప్రభావంతోనే, తన భావాలకు అక్షరరూపం ఇస్తూ కవిగా మారాడు. తెలుగులో వస్తున్న అన్ని ముఖ్య పత్రికలలోను తిరుపాల్ కవితలు వచ్చాయి.

రాయలసీమ సమస్యల పోరాటానికి ఏర్పడిన "రాయలసీమ విద్యార్థి - యువజన కార్యాచరణ కమిటీ (ACRSY)లో సభ్యునిగా చేరి ఆందోళనలో పాల్గొన్నాడు. కాళహస్తిలో 'తెలుగుగంగ ప్రాజెక్టు ఆఫీసు' ముందు ACRSY ధర్నా చేస్తున్నప్పుడు అప్పటికప్పుడు రాయలసీమ కరువుపైన పాట కట్టి, పాడి ప్రజల్ని ఉత్తేజపర్చి, కార్యకర్తలతోపాటు తానుకూడా అరెస్టయ్యాడు. తిరుపాల్‌కున్న రచనా సామర్థ్యాన్ని, ఉత్సాహాన్ని చూసి విరసం అతన్ని ఆహ్వానించింది. 1986లో విరసంలో సభ్యునిగా చేరాడు. సంస్థలో చేరింది మొదలు కార్యక్రమాలలో పాల్గొననివ్వకుండా అనారోగ్యం ఆటంకపరిచింది. అప్పటికే మూత్రపిండాల వ్యాధి బాగా ముదిరిపోయింది. వెంటనే ఆపరేషన్ చేయించుకోవాలని మద్రాసులోని నెఫ్రాలజిస్ట్ డా॥ అమరేష్ సలహా ఇచ్చాడు. ఈ దుర్వార్త తిరుపాల్‌ని, కుటుంబాన్ని, మిత్రుల్ని కలవరపర్చింది. మిత్రులకు భయంలేదని చెబుతూ, చిరునవ్వు చిందిస్తూ ఆపరేషన్‌కు సిద్ధమయ్యాడు. తల్లి, అన్న, వదిన, అక్క, బావ అందరూ తమ దగ్గరున్న సర్వస్వాన్ని ధారపోసి ఆపరేషన్ ఖర్చులకు డబ్బు ప్రోగుచేసి మద్రాసు కెన్సింగ్టన్ హాస్పిటల్లో శస్త్రచికిత్స చేయించారు.

దాదాపు రెండునెలల తర్వాత మృత్యువును జయించానన్న ఉత్సాహంతో మిత్రుల మధ్యకు వచ్చాడు. "తాము అప్పులపాలయినా పరవాలేదు, తన బిడ్డ బతికి బయటపడ్డాడు, అదే చాలనుకుంది" తల్లి సుబ్బమ్మ. అటెండర్‌గా తనకు

వచ్చే జీతంలోనే అప్పులకు వడ్డీలు కడుతూ ఇంజెక్షన్లు, మందులకు డబ్బులు ఖర్చుపెడుతూ కనీసం పిల్లల చిరుతిండికికూడా ఖర్చుపెట్టకుండా అన్న భాస్కర్ సర్వస్వం తనకే అంకితమయ్యాడని, అతని బాధల భారాన్ని కొంచెమైనా పంచుకోడానికి ఏదో ఒక ఉద్యోగం చేయాలని, M. A. పూర్తవగానే పత్రికల్లో చేరాలనేవాడు. కాని ఇంతలోనే జబ్బు మరలా తిరగతోడింది. ఈసారి మూత్ర పిండాలు పూర్తిగా చెడిపోయాయని డాక్టర్లు చెప్పిన వార్త కుటుంబాన్ని, మిత్రులను తేరుకోలేని విధంగా నిరాశకు గురిచేసింది. కుటుంబం ఏమాత్రం ఖర్చు పెట్టలేని దుర్భర ఆర్థికస్థితికి లోనైంది. జబ్బు పరిస్థితి రోజురోజుకూ మరింత కృంగదీస్తూవుంది. చివరికి యువకవిని బ్రతికించుకోవడానికి ప్రజల్ని అదుకొమ్మని, ఆర్థిక సహకారం అందివ్వమని పత్రికలద్వారా ప్రకటన ఇవ్వక తప్పలేదు. ప్రకటన చూచిన వెంటనే ప్రజలనుండి ఎంతో సహకారం లభించింది. కర్నూలు బడిపిల్లలు మొదలుకొని, రాజకీయ ఖైదీలు, మిత్రులు, రచయితలు, అనంతపురం ఆలంబన సంస్థవరకు ఎందరో సహాయంచేశారు. అందరూ అందించిన సహకారంతో "అపోలో హాస్పిటల్లో" చేరడం జరిగింది.

దాదాపు పది నెలలపాటు మృత్యుఘోషతో పోరాడాడు. తన పేగుతెంచి జన్మనిచ్చిన తల్లి సుబ్బమ్మ తన జీవితాన్ని బిడ్డకే అంకితంచేసి, మూత్రపిండాన్ని త్యాగంచేసి సమర్పించింది 28-4-89 న మూత్రపిండాల మార్పిడి ఆపరేషన్ జరిగి పునర్జన్మ ఎత్తాడు. చిరునవ్వుతో ప్రజల మధ్యకు వచ్చాడు. తన కవితారంగాన్ని మరలా చేపట్టాడు. ఎస్వీ యూనివర్సిటీ తెలుగు అధ్యయన విభాగంలో "దిగంబర కవుల"పైన పరిశీలన (Ph.D.) చేయడానికి పూనుకున్నాడు. కేవలం ఆరు మాసాలు మాత్రమే బాగుండగలిగాడు. మరలా మృత్యువుకు కంటగింపు కలిగింది. మార్పిడి చేసిన మూత్రపిండంకూడా చెడిపోయి మంచం పట్టాడు.

తిరిగి ఏమి చేయను దిక్కుతోచని స్థితిలో కుటుంబ సభ్యులు, మిత్రులు బాధకు గురై, ఎట్లా బతికించుకోవాలని తర్జనబర్జనలతో ఆలోచిస్తున్న సమయంలో 8-2-1990 న ఉదయం 5-30 గం.కు రేణిగుంటలో అమరుడయ్యాడు.

కామ్రేడ్ తిరుపాల్ ఆశయాలే ఊపిరిగా బతికాడు. రాడికల్ స్పిరిట్‌కి తగ్గట్టు ముక్కుసూటిగా నిర్మొహమాటంగా మాట్లాడేవాడు. ఒకవైపు అనారోగ్యంతో ఉన్నప్పటికీ ఎప్పటికప్పుడు ఉద్యమ వార్తలు చదివి ఉత్తేజం పొందేవాడు. 1988 అక్టోబర్‌లో మంచంపైన జబ్బుతో ఉన్నప్పుడు తిరుపాల్‌ను

పోలీసులు అరెస్టుచేసి తీసుకెళ్ళి, గతంలోని ఒక తప్పుడు కేసులో ఇరికించారు. అయినా తిరుపాల్ తన విప్లవదీక్షను వదలలేదు. 1989 మే నెలలో తిరుపాల్ కవితల్ని, చిత్తూరు విరసం యూనిట్ "మాట్లాడదాం" అనేపేర సంకలనంగా ముద్రించింది. తిరుపాల్ ఆ సంకలనాన్ని తనకు పునర్జన్మ నిచ్చిన తన తల్లి పల్లాం సుబ్బమ్మకు అంకితమిచ్చాడు.

అతి చిన్నవయసులోనే విప్లవకవిగా ఆచరణాత్మక జీవితాన్ని కలిగిన తిరుపాల్ తన ప్రియ మిత్రునకు చెబుతున్న మాటలు చూస్తే, అతివి ఆశయం ఎంత సమున్నతిమో తెలుస్తుంది.

"ఆకాశమంత ఎత్తు నా ఆశయాలు
కనుచూపు మేరంతా కార్యక్షేత్రం
ఆలోచనలే అండ ఆశావాదమే ఊపిరి."

విప్లవకవి తిరుపాల్ ఆశయాల్ని కొనసాగిద్దాం.
అమరవీరునికి విరసం జోహార్లు.
విప్లవం వర్ధిల్లాలి. విరసం వర్ధిల్లాలి.

—చక్రవేణు

# (మ)రణం

జీవితం నిశ్శబ్దగానం చేస్తుంటుంది
ధడేల్మని తుపాకిమోత వినిపిస్తుంది
హత్యైనా ఆత్మహత్యైనా సహజ మరణమైనా
పోస్టుమార్టం జరగాల్సిందే!
ఈ దేశంలో
హత్యైనా ఆత్మహత్యైనా మామూలు చావైనా
చచ్చేంత తేడాలేం వుండవుగదా!
మెతుకుల్లేక గతుకుల్లోంచి బతుకులీడ్వలేక
అనవసర విషాదాల పెనుభారాన్ని మొయ్యలేక
మౌనమనే చేదుమాత్రని మింగుతుందో జీవితం.
కత్తీలేని మందుల్లేక
అంగట్లో మందులున్నా అరచేతిలో అస్సల్లేక

సమయానికి డాక్టర్లు రాక
వచ్చినవారికి వ్యాధి తెలీక
ఉసురు తీసుకుంటుందో జీవితం.
అన్యాయాల్ని సహించలేక
సహించలేని తత్వాన్ని సహించలేని
జీవితంతో రాజీపడ్డం చేతకాక
అలసట అనే పదానికి అర్థం చూడ్డం రాక
శ్రమ అనే పదానికి తానే అర్థంగా మారానని తెలుసుకున్నాక
బానెట్ కెదురెలుతుందో జీవం.
హైతో అన్నం నైతో గోలీ
కాదా గోళం—
ఎటర్నల్ ప్రవాహంలో నీదో అధ్యాయం.

(తిరుపాల్ గురించి విషాద వార్త విన్నాక) —ఎస్. యాదయ్య

## విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ గాడి నెహ్రూ అక్రమ అరెస్టు

విప్లవ రచయిత, చిత్రకారుడు, విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ గాడి నెహ్రూను ఫిబ్రవరి 2వ తేది రాత్రి రాజోలు పోలీసులు జగ్గన్నపేటలో స్టూడియోలో ఉండగా అక్రమంగా తీసుకెళ్ళారు. అతనిదగ్గర ఉన్న అరుణతారలు, కొన్ని కరపత్రాలు తీసుకొని స్టూడియోను చిందరవందర చేశారు. స్టేషన్‌లో ఇంటరాగేట్ చేస్తూ తూర్పు గోదావరిలో తిరిగి విప్లవ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాడని ఎస్.ఐ. (రాజబాబు), సి.ఐ. (ఐ.ఎల్. నారాయణ) నేరారోపణ చేశారు. స్టేషన్‌లోనే కవిత్వం రాయమని ఒత్తిడిచేశారు. ఈ వాతావరణంలో ఎలా సాధ్యం అంటే "నిన్ను చిత్రహింసలు పెడితే కవిత్వం వస్తుందికదూ" అంటూ వెటకారంగా మాట్లాడారు. తర్వాత రాజోలు MLA మంగెన గంగయ్య మరీ ముఖ్యంగా నగరం MLA నీతిపూడి గణపతిరావుగార్ల జోక్యంతో 4వతేది ఉదయం 9 గంటలకు ప్రికాషనరీ అరెస్టు చూపించి, వ్యక్తిగత పూచీకత్తుమీద విడుదల చేశారు. ఒకవైపున అజ్ఞాతంగావున్న కార్యకర్తల్నీ, నాయకుల్నీ బహిరంగ జీవితంలోకి రమ్మని ఆహ్వానిస్తూ, మరోవైపు బహిరంగ జీవితంలో వున్న రచయితల్నీ, కళాకారుల్నీ అక్రమంగా తీసుకెళ్ళడం, మానసిక చిత్రహింసలు పెట్టడం ప్రభుత్వ, పోలీసుల ద్వంద్వనీతికి నిదర్శనం.

# స్వీకారం

1. కథాకథనం : కాళీపట్నం రామారావు, స్వేచ్ఛాసాహితి ప్రచురణ, పేజీలు 12+82, వెల : 10 రూ. ప్రతులకు : టి. కృష్ణాబాయి, 15, LIG హౌసింగ్‌బోర్డు కాలనీ, విశాఖపట్నం-530022.
2. సాంస్కృతికోద్యమ నిర్మాణ సమస్యలు : గద్దర్. సృజన ప్రచురణ. పేజీలు 42, వెల : 3 రూ. ప్రతులకు : సృజన, ఫ్లాట్-3, బ్లాక్-17, MIG పింక్ బిల్డింగ్స్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-500044.
3. సృజన - ఆధునిక సాహిత్య వేదిక - జనవరి 1990 సంచిక. నిర్వహణ : సాహితీ మిత్రులు. ఈ సంచిక : 4 రూ. సంవత్సర చందా : 40 రూ. ప్రతులకు : పై అడ్రసు.
4. జగిత్యాలపల్లె : అల్లం నారాయణ కవితలు, విరసం కృష్ణా యూనిట్ ప్రచురణ. పేజీలు 80, వెల : 10 రూ. ప్రతులకు : అరుణతార అడ్రసు
5. జజ్జనకరి జనారే : వంగపండు పాటలు. విరసం విశాఖ యూనిట్ ప్రచురణ. పేజీలు 116, వెల : 10 రూ. ప్రతులకు : అరుణతార అడ్రసు
6. అక్షరం సార్థకమౌతుంది : ఉదయభాస్కర్ కవితలు. విరసం జంట నగరాల శాఖ ప్రచురణ, వెల : 8 రూ. ప్రతులకు : ఉదయభాస్కర్ నెం. 3, సీతారాం నగర్, స్టాఫ్‌రోడ్, కంటోన్మెంటు, సికింద్రాబాద్.
7. APRSU : A Glorious Saga of Students' Struggle. APRSU Publication, Pages : 143+27, Price : Rs. 6/-
8. పల్లెపల్లెకూ లాల్ సలాం - బాబు. సమాజ విజ్ఞాన వేదిక, కావలి. పేజీలు 20, వెల : 1 రూ. ప్రతులకు : బి. వి. ప్రసాద్, నవాబ్ బిల్డింగ్ దగ్గర, జనతాపేట సౌత్, కావలి-524202, నెల్లూరుజిల్లా.
9. ప్రజలే చరిత్ర నిర్మాతలు : ఉత్తర తెలంగాణాపై ప్రభుత్వ దాడి - పూర్వాపరాలు : జనమేజయుడు. సమాజ విజ్ఞాన వేదిక, కావలి. పేజీలు 20, వెల : 1 రూ. ప్రతులకు : పై అడ్రసు.
10. అడవి ఉప్పొంగిన రాత్రి : విమల కవితలు. విరసం సిటీ యూనిట్ ప్రచురణ. పేజీలు : 95, వెల : 6 రూ. ప్రతులకు : నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
11. కల్లోల కాలానికి కవితా దర్పణం శ్రీశ్రీ మరోప్రస్థానం (టీకాటిప్పణి) వరవరరావు - విరసం జంటనగరాల శాఖ ప్రచురణ, పేజీలు : 70, వెల : 5 రూ, ప్రతులకు : పై అడ్రసు

12. మన సలంద్ర - సలంద్ర సంస్మరణ : విరసం జంటనగరాల శాఖ ప్రచురణ; వెల : 4 రూ. ప్రతులకు : అరుణతార అడ్రసు.
13. సంక్షోభ గీతం : అలిశెట్టి ప్రభాకర్ కవితలు. ఇతర వివరాలేమి లేవు.
14. చురకలు : అలిశెట్టి ప్రభాకర్, వెల : 2 రూ. ప్రతులకు : అలిశెట్టి ప్రభాకర్, స్టూడియో చిత్రలేఖ, సునందా హోటల్ ఎదురుగా, చిక్కడపల్లి, హైదరాబాద్-20.
15. రక్తరేఖ : అలిశెట్టి ప్రభాకర్ - సచిత్ర కవితా సంకలనం, వెల : 10 రూ. ప్రతులకు : పై అడ్రసు.
16. జననాట్యమండలి పాటలు - 1990, వెల : 150 పైసలు.
17. సృజన సంపాదకీయాలు (1966-1985) : వరవరరావు. పర్స్పెక్టివ్స్ ప్రచురణ, పేజీలు : 15 + 340 + 40, సాదాప్రతి వెల : 40 రూ. లైబ్రరీ ఎడిషన్ : 60 రూ. ప్రతులకు : నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
18. తెలుగు విప్లవ కవిత్వంలో ప్రతీక - డా॥ తాతిరెడ్డి ప్రభాకరరెడ్డి సిద్ధాంత గ్రంథం, పేజీలు : 300, వెల : 45 రూ. ప్రతులకు : టి. కృష్ణారెడ్డి, చియ్యేడు (గ్రామం), అనంతపురం జిల్లా. 515721.
19. చైనా సాంస్కృతిక విప్లవం - కోదండరామిరెడ్డి, విరసం ప్రచురణ, వెల : రూ. 1-50, ప్రతులకు : అరుణతార అడ్రసు.
20. నేటి చైనా పరిణామాలు - హరగోపాల్, విరసం ప్రచురణ, వెల : రూ. 1-50, ప్రతులకు : అరుణతార అడ్రసు.

---

## ప్రకటనలు

(1) కొందరు 'అరుణతార'కుగానీ, ఇతర ప్రచురణలకోసంగానీ, మనీ ఆర్డర్ పంపిస్తూ కూపన్‌లో అడ్రసు రాయడంలేదు. కొందరు రాసినా స్పష్టంగా రాయడంలేదు. ఈ విషయాన్ని గమనించి అడ్రసు స్పష్టంగా రాయండి.

(2) 'అరుణతార'కు వచ్చిన మనీ ఆర్డర్ ఫారాలమీద డబ్బు అందుకున్నట్టు వి. చెంచయ్య సంతకంగాని, వి. మాధవి సంతకంగాని ఉంటుంది. గమనించగలరు.

(3) 'అరుణతార' చందాలు పూర్తయిన వాళ్ళు వెంటనే 30 రూ. చందా పంపండి. మీ మిత్రులచేత చందా కట్టించే ప్రయత్నం చేయండి. పత్రిక మనుగడకు చందాలే ఆధారం.

—సం॥

# విరసం ఐక్యవేదికగానే కొనసాగుతోంది

## 'విరసం అభిమానుల' కరపత్రానికి విరసం సమాధానం

"ఇరవై ఏళ్ళ విరసం మహాసభలపై ఒక సమీక్ష" అనే పేరుతో "విరసం అభిమానులు" ఇటీవల ఒక కరపత్రం అచ్చువేసి చాలామందికి పోస్టులో పంపించారు. 3-2-90న ఈ కరపత్రమే "ఆంధ్రభూమి" దినపత్రికలో 'అక్షరం' శీర్షికలో అచ్చయింది. ఈ కరపత్రంలో విరసంపైన కొన్ని ఆరోపణలున్నాయి. వాటికి సమాధానం చెప్పి వాస్తవాలను తెలియజేయడం విరసం బాధ్యత.

విరసం ప్రజలకోసం ఉన్న సంస్థేగాని, సమాజంతో సంబంధం లేకుండా ఏవో తమకు తోచిన రచనలు చేసుకునే సంస్థ కాదు. ప్రజల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని ఎవరైనా విరసంగురించి తమ అభిప్రాయాల్ని ప్రకటించవచ్చు. ఆ అభిప్రాయాల్లో సమంజసమైనవాటిని, విరసం కార్యాచరణకు ఉపయోగపడేవాటిని విరసం తప్పనిసరిగా స్వీకరిస్తుంది. 'ప్రజలనుండి ప్రజలకు' అనేది విరసం దృక్పథం.

అయితే ఇలా అభిప్రాయాలు ప్రకటించేవాళ్ళు - అభిమానులుగానీ, వ్యతిరేకులుగానీ, తెలిసిగానీ, తెలియకగానీ - కొన్ని దారుణమైన ఆరోపణలు చేసినప్పుడు వాటిని ఖండించకా తప్పదు.

మొదటి విషయం 'విరసం అభిమానుల' సమీక్షావిధానం. 'ఇరవై ఏళ్ళ విరసం మహాసభలపై ఒక సమీక్ష' అని గంభీరమైన పేరుపెట్టి నిజానికి ఆ పని చేయలేదు. కొన్ని ఆరోపణలు చెయ్యడానికే ఆ కరపత్రం వేసినట్టు దాన్ని చదివితే తెలుస్తుంది. వీళ్ళ దృష్టిలో సభలలో కొందరు 'సెక్టేరియన్' వైఖరులను అనుసరించారు. అయితే ఈ 'సెక్టేరియన్' వైఖరులను సభలు జరిగిన మూడు రోజులూ ఈ 'అభిమానులు' చూస్తూ ఊరుకున్నారేగాని, సభల నిర్వాహకులకు చెప్పలేదు. బహుశ అక్కడ చెప్పవలసిన అవసరం లేదని, రెండు వారాల తర్వాత కరపత్రం వెయ్యడం అవసరమని, దాన్ని నేరుగా దినపత్రికలో ప్రచురించడం అంతకంటే అవసరమని 'విరసం అభిమానులు' భావించి వుండవచ్చు.

విరసంలో అనేక రాజకీయ అభిప్రాయాలున్నవాళ్ళు కలిసివున్నారనేది అందరికీ తెలిసిన విషయమే. అయితే వీళ్ళందరూ మార్క్సిజం - లెనినిజం -

మావో ఆలోచనా విధానాన్ని అంగీకరిస్తున్నవారే. విరసానికి ఎప్పుడూ సెక్టేరియన్ ధోరణి లేదు. 20 ఏళ్ళుగా విరసం ఇలా నిరంతరాభివృద్ధి చెందుతూ వుండడమే దీనికి నిదర్శనం. ఒకవేళ విరసం ఎప్పుడైనా తప్పులు చేస్తే వాటినిగురించి కార్యవర్గ సమావేశాల్లోనో, సర్వసభ్య సమావేశాల్లోనో నిర్మొహమాటంగా చర్చించుకునే చరిత్ర విరసానికుందన్న విషయం విరసం సభ్యులందరికీ తెలుసు. విరసంలో భాగస్వాముల బలప్రదర్శనలున్నట్టు ఈ కరపత్రంలో పెద్ద ఆరోపణ చెయ్యడం దారుణమైన విషయం. ముఖ్యమైన నిర్ణయాలు చెయ్యవలసి వచ్చినప్పుడు చర్చల అనంతరం ఏకాభిప్రాయానికి వచ్చిన సందర్భాలే ఉన్నాయిగాని, ఓటింగ్‌దాకా వెళ్ళిన సందర్భాలు ఈ 20 ఏళ్ళ విరసం చరిత్రలో వేళ్ళమీద లెక్కపెట్టదగినన్నికూడా లేవు. ఆరోపణ చేసేముందు కాస్త ఆలోచించడం అవసరం.

రెండో విషయం - కొందరు ప్రతినిధులు విరసం ఐక్యవేదికగా ఉన్న ఒక సాహిత్య సంస్థ అనే విషయం మర్చిపోయి ఒక రాజకీయ పార్టీకి సంబంధించిన నినాదాలు ఇచ్చారన్నది. విరసం సభలకు వచ్చినవాళ్ళు ఎలాంటి నినాదాలు ఇవ్వాలో విరసం కార్యవర్గం నిర్ణయించింది. వాటిని ప్రతినిధులందరికి మైకులో చదివి వినిపించాం. అవి తప్ప ఇతర నినాదాలు ఇవ్వవద్దనీ విజ్ఞప్తి చేశాం. విరసం నిర్ణయించిన నినాదాల్ని జెరాక్స్ కాపీలు తీసి పంచాం. ప్రసంగాలకు మధ్యలో సాంస్కృతిక దళాలు పాటలుపాడే సందర్భంలో అమరవీరుల పాటలు వచ్చినప్పుడు ఆ అమరవీరులకు జోహార్లు పలుకుతూ నినాదాలిచ్చారు. ఇది దాదాపు సభల్లో ఎప్పుడూ జరిగేదే. అయినా ఆ నినాదాల్నికూడా యివ్వవద్దని ఎన్నోసార్లు విజ్ఞప్తి చెయ్యడం జరిగింది కొందరు ప్రతినిధులు ఈ సందర్భంగా తమ రాజకీయపార్టీలకు సంబంధించిన నినాదాలుకూడా ఇచ్చివుండవచ్చు. వాటినీ నిర్వాహకులు నివారించడానికి ప్రయత్నించారేగాని, ఎక్కడా ప్రోత్సహించలేదు. రెండువేలకు పైగా ప్రతినిధులు హాజరైనప్పుడు, ఊరేగింపుకూ, బహిరంగసభకూ లక్షమందికి పైగా వచ్చినప్పుడు ఆ జన సముద్రం నించి ఒకవేళ అభ్యంతరకరమైన నినాదాలు వస్తే, అలాంటి నినాదాలు యివ్వవద్దని విజ్ఞప్తి చెయ్యడం తప్ప ఎంతమందిని ఆపగలం? అసలా నినాదాలే రాకుండా ఎలా కంట్రోల్ చెయ్యగలం? పైగా వచ్చిన ప్రతినిధులందరూ విరసం అభిమానులేగాని విరసం సభ్యులు కాదుగదా! ఉన్నట్టుండి ఏదోమూల ఎవరో ఒక నినాదం ఇస్తే, ఆ నినాదం అసలు వినిపించకుండానే ఉండడానికి ఏ నిర్వాహకులయితేమాత్రం ఏం చెయ్యగలరు? ఈ పరిస్థితిలోకూడా విరసం

వాటిని కంట్రోల్ చెయ్యడానికే చిత్తశుద్ధితో ప్రయత్నించిందన్న వాస్తవం ఈ 'అభిమానుల'కు తెలియదా? ఊహించని విధంగా సత్యమూర్తి (శివసాగర్) గారు విరసం సభల్లోనే అజ్ఞాతవాసంనుంచి బహిరంగ జీవితంలోకి అడుగు పెట్టారు. ఆయన హాల్లోకి ప్రవేశించిం తర్వాతగాని ఆయన వచ్చినట్టు విరసం నాయకత్వానికి తెలియలేదు. ఆయనను హఠాత్తుగా చూసిన కొందరు ప్రతినిధులు 'రెనగేడ్' అని నినాదాలిచ్చారట. అంతటితో ఆగక 'విప్లవం కుట్ర కాదు', 'సూర్యోదయం కుట్రకాదు', 'సత్యమూర్తి కుట్రదారుడు' అనే నినాదాలు కూడా ఇచ్చారట. ఇదంతా జరిగింది సభలు జరిగే హాలులోకాదు, హాలు బయట. ఆ నినాదాలిచ్చినవారు విరసం సభ్యులు కాదు, కాని ఆ నినాదాల్ని ఆపినవారు విరసం సభ్యులు. ఆ నినాదాలిస్తున్న సమయంలో అటుగా వస్తున్న విరసం కార్యవర్గ సభ్యులు కా॥ వరవరరావు, కా॥ అరుణ్‌లు ఆ నినాదాలివ్వకుండా ఆపారు. ఈ విషయాన్ని 16-2-90 ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రారంభమైన తన ఇంటర్వ్యూలో సత్యమూర్తిగారే అంగీకరించారు. అసలు సత్యమూర్తి అలియాస్ శివసాగర్ హాల్లో ప్రవేశించిందీ, డెలిగేట్ కార్డు తీసుకున్నదీ సత్యమూర్తి పేరుతోగానీ, శివసాగర్ పేరుతోగానీ కాదు. శాస్త్రి అనే పేరుతో హాల్లో ప్రవేశించారు. డెలిగేట్ కార్డులు ఇస్తున్న విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ సి. ఎస్. ఆర్. ప్రసాద్ దగ్గరకు సత్యమూర్తిగారు రానేలేదు. ఎవరినో పంపించి 'శాస్త్రి' పేరుతో ప్రతినిధి కార్డు తెప్పించుకున్నారు. అంటే ఆయన విరసం సభ్యుడుగా ప్రవేశించలేదన్నమాట. ఇలా ఊహించని విధంగా జరిగిన ఆయన ప్రవేశంవల్ల ఎవరో కొందరు ఒకటి రెండు నినాదాలు ఇచ్చారనీ, అంతమాత్రంచేతనే విరసం ఐక్య వేదిక అన్న విషయాన్ని మర్చిపోయారనీ, సెక్టేరియన్ వైఖరి అనీ పెద్దపెద్ద ఆరోపణలు చెయ్యడం 'విరసం అభిమానుల' దురభిమానానికే నిదర్శనం.

ఇక మూడో ఆరోపణ - సభల నిర్వాహకులు సత్యమూర్తిగారిని సభలోకి ప్రవేశించడానికి నిరాకరించారనీ, కొందరు వ్యక్తులు ఆయనపై భౌతికంగా దాడిచెయ్యడానికి ప్రయత్నించారనీ. 'విరసం అభిమానుల' 'అభిమానా'నికి ఇది పరాకాష్ఠ. సత్యమూర్తిగారు సభలోకి ప్రవేశించిందాకా విరసానికి తెలియనప్పుడు ఆయన ప్రవేశాన్ని నిరాకరించడం ఎలా సాధ్యం అవుతుంది? అబద్ధాలు చెప్పినా వాటికొక హద్దుండాలి. సత్యమూర్తిగారు సభాప్రాంగణంలోకి అడుగుపెట్టినరోజు - 12వ తేదీ - రాత్రి తెల్లవజామువరకూ కొందరు ప్రతినిధులతో నిరాటంకంగా చర్చలు జరుపుతూనే వున్నాడు. ఏ ప్రతినిధీ ఆయనకు ఆటంకం కలిగించనూలేదు, ఆయనపై దాడిచెయ్యనూలేదు. ఆరోజు రాత్రి

జరిగిన జనరల్ బాడీలో పాల్గొన్నారు. 14వ తేదీన జరిగిన సుదీర్ఘమైన జనరల్ బాడీలోనూ స్వేచ్ఛగా పాల్గొన్నారు. ఇతర అన్ని కార్యక్రమాల్లోనూ పాల్గొన్నారు. ఆయన కెవరూ అడ్డుపడలేదు. వాస్తవాలు ఇలా వుండగా 'భౌతికదాడి' అని తీవ్రమైన ఆరోపణ చెయ్యడం 'విరసం అభిమానుల' బాధ్యతా రాహిత్యాన్ని మాత్రమే సూచిస్తుంది.

అరుణోదయ, జననాట్యమండలి కళాకారులు సాంస్కృతిక ప్రదర్శన లిస్తున్న సమయంలో ఒక సంస్థను వక్రీకరిస్తూ నిర్వాహకుడు వ్యాఖ్యానించాడనేది మరో ఆరోపణ. విరసం సభల సందర్భంగా సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించే బాధ్యతను విరసం కా॥ చలసాని ప్రసాద్‌కు అప్పగించింది ఈ సందర్భంగా నిర్వాహకుడి బాధ్యత యాంత్రికమయింది కాదు. పాటలన్నిటినీ ఒక క్రమంలో కూర్చుకొని, ఆ పాటలలోని సారాంశాన్ని చెబుతూ వ్యాఖ్యానించడం విరసం ఎప్పుడూ అనుసరిస్తున్న పద్ధతే. పాట వెంబడి పాటగా లిస్టు చదవడానికే అయితే నిర్వాహకుడే అవసరంలేదు. పాటల్ని పరిచయం చేస్తున్నప్పుడుగాని, వ్యాఖ్యానం చేస్తున్నప్పుడుగాని నిర్వాహకుడికి ఆయా సాంస్కృతిక సంస్థలపట్ల ప్రత్యేకమైన ఏ ఉద్దేశాలూ ఉండవు. మూడు రోజులపాటు క్షణం విశ్రాంతి లేకుండా జరిగిన సభల్లో వ్యాఖ్యాత మాటల్లో కొన్ని కొందరికి ఉలుకుపాటును కలిగించి ఉండవచ్చు, కొందరికి భుజాలు తడుముకునేవిధంగా అనిపించి వుండవచ్చు. ఒక వాస్తవాన్ని చెప్పినప్పుడు తమ స్థితినిబట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అనిపించవచ్చు. ఈ అనిపించడాలుకూడా లేకుండా చెయ్యడానికే సాధ్యమైనంతవరకు విరసం ప్రయత్నిస్తూనే వుంది. చిన్నచిన్న అంశాల ఆధారంగా పెద్దపెద్ద ఆరోపణల్ని చేసే కుట్ర స్వభావాన్ని ఈ కరపత్రం వ్యక్తం చేస్తోంది.

వక్తలు ఏ వేదికనుంచి మాట్లాడుతున్నామనే స్పృహ లేకుండా 'ఫలానా కవి జిందాబాద్' అంటూ నినాదాలివ్వడం సభలకు వచ్చినవారందరికీ ఆశ్చర్యం కలిగించిందట! ఇది మరో ఆరోపణ. 'ముక్తకంఠం' అనే కా॥ వరవరరావు కవితా సంకలనాన్ని ఆవిష్కరిస్తూ కె శివారెడ్డిగారు ఆయనపట్లా, ఆయన కవిత్వంపట్లా అభిమానాన్ని ప్రకటిస్తూ చివర్లో "వరవరరావు జిందాబాద్" అన్నారు. జిందాబాద్ అనకపోయినా మరొక ఆవిష్కర్త మరొకరి కవిత్వాన్ని మెచ్చుకొని వుండవచ్చు. తమ అభిమానాన్ని ఒక్కొక్కరు ఒక్కోరూపంలో వ్యక్తం చేస్తారు. అలా వ్యక్తం చెయ్యడమే నేరమా? అసలీ రంధ్రాన్వేషణ ఏమిటి? ప్రతి చిన్న మాటపైనా ఈ ఆంక్షలేమిటి? ప్రతిదాన్నీ పనిగట్టుకొని

వక్రీకరించి వ్యాఖ్యానిస్తున్నదెవరు? విరసం అభిమాని అయిన ఒక కవి ఒక విప్లవకవిని 'జిందాబాద్' అన్నందుకే 'స్పృహ', 'ఆశ్చర్యం' లాంటి మాటల్ని ప్రయోగించడం అర్థరహితం. మార్క్సిస్టు లెనినిస్టు అవగాహనతో వ్యక్తి పేరున వచ్చే వివాదాలు అతని కార్యాచరణను, సిద్ధాంతాన్ని మాత్రమే ప్రతిఫలిస్తాయి. ఈమాత్రం అవగాహనకూడా 'విరసం అభిమానుల'కు లేకపోవడం ఆశ్చర్యకరం అవగాహన లేకపోవడంకూడా నేరానికి తప్పుకాదు, అజ్ఞానాన్ని బయటపెట్టుకోవడం దేనికి?

ఇంతకూ ఈ 'అభిమానులు ఎవరు? సభలు జరుగుతున్న మూడు రోజులూ అదృశ్యంగా, అజ్ఞాతంగా ఎందుకున్నారు? తమకేదైనా అసంతృప్తి కలిగితే వెంటనే నిర్వాహకులకు ఎందుకు తెలియజెయ్యలేదు? సభలయిం తర్వాతనైనా నిర్వాహకులకు చెప్పాలన్న జ్ఞానం ఎందుకు లేకపోయింది?

అటు మేధావివర్గంలోగాని, ఇటు జనసామాన్యంలోగాని విరసం ప్రభావమేమిటో మొన్నటి సభల్లో స్పష్టంగా వ్యక్తమయింది. సమాజంలో విరసానికున్న ఆదరణ ఏమిటో వ్యక్తమయింది. విరసం వెనక వున్న బలం ఏమిటో రుజువయింది. ఇవన్నీ చూసి సహించలేక, భరించలేక అభిమానుల పేరుతో ఈ కరపత్రం రాశారేగాని, నిజానికి వీళ్ళు అభిమానులు కాదు.

విరసానికున్న అభిమానులే విరసం సభ్యులకన్నా ఎన్నో రెట్లు ఎక్కువనీ, విరసం సాధించిన, సాధిస్తున్న విజయాల వెనక విరసం అభిమానుల పాత్రకూడా ఉందనీ ఈనాటికీ మేం సగర్వంగా చెప్పుకుంటున్నాం. ఎందరో అభిమానులు ఎన్నో సందర్భాలలో విరసానికి నిర్మాణాత్మకమయిన సూచనలు చేసినవారున్నారు. విరసాన్ని own చేసుకుని మాట్లాడిన అభిమానులున్నారు. విరసం తప్పుచేసిందని భావిస్తే తప్పుల్ని సరిదిద్దుకోడానికి అనువైన పద్ధతిలో సూచనలిచ్చినవారున్నారు. కానీ ఆధారాలు లేకుండా, వాస్తవాలను చూడకుండా చూసీ వక్రీకరిస్తూ అబద్ధపు ఆరోపణలు చేసిన అజ్ఞాత అభిమానులు విరసానికి లేరు. ఈ కరపత్రం వేసిన 'విరసం అభిమానులు' నిజమైన విరసం అభిమానుల్ని అవమానించినట్లయింది.

కావలి —వి. చెంచయ్య
15-2-90 కార్యదర్శి, విరసం

['విరసం అభిమానులు' పేరుతో విడిగా పంచిన కరపత్రాన్ని యథాతథంగా 'ఆంధ్రభూమి' దినపత్రిక (3-2-90)లో అచ్చువేశారు కాబట్టి, దానికి విరసం సమాధానాన్ని 15-2-90న ఆ పత్రికకే పంపాం. అయితే ఇది 'అరుణతార'లో అచ్చయ్యేనాటికి (10-3-90) కూడా 'ఆంధ్రభూమి'లో రాలేదు. —సం॥]

# తూర్పు యూరప్‌దేశాల్లో పరిణామాలపై సభ.

గుంటూరు, వెంకటేశ్వర విజ్ఞానమందిర్‌లో విరసం, జనచైతన్యవేదిక, విప్లవ కార్మిక సమాఖ్యల ఆధ్వర్యంలో "కాలంచెల్లింది మార్క్సిజానికా? లేక లెనినిజానికా?" అనే అంశంమీద బహిరంగ సభ జరిగింది.

సభకు C.S R ప్రసాద్ (విరసం కార్యవర్గసభ్యులు) అధ్యక్షత వహించగా, ఉపన్యాసకులుగా కా॥ బాలగోపాల్ (APCLC) కా॥ వై.కె, కా॥ కొడప రాజేంద్రప్రసాద్ )విప్లవ కార్మికసమాఖ్య) ప్రసంగించారు.

సుమారు 2000 మంది హాజరైన ఈ సభలలో కా॥ బాలగోపాల్ మాట్లాడుతూ తూర్పు యూరప్‌లో సోవియట్ రష్యాలో ఉత్పత్తిశక్తుల సిద్ధాంతాన్ని గుడ్డిగా అమలుచేస్తూ మానవసంబంధాలను పట్టించుకోకుండా ఉన్న ఫలితంగా ప్రస్తుత దుష్ఫలితాలు సంభవించాయని, ఇవి ఆచరణలలో మార్క్సిజానికి గుణపాఠాలేకాని, మార్క్సిజానికి కాలంచెల్లటంకాదని అన్నారు. వీటినుండి గుణపాఠాలునేర్చుకొని ప్రజాపోరాటాలను మరింత ముందుకు తీసుకెళ్ళటానికి ప్రపంచ ప్రజలు ముందుకు రావాలని వ్యాఖ్యానించారు. సోవియట్‌రష్యాలో యూరప్‌లో మరో అక్టోబర్ విప్లవం అవసరం అని మాట్లాడుతూ, మార్క్సిజం పడికట్టు సిద్ధాంతంకాదని అభివృద్ధి అయ్యే సృజనాత్మక సిద్ధాంతమని అన్నారు.

సభానంతరం జననాట్యమండలి గుంటూరు, ప్రకాశం జిల్లాల బృందాలు నృత్యరూపకాలను, సగ్గల్వరి బిడ్డలు బుర్రకథను ప్రదర్శించాయి.

* * *

విరసం చిత్తూరు జిల్లా యూనిట్ ఇటీవల తిరుపతిలో "తూర్పు యూరప్ పరిణామాలు" అన్న అంశంపై సభ నిర్వహించింది. కా॥ బాలగోపాల్ మాట్లాడారు.

తొలి కార్మిక రాజ్యాన్ని స్థాపించిన రష్యా కాలక్రమంలో మార్క్సిజం సూత్రాల్ని వదిలేసి, తాత్కాలికంగా దేశ ఆర్థికాభివృద్ధికోసం ఉత్పత్తిశక్తుల సిద్ధాంతాన్ని అనుసరించిందనీ, దానివల్ల అనేక సమస్యలూ, ప్రజల్లో అసంతృప్తి ఉత్పన్నమయ్యాయనీ, ఈ సంక్షోభాన్ని మార్క్సిస్టు - లెనినిస్టు దృక్పథంతో పరిష్కరించుకోకుండా పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణే మార్గమని కృశ్చేవ్ నుంచి గోర్బచేవ్ వరకు భావించారనీ, దాని ఫలితమే పెరిస్త్రోయికా అనీ, ఆ మార్గంలో వెళ్ళినందువల్లే తూర్పు యూరప్ దేశాల ప్రజల్లో కూడా

అసంతృప్తిజ్వాలలు పెల్లుబికాయని బాలగోపాల్ వివరించారు. ఈసభకు యూనిట్ కన్వీనర్ టి. శ్రీనివాసమూర్తి అధ్యక్షత వహించారు. ఈ విషయంపైన 45 నిమిషాలపాటు చర్చ జరిగింది.

## "సమాజం - సాహిత్యం"

విరసం గుంటూరు జిల్లా యూనిట్ 4-3-90న చిలకలూరిపేటలో 'సమాజం - సాహిత్యం' అనే అంశంపైన హాల్ మీటింగ్ నిర్వహించింది. స్థానికులైన కవులు, కవయిత్రులు, విరసం సభ్యులు షుమారు 15 మందితో మొదట కవిసమ్మేళనం జరిగింది. ప్రజాఉద్యమాలను ప్రతిఫలించిన ఈ కవితలు సభికులను స్పందింపజేశాయి.

సభకు గుంటూరు జిల్లా యూనిట్ కన్వీనర్ కా॥ మౌనిక్ అధ్యక్షత వహించాడు. విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ C S.R. ప్రసాద్ విరసం చరిత్రను సంగ్రహంగా వివరించాడు. విరసం కార్యదర్శి కా॥ వి చెంచయ్య 'సమాజం - సాహిత్యం' అనే అంశంపై మాట్లాడుతూ వేదసాహిత్యం నుంచి విప్లవసాహిత్యం వరకు సాహిత్యంలో ఎలాంటి మార్పులు వచ్చాయో, ఆ మార్పులకు సామాజిక పరిణామం ఎలా నేపథ్యంగా పనిచేసిందో సోదాహరణంగా సమగ్రంగా ఉపన్యసించాడు. సభకు ముందూ, వెనుకా జననాట్యమండలి సభ్యులు పాటలు పాడారు.

## నాగరికతాపుష్పం

వాడి శ్రమ, స్వేదం, సహనం, త్యాగం
నీకు హేళనగానే వుంటాయి.
మట్టిలో మట్టిగా, మరగా జీవిస్తూ,
వాడి కళ్ళూ, కాళ్ళూ, చేతులూ, మనసూ
దీర్ఘశ్రమచే ఛిద్రపడినా, మెలితిరిగినా, బండబారినా
నీకు హేళనగానే వుంటుంది.
నువ్వు అవసరంకోసం, అనుభవంకోసం
అందం, ఆనందంకోసం
జీవితం మేజాబల్లమీద అమర్చుకున్న
నీ ఫ్లవర్‌వేజ్‌లోని జీవన నాగరికతా పుష్పాలు
వాడి చెమటతో చేతి కొనవేళ్ళతో పూసినవే!

—బి. ఎన్. స్వామి

7

# 20 ఏళ్ళ విరసం మహాసభలలోని ప్రసంగ వ్యాసాలు

## చైనా సాంస్కృతిక విప్లవం

—కోదండరామిరెడ్డి

చైనాలో సాంస్కృతిక విప్లవం యొక్క పూర్వాపరాల గురించి చర్చించడానికి పునాదిఅయిన ఆర్థికరంగం గురించి ముందు పరిశీలించవలసి ఉంటుంది. చైనాలో పాలకులు వనరుల్ని భారీపరిశ్రమలకు ఎక్కువగా కేటాయించాలని, అప్పుడు ఉత్పత్తి పెరిగి దీంట్లోంచి వచ్చిన వస్తువులను వ్యవసాయరంగానికి తరలించి, వ్యవసాయరంగాన్ని ఆధునికీకరించి,ఉత్పత్తిని పెంచవచ్చని అప్పుడే Collectivisation, Co-operatives అనేవి బలంగా పనిచేస్తాయని చెప్పడం జరిగింది. ఈ సందర్భంగా Private రంగంలోని ఒక ఫ్యాక్టరీని, నేషనలైజేషన్ చేసిన ఫ్యాక్టరీని పోల్చినపుడు ప్రధానంగా మార్పు కనిపించాలి. ప్రైవేటు రంగంలో లాభం కోసం ఉత్పత్తి జరుగుతుంది. ఆఫ్యాక్టరీలో వర్కరు అక్కడ జరుగుతున్న ఉత్పత్తి పద్ధతినంతటిని చేయడం మాత్రమే కర్తవ్యంగా కలిగి ఉంటాడు. నేషనలైజేషన్ అయిన BHEL లాంటి ఫ్యాక్టరీలోకూడ వర్కరు ఏ వస్తువు ఎంత ఉత్పత్తిచేయాలనే విషయాలు తెలియవు. ఇక్కడకూడ మేనేజిమెంటే నిర్ణయాలు తీసుకుంటుంది. అంటే మేనేజింగ్ డైరెక్టరు, టెక్నిషియన్స్, ఇతరులు కూర్చొని తీసుకున్న నిర్ణయాలను వర్కరుమీద రుద్దుతుంటారు. ఇదేవిధంగా సోషలిస్టు దేశాల్లో జరుగుతోంది ఆ దేశాల్లో Private Capitalist లుండరు మొత్తం ప్రాపర్టి జాతీయం చేయడంవల్ల భూమిని పంపకంచేసి co-operatives ఏర్పరచడంవల్ల ఏ వ్యక్తికి లీగల్ ఓనర్‌షిప్

వుండదు. అధికారం పూర్తిగా ప్రభుత్వం చేతుల్లోనే ఉంటుంది. అయినప్పటికీ కార్మికులకి, రైతుకూలీలకి ఉత్పత్తిని నిర్ణయించడానికి కావలసిన అధికారం గాని, హక్కుగాని, ప్రాధాన్యతతో కూడిన participationగాని లేకుండా చేసి నపుడు ఆ దేశాల్లోకూడా ఒక elite అనేది, కార్మికులకన్నా ఉన్నతస్థాయి కలిగిన ఒక కొత్త గ్రూపు అనేది ఆవిర్భవించడానికి అవకాశం వుంటుంది. టెక్నీషియన్స్, మేనేజర్స్, పూర్తి నిర్ణయాలు తీసుకునే ప్రభుత్వ, పార్టీ అధికారులు వీళ్ళంతా కలిసి ఒక కొత్త గ్రూపుగా ఆవిర్భవించడానికి ఈ పంథా అవకాశం కల్పించింది. తత్ఫలితంగా సోషలిస్టు వ్యవస్థకు సంబంధించిన base differenciation రాకపోయినా ఉత్పత్తి సంబంధాల్లో మార్పు రానందున, ఉత్పత్తిమీద టెక్నీషియన్స్, మేనేజర్స్‌కే ఆధిపత్యం ఉండడంతో ఒక Privilised section అనేది చైనాలో మొదటి పంచవర్ష ప్రణాళికా కాలం (1953-57) లో ఆవిర్భవించడం జరిగింది.

ఆ తర్వాతే చైనా కమ్యూనిస్టుపార్టీ ఈ అభివృద్ధి పంథాను సమీక్షించుకోవడం ప్రారంభించింది. ఉన్న వనరుల్ని పారిశ్రామికాభివృద్ధికోసం తరలించడం ఎట్లా అనేది ప్రధానమైన సమస్యగా తలెత్తింది. సోవియట్ యూనియన్ బలవంతంగా కో-ఆపరేటివ్స్‌ను ఏర్పరచడంద్వారా పరిష్కరించుకోగలిగింది. చైనాకొచ్చేసరికి ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల ప్రజల వినిమయ వస్తువుల సరఫరాకు సంబంధించిన సమస్య ఇంకా పరిష్కరింపబడనందున కో-ఆపరేటివ్స్ ప్రారంభంకాలేదు. ఈ కో-ఆపరేటివ్స్ ప్రారంభించనందున గ్రామాల్లో ధనికరైతు అనే వర్గం రూపొందుతుందని మావో గ్రహించాడు.

కారణాల రీత్యా మొత్తం అభివృద్ధి పంథానంతటిని పునఃపరిశీలించడం ప్రారంభించినారు. ఇదే కాలంలో 1956లో సోవియట్ యూనియన్‌లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20 వ మహాసభ జరిగింది. ఈ మహాసభలో కృశ్చేవ్ స్టాలిన్‌ను నిశితంగా విమర్శించాడు నిరంకుశంగా ప్రవర్తించాడని, పార్టీలోని కొంతమందిని చంపించాడని, వ్యక్తిపూజ జరిగిందని, ఎవరినీ మాట్లాడనియ్యలేదని - ఈ రకంగా ఒక మార్క్సిస్టు లెనినిస్టు పద్ధతిలో కాకుండా విమర్శలు చేశాడు. సోవియట్ యూనియన్‌లో జరిగిన అభివృద్ధి నంతటినీ పరిగణించక పోవడమేకాక, మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాన్ని పూర్తిగా వక్రీకరించి శాంతియుతంగాకూడ కార్మికవర్గం అధికారానికి రావచ్చునని ప్రకటించాడు. సోషల్ డెమాక్రాట్లు రూపొందించిన రివిజనిస్టు పంథాను కృశ్చేవ్ పునరుద్ఘాటించాడు.

ఇదే సంవత్సరం హంగరీలో ప్రభుత్వానికి, పార్టీకి వ్యతిరేకంగా తిరుగుబాటు చెలరేగింది. సోవియట్ యూనియన్ ఆ తిరుగుబాటును అణచడానికి తన సైన్యాన్ని పంపింది.

ఈ నేపథ్యంలో మావో సోషలిస్టు దేశాల్లో అసలు పార్టి బాధ్యత, పాత్ర ఏమిటి, అభివృద్ధి ఏవిధంగా సాధ్యమవుతుంది, ఏ రూపంలో ఉండాలి, ఎవరి కోసం ఉండాలి అని ఆలోచించడం ప్రారంభించాడు. ఫలితంగా రెండు ముఖ్యమైన డాక్యుమెంట్లు రూపొందాయి. ఒకటి - Ten major relationship, రెండవది - On direct handling of contradictions. మొత్తం మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతంలోనే గొప్పవిగా పరిగణింపబడుతున్న ఈ రెండు డాక్యు మెంట్లలో మావో ఏం చెప్పాడంటే స్టాలిన్ కాలంనాటికి ఉన్న సోషలిస్టు దేశాల్లో వైరుధ్యాలనేవి పూర్తిగా నిర్మూలింపబడ్డాయి అనే సూత్రీకరణకు భిన్నంగా మావో సోషలిస్టు దేశాల్లోకూడ వైరుధ్యాలుంటాయని, సోషలిస్టు పరి ణామ దశలో అవి కొనసాగుతుంటాయని, వీటిని గుర్తించి పరిష్కారానికి ప్రయత్నించకుండా ఉత్పత్తిశక్తుల అభివృద్ధి అనేది సాధ్యంకాదని సూచించాడు Ten major relationshipsలో — వ్యవసాయరంగం - పారిశ్రామికరంగం భారీ పరిశ్రమలు - చిన్నతరహా పరిశ్రమలు, అభివృద్ధిచెందిన కోస్తా ప్రాంతానికి - underdeveloped interior regionsకి, హాన్ తెగకి - మిగతా మైనారిటీ తెగలకి, పార్టికి-ప్రజలకి ఈ రకంగా వైరుధ్యాలుంటాయని చెప్పాడు. అయితే సోషలిస్టు దశలో ఈ వైరుధ్యాల్ని పరిష్కరించడానికి ఒక violent struggle అనేది అవసరంలేదని, ఇవి non-autogonistic friendly contradiction రూపంలో ఉంటాయని, వీటిని చర్చలద్వారా, నిశితమైన విమర్శలద్వారా, ఆత్మవిమర్శలద్వారా పరిష్కరించుకోవడానికి వీలవుతుందని అన్నాడు. ఈ రెండు డాక్యుమెంట్లు చైనాలో అప్పటివరకు అనుసరించిన ఆర్థికాభివృద్ధి పంథాకు భిన్నమైన Greatly Forward Movementకు పునాది వేశాయి చైనాకు ప్రధానమైన వనరు ప్రజలని, ప్రజలు చైతన్యవంతులై ఉత్పత్తిలో పాల్గొనందే ఆర్థికాభివృద్ధి కాని, ఉత్పత్తిశక్తుల పెరుగుదలకాని సాధ్యంకాదని మావో ఈ రెండు డాక్యుమెంట్లద్వారా సూచించాడు. దీన్ని చైనా కమ్యూనిస్టుపార్టి ప్రజలు విధాననిర్ణయంలో పాల్గొనడానికి అనువయిన మార్పులు చేయడం జరిగింది. దాంతో గ్రామీణ ప్రాంతాల్లో అప్పటివరకు ఉన్న కో-ఆపరేటివ్స్‌ను కలిపి 'కమ్యూన్స్'ను ఏర్పరిచారు పట్టణప్రాంతాల్లో

ఫ్యాక్టరీల్లో విధాననిర్ణయాల్లో కార్మికులకు భాగస్వామ్యం కల్పించడం ప్రారంభమైంది.

విశ్వవిద్యాలయాల్లోకూడ ప్రధానమైన మార్పుచేర్పులు ప్రారంభమయ్యాయి. వీటన్నిటికి మించి Greately Forward Movementలో చైనా కమ్యూనిస్టు పార్టీ తెచ్చిన మరో ముఖ్యమైన మార్పు ఉంది. అది ఉత్పత్తి క్రమంలో అనుసరిస్తున్న పాశ్చాత్యదేశాల టెక్నాలజీనేకాక చైనాలో ప్రజలు సాంప్రదాయకంగా ఉపయోగించిన టెక్నాలజీనికూడ ఆచరణలోకి తెచ్చి ఉత్పత్తిని పెంచడానికి కృషిచేయాలన్నది. ఈ Greately Forward Movementలో మూడు ముఖ్యమైన అంశాలున్నాయి. ఒకటి - Walking on two legs. మొదటి పంచవర్ష ప్రణాళికలో కేవలం భారీ పారిశ్రామిక రంగాన్నే అభివృద్ధి చేసి వ్యవసాయ రంగాన్ని విస్మరించినందును, మొత్తంగా ఆధునిక సాంకేతిక విజ్ఞానంమీదనే ఆధారపడడం మూలంగాను అభివృద్ధి కుంటుపడి సమతౌల్యం దెబ్బతింది కాబట్టి వ్యవసాయరంగం - పారిశ్రామికరంగం, భారీ పారిశ్రామిక రంగం - చిన్నతరహా పరిశ్రమలు, ఆధునిక సాంకేతిక విజ్ఞానం ఇలా సమానంగా ఉపయోగించడానికి నిర్ణయించారు. రెండు - మాస్‌లైన్. ప్రజలు పాల్గొనకుండా ఆర్థికాభివృద్ధి సాధ్యంకాదు కనుక అన్ని స్థాయిల్లోను విధాననిర్ణయాలలో ప్రజలకు ప్రమేయం కల్పించడం. మూడు - చాలా ప్రధానమైనది జనరల్ లైన్. సోషలిస్టు దేశాల్లో అభివృద్ధికి అనుసరించాల్సిన పద్ధతుల్ని అనుసరించడానికి నిర్ణయించారు. ఈ three red bamers యొక్క సహాయంతో ప్రయత్నించిన ఆర్థికాభివృద్ధి రెండు సంవత్సరాలు 1958-60 వరకు అమలుకాగానే పార్టిలో మళ్ళీ అంతరంగిక చర్చ ప్రారంభమైంది. చర్చ ప్రారంభం కావడానికి ఒకానొక ప్రధానమైన కారణం greatly forward కాలంలో ఉత్పత్తి మొదటి సంవత్సరం విస్తృతంగా కొనసాగినప్పటికీ రెండో సంవత్సరాని కొచ్చేసరికి కుంటుపడడం ప్రారంభమైంది. ఇందుకు అనేక కారణాలున్నాయి.

1953లో చైనాకు ఆర్థికసహాయాన్ని అందించడానికి అంగీకరించిన సోవియట్ యూనియన్ ఎప్పుడయితే చైనా Greatly Forward Movement ప్రాకంభించిందో వెంటనే ఆ ఆర్థికసహాయాన్ని ఆపివేసింది అంతేకాక చైనాలో ఉన్న రష్యా సైంటిస్టుల్ని, టెక్నీషియన్స్‌ని అందరినీ ఉపసంహరించుకుంది చైనా పరిశ్రమల్లో అభివృద్ధి మొదలవుతున్న సందర్భంలో

అర్థాంతరంగా ఇలా జరగడంతో ఉత్పత్తి కుంటుపడింది. అయినప్పటికినీ Greatly Forward Movement కాలంలో వచ్చిన సమస్యలు, ఆ అభివృద్ధి పంథా, దాని పునాది అయిన సిద్ధాంతం వీటన్నిటిమీద పార్టిలో 1960-65 మధ్య కాలంలో విస్తృతంగా చర్చ కొనసాగింది. ఇందులో ఒక పంథాకి సంబంధించి spokesmanగా ఉన్న పెంగ్తే హువాయ్‌తోపాటు లీషావ్‌చీ, టెంగ్ సియావో పింగ్ కూడ ఉన్నారు. రెండవవైపు మావోసేటుంగ్, అతని అనుయాయులు ఉన్నారు. లూషాన్‌లో జరిగిన పార్టి సెంట్రల్ కమిటీ మీటింగులోను, ఆ తర్వాత జరిగిన వర్కింగ్ కమిటీ కాన్ఫరెన్సులోను ఈ చర్చలు చెలరేగాయి. సమావేశాలకు కొద్దిరోజుల ముందే సోవియట్ యూనియన్, తూర్పు యూరపు దేశాలు విస్తృతంగా పర్యటనలు చేసిన పెంగ్తే హువాయ్ చైనాలోకూడ సోవియట్ యూనియన్ అభివృద్ధి నమూనాను అనుసరించాలని సూత్రీకరణ చేశాడు Greatly Forward Movement ను విమర్శిస్తూ Politics in command అనేది ఆర్థిక అభివృద్ధికి దోహదం చేయదని, ఆర్థికాభివృద్ధి జరగాలంటే ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం కావాలని, అందుకు అనుసరించాల్సిన కొన్ని ఆర్థికమాత్రాలు సక్రమంగా అమలయ్యేటట్లు చూడాలని, కేవలం ఒక రాజకీయ సిద్ధాంతం సైద్ధాంతికంగా అది ఎంతగా సరయింది అయినా అనుసరించడంవల్ల ఆర్థికాభివృద్ధి సాధ్యంకాదని చెప్పాడు.

సారాంశంలో రాజకీయాలకి - ఆర్థికాభివృద్ధికి, రాజకీయాలకి - ఉత్పత్తి సంబంధాలకి, పునాదికి - ఉపరితలానికి సంబంధాల్ని dialecticalగా కాకుండా ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి సంబంధించిన చర్చనంతా పునాదికి మాత్రమే పరిమితంచేసి, అదికూడా వనరుల సమీకరణ (Financial mobilization) కు సంబంధించిన సమస్యగా చూశాడు. అంటే ఆర్థికాభివృద్ధి జరగాలంటే high technologyని ఉపయోగించాలని, అదొక్కటే efficientగా పనిచేసి ఇతోధికంగా వస్తూత్పత్తి చేస్తుంది కాబట్టి దాన్ని సమర్థవంతంగా ఉపయోగించుకోవాలని పెంగ్తే హువాయ్ చెప్పాడు. High Technologyని అమలుచేయడానికి మేనేజర్స్, దాన్ని వినియోగించే టెక్నీషియన్స్ ఉండాలి కాబట్టి మేనేజర్స్‌కి, టెక్నీషియన్స్‌కి అధికారమిచ్చినపుంటే వస్తూత్పత్తి ద్విగుణీకృతం అయ్యిందేదని, దానికి సంబంధించిన వనరుల్ని సమీకరించుకోవడానికి అవకాశముండేదని టెక్నాలజీని సమర్థవంతంగా వినియోగించడంగా చెబుతూ పెంగ్తే హువాయ్ తన దృక్పథాన్ని బయటపెట్టాడు.

మావో పెంగ్తే హువాయ్‌ని నిశితంగా విమర్శిస్తూ, Greatly Forwa d Movementను విమర్శిస్తున్నారు కాబట్టి, ఆ కాలంలో జరిగిన కొన్ని నష్టాలకి తాను వ్యక్తిగతంగా బాధ్యత వహిస్తానని, ఆర్థికాభివృద్ధి అనేది కేవలం వన రుల సేకరణకు సంబంధించిన అంశంకాదని, ఆర్థికాభివృద్ధి అనేది ఎవరికోసం చేస్తున్నాం, ఆ అభివృద్ధి ఫలితాలు ఎవరు పొందుతారనే రెండు విషయాలకి మనం సమాధానం చెప్పుకోగలిగితే ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ఒక దృక్పథాన్ని ఏర్పరచుకోవడానికి వీలవుతుందని చెప్పాడు. అయితే ఈ రెండింటికి మనం సమాధానం ఎలా చెప్పగలుగుతాం, మనం అనుసరించే రాజకీయ దృక్పథం మాత్రమే సమాధానం నిర్ణయించగలుగుతుంది. ఆర్థికాభివృద్ధి ఎవరికోసమని capitalistని అడిగితే లాభాలకోసమని, ఫ్యాక్టరీ లాభసాటిగా నడవడానికని మేనేజర్, efficient technology ఉంటేనే ఆర్థికాభివృద్ధి సాధ్యమని టెక్నీషియన్ చెప్తారు. ఆర్థికాభివృద్ధి ఎవరికోసమంటే భిన్న దృక్పథాలు వ్యక్తమవుతున్నాయి కాబట్టి ఎవరికి కొనుగోలు శక్తి ఉంటే వాళ్ళు మాత్రమే దీన్ని ఉపయోగించుకుంటారేకాని మొత్తం సామాజిక అవసరాన్ని తీర్చడం కోసం కాదనికూడ చెప్పవచ్చు. అందుకనే ఆర్థికాభివృద్ధి ఎట్లా ఉండాలనే నిర్ణయం ఖచ్చితంగా రాజకీయ దృక్పథానికి సంబంధించిందే. ఇది రాజకీయ దృక్పథానికి సంబంధించిన నిర్ణయం అయినప్పుడు శ్రామికవర్గ రాజకీయాలు ఆధిపత్యంలో ఉన్నప్పుడు మాత్రమే సత్వర ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుందని మావో చెప్పాడు. మరి సత్వర ఆర్థికాభివృద్ధి అనేది ప్రజలమధ్య ఆర్థిక తారతమ్యాలని దశలవారీగా నిర్మూలిస్తూ, మానసిక శ్రమకు - శారీరక శ్రమకు, టెక్నీషియన్స్‌కి - సాధారణ కార్మికునికి, మేనేజర్స్‌కి - వర్కర్స్‌కి, పార్టీ బ్యూరాక్రసీకి - ప్రజలకి మధ్యనుండే వైరుధ్యాల్నికూడ తొలగించాలి. సారాంశంలో ఈ తేడాల్ని తొలగించాలంటే శ్రామికవర్గ ప్రాపంచిక దృక్పథాన్ని అనునిత్యం అనుసరిస్తూ, ప్రజల్ని భాగస్వాముల్ని చేయాలని నొక్కిచెబుతూ మావో ఎప్పుడయితే ప్రజలకు భాగస్వామ్యం ఉంటుందో అప్పుడు పార్టీకి ప్రజలకి సన్నిహిత సంబంధం ఏర్పడే అవకాశం ఉంటుందని చెప్పాడు. ఈ lively contact ఉన్నప్పుడు పార్టీ ఏదైనా పొరపాట్లు చేస్తే సర్దుబాటు చేసుకునే అవకాశంకూడ ఉంటుంది. కాబట్టి రాజకీయ దృక్పథం చాల అవసరం. దాన్ని సక్రమంగా అనుసరించినపుడు మాత్రమే సక్రమంగా ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుందని చెప్పాడు. దీనికి సంబంధించిన మరికొన్ని వివరాలు సాంస్కృతిక విప్లవకాలంలో వెలుగులోకి వచ్చాయి. ఎప్పుడయితే ఈ వైరు

ధ్యాలు పార్టీలో వచ్చాయో రెండు గ్రూపులు ఏర్పడుతూ వచ్చాయి. ప్రజల తారతమ్యాలు తొలగించేటట్లు శ్రామికవర్గ దృక్పథం అనుసరించి ఆర్థికాభివృద్ధి సాగాలనేది ఒకటి; టెక్నీషియన్స్‌కి, మేనేజర్స్‌కి ఆధిపత్యం ఇచ్చి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని సక్రమంగా అమలుచేస్తే ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుం దనేది రెండవ దృక్పథం. ఈ రెండు దృక్పథాల మధ్య సంఘర్షణలు చెల రేగిన కాలంలో మావో ప్రజల్ని సమీకరించడానికి అవసరమైతే పార్టీకి వ్యతిరే కంగాకూడా ప్రజల సమీకరణకు విస్తృతంగా ప్రయత్నం చేశాడు.

చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో ముఖ్యంగా post cultural revolution periodలో అంతరంగికంగా పార్టీలో జరిగిన చర్చలను వాళ్ళు వివిధ రూపాలలో ప్రజల ముందుకు తీసుకొచ్చారు. ప్రత్యేకంగా వాళ్ళు సాహిత్యాన్ని కళల్ని విస్తృతంగా ఉపయోగించారు. 1960-65 మధ్యకాలంలో ఫిలాసఫీకి సంబంధించిన సైద్ధాంతిక చర్చల్లోను, సాహిత్యానికి సంబంధించిన చర్చల్లోను పార్టీలో వుండే విభేదాలకు సంబంధించిన చర్చ ప్రతిఫలించింది. తత్వశాస్త్రా నికి చెందిన రెండు ముఖ్యమైన వాదనలు వచ్చాయి. కన్‌ఫ్యూసియస్ సిద్ధాం తంలో ఉండే కొన్ని నైతిక విలువల్ని, మానవత్వ విలువల్ని కమ్యూనిస్టు పార్టీ కొనసాగించాలని ఒక దృక్పథం వచ్చింది. దీనికి వ్యతిరేకంగా కన్ ఫ్యూషియస్ ఫ్యూడల్ సమాజానికి సంబంధించిన తత్వవేత్త, ఆ విలువల్ని సోషలిస్టు దేశాలు కొనసాగించడానికి వీలులేదని, సోషలిస్టు దేశాలు మార్క్సిస్టు సిద్ధాంతం వెలుగులో కొత్త నీతిసూత్రాల్ని, విలువల్ని రూపొందించుకుంటా యని మావో దృక్పథాన్ని అనుసరించినవాళ్ళు తీసుకొచ్చిన రెండవ దృక్పథం.

**One splits into two, two unites into one** అనే మార్క్సిస్టు dialecticsలో ప్రధానమైన unity of opponents అనే సిద్ధాంతానికి సంబం ధించి unity అనేది ప్రధానమా, వాటిమధ్య ఉండే వైరుధ్యం ప్రధానమా అనే చర్చకూడా ముందుకువచ్చింది. Unity అనేది ప్రధానమని, వైరుధ్యాలు సెకండరీ అని కాపిటలిస్ట్ అభివృద్ధిపంథాను అనుసరించాలనేవాళ్ళు అంటే, contradiction ప్రధానం, యూనిటీ సెకండరీ అని, యూనిటీ అనేది టెంప రరీగా ఉంటుందని, అనివార్యంగా ఈ వైరుధ్యాలు బద్దలైపోయి వ్యవస్థ గుణాత్మంగా ఉన్నతదశకు చేరుకోక తప్పదని, అది dialectics యొక్క మౌలిక లక్షణమని మావో వాళ్ళు చెప్పారు. ఈవిధంగా రెండు భిన్నమైన తాత్విక దృక్పథాలు రూపొందుతూ వచ్చాయి.

రెండవవైపు సంఘర్షణయొక్క ప్రభావమనేది art of cultureలో కూడ కనబడుతుంది. 'జియాంగ్ జంగ్' నేపథ్యంలో సాహిత్యం, కళలు అనేవి సోషలిస్టు సిద్ధాంతం ఆధారంగా రూపొందాలని, ప్రజల సంస్కృతి, సమస్యలు ప్రతిఫలించేవిగా ఉండాలని చెప్పిన వాళ్ళున్నారు. ఈ సంఘర్షణ ఆ కాలంలో వచ్చిన 'Are you wish dismissal' అనే నాటకంమీద జరిగిన చర్చలోకూడ వ్యక్తమయింది. అయితే అప్పటికి వచ్చిన నాటకాలు, నవలలు పాత ఫ్యూడల్ సమాజానికి సంబంధించిన అనేక అంశాల్ని బలపరుస్తూ వచ్చినటువంటివి. అటువంటి వాటిలో ఈ 'Are you wish dismissal' నాటకం ఒకటి. ఈ నాటకం చైనాలో మింగ్ రాజుల కాలంనాటి ఒక సంఘటన ఆధారంగా రూపొందింది. ఆ మింగ్ రాజుల కాలంలో ఉండే మంత్రి కాయుబీ, చక్రవర్తి ప్రజల భూముల్ని ఆక్రమించడాన్ని, అవినీతికి పాల్పడడాన్ని వ్యతిరేకించి శిక్షకూడ అనుభవించాడట. ఆధునిక యుగంలోకూడ కాయుబీలున్నారని పెంగ్తే హువాయ్ కాయుబీ లాంటివాడని, మింగ్ రాజుల కాలంనాటి క్రూరమైన నిర్బంధాన్ని అమలుజరిపేవాడు మావో అనే భావాన్నిచ్చే రూపంలో ఈ నాటకాన్ని రచయిత రాశాడు. దీన్ని వ్యతిరేకిస్తూ సాంస్కృతిక విప్లవకాలంలో ప్రధానమైన పాత్రను నిర్వహించిన యాంగ్‌బివాంగ్ రాసిన ఒక వ్యాసంలో మింగ్ రాజులనాటి వైరుధ్యాల్ని మారిన నేటి పరిస్థితులకు అన్వయించడానికి వీల్లేదని, ఆధునిక సోషలిస్టు దేశాల్లో private property అనేది ఉండడానికి వీల్లేదని, మొత్తం సామాజికీకరణ అనేది జరుగుతున్న తరుణంలో private property గురించి మాట్లాడడం reactionary దృక్పథం అవుతుందని రాశాడు. ఈ విధంగా స్పష్టమైన రెండు విభజనలు ప్రారంభమైనాయి. ఈ నేపథ్యంలో పెంగ్తేహువాయ్‌ని తొలగించి లిన్‌పియావోను డిఫెన్స్ మినిష్టరుగాను, సైన్యాధిపతిగాను పార్టీ నియమించింది. తద్వారా చాలా అభిప్రాయాలను మావో People's Liberation Armyలో కొంతమేరకు అమలుచేయడానికి వీలయింది

మావో దృష్టిలో Greatly Forward Movement వైఫల్యం చెందడానికి ప్రధాన కారణం పార్టీ కార్యకర్తలు బ్యూరాక్రటిక్‌గా, అథారిటీగా వ్యవహరించి ప్రజలకు భాగస్వామ్యం కల్పించలేదని, అందుకే ఒక సోషలిస్టు ఎడ్యుకేషన్ క్యాంపెయిన్ అనేది పార్టీ అమలుచేయాలని మావో ప్రతిపాదించాడు. అందుకోసం 1963లో 10 సూత్రాల పథకం ఒకటి అమలుజరపడం జరిగింది. ఇందులో పార్టీ కార్యకర్తలు ప్రజలతో సత్సంబంధాలు ఏర్పరచు

కొని అథారిటీని, బ్యూరాక్రసీని వదలుకోవడానికి ప్రజలకు పార్టీ కార్యకర్తల్ని విమర్శించడానికి అవకాశం కల్పించాలని ఈ ప్రతిపాదనల్లో చెప్పాడు. అంటే ప్రతి కమ్యూన్‌లో ప్రధానంగా గ్రామీణ ప్రాంతంలో జీతభత్యాల పంపకం, నిర్ణయాలు తీసుకోవడం, మొత్తం కమ్యూన్ యొక్క ఆర్థికవనరుల వినియోగం మొదలయిన అంశాల చర్చల్లో ప్రజలకే అవకాశం ఇవ్వాలని, పార్టీలోకూడ **capitalist roaders influence** చేయగలుగుతున్నారని, కాబట్టి పార్టి కార్యకర్తల్ని ప్రజలు నిశితంగా విమర్శించినపుడు మాత్రమే కమ్యూన్లు సక్రమంగా నడుస్తాయని చెప్పాడు. అయితే ప్రజలు పార్టిని విమర్శించడానికి వీలులేదని పార్టి సక్రమమైన మార్గంలోనే నడుస్తోందని, ఎవరయినా కొంతమంది పొరపాట్లుచేస్తే దాన్ని పార్టి ఉన్నతస్థాయి కమిటీ చూసుకుంటుందని చెప్పి పార్టి సెంట్రల్ కమిటీ సోషల్ ఎడ్యుకేషన్ క్యాంపెయిన్‌ను మార్చేసింది. ఇందుకోసం వివిధ కమ్యూనిస్టుపార్టి కార్యకర్తలతో ఏర్పడిన వర్క్ కమిటీలనేవి ఏర్పాటుచేసి క్రిందిస్థాయి కమిటీలను, యూనిట్లను పర్యవేక్షించడానికి ఈ వర్క్ కమిటీలకే అవకాశం ఇవ్వాలని, ప్రజలకు అవకాశం ఇవ్వకూడదని సోషల్ ఎడ్యుకేషన్ క్యాంపెయిన్‌ను సిరుగార్చింది. ఎప్పుడైతే ఈ మార్పులు సెంట్రల్ కమిటీ చేసిందో పార్టిలో అంతరంగిక వైరుధ్యాలు తీవ్రమయ్యాయి. మొత్తంమీద ఆధిపత్యంలో ఉన్న లీషావ్‌చీ, తెంగ్ సియావోపింగ్ 1961-65 మధ్యకాలంలో తెచ్చిన మార్పుల్ని పరిశీలిస్తే ఈ రెండు పంథాలమధ్య వైరుధ్యం అర్థమవుతుంది.

**Great Forward Movement** కాలంలో 10-40 మంది సభ్యులతో టీమ్‌లను, గ్రామస్థాయిలో బ్రిగేడ్లను, కొన్ని బ్రిగేడ్లను కలిపి కమ్యూన్లను రూపొందించారు. నిర్ణయాలు కమ్యూన్లు తీసుకునేవి. ఆ తర్వాతకాలంలో ఈ నిర్ణయాలను తీసుకునే అధికారాన్ని బ్రిగేడ్లకు మార్చారు. కమ్యూన్ల అధికారాన్ని తగ్గించడంతోపాటు ఈ కాపిటలిస్టులు దీనికి మించిన, కీలకమైన మార్పును తెచ్చారు. అదేమిటంటే వ్యక్తిగతంగా ప్రతి కుటుంబానికి ఒక **private plot** కేటాయించడం ప్రారంభించారు. **Greatly Forward** కాలంలో లేని ఈ **private plots** యొక్క **contribution** విస్తృతమై, విస్తీర్ణతలో కూడ పెరిగింది.

రెండవ ముఖ్యమైన మార్పు విద్యాలయాల్లో తెచ్చారు. **Greatly Forward** కాలంలో అడ్మిషన్లు కేవలం మెరిట్‌మీదే ఆధారపడకుండా విద్యార్థులకు

ఉండే backgroundను, వాళ్ళకుండే రాజకీయ దృక్పథాన్ని పరిగణనలోకి తీసుకునేవాళ్ళు. Poor peasant, working class నుండి వచ్చినవాళ్ళకి అదనంగా కొన్ని పాయింట్లు ఇచ్చి వాళ్ళకు ప్రత్యేకంగా సీట్లు రావడానికి అవకాశం కల్పించేవారు అధ్యయనం అనేదికూడ కేవలం పాఠశాలలకే పరిమితం కాకుండా వివిధ కార్యక్రమాల్లో పాల్గొనేటట్లు చేసేవాళ్ళు. ఆ తర్వాత ఈ మొత్తం trendను reverse చేసి మార్కులకోసం, ఉన్నత పదవులు, మంచి ఆదాయం సంపాదించుకోవచ్చు అనేటటువంటి దృక్పథాన్ని విద్యార్థుల్లో పెంచడం ప్రారంభించారు. దాంతో 1960-65 మధ్యకాలంలో rich peasants capitalist roaders యొక్క పిల్లల అడ్మిషన్లు 60% పెరిగితే, working class, poor peasants యొక్క పిల్లల అడ్మిషన్లు 40% తగ్గిపోయి ఆ తర్వాత మరింత తగ్గుతూ వచ్చాయి. ఫ్యాక్టరీల్లోకూడ మొత్తం నిర్ణయాల్ని యాజమాన్యం తీసుకొని కార్మికుల భాగస్వామ్యాన్ని, పాత్రను తగ్గించేటట్లు చేశారు.

ఈ మొత్తం పరిణామాలకు వ్యతిరేకంగా మావో 1960-65 మధ్య కాలంలో విస్తృతంగా సోవియట్ యూనియన్ ఆర్థికాభివృద్ధి పంథాను విమర్శించడం, పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ సహాయంతో మార్క్సిస్టు లెనినిస్టు ఆలోచనల్ని ముందుకు తీసుకుపోవడానికి ప్రయత్నం చేశాడు. ముసలివాడు ఆలోచించడం నిర్ణయాలు తీసుకోవడం చేయలేడు అని capitalist roaders చేస్తున్న విమర్శల్ని దెబ్బతీయడానికి మావో యాంగ్సీనదిని ఈదాడు. పెకింగ్‌ను వదలి గ్రామాలు తిరిగాడు. పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ లేబర్ యాక్టను అమలుపరచడం, ఉత్పత్తిలో భాగం పంచుకోవడం చేయమని ప్రోత్సహించాడు. మావో పెకింగుకు తిరిగి వచ్చింతర్వాత 'May 16 directive'ను జారీచేస్తూ పార్టీ capitalist roaders చేతుల్లోకి పోయిందని, వారిని నిర్మూలించి పార్టిని పటిష్టం చేయడానికి మళ్ళీ విప్లవం చేయాలని 16 అంశాలతో సాంస్కృతిక విప్లవం ప్రారంభించాడు. 'Bombard the Head Quarters' అంటే నిరంకుశ పార్టి నాయకత్వానికి వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటు చేయమని, ఏటికి ఎదురీదడానికి భయపడవద్దని, మార్క్సిస్టు లెనినిస్టు అభిప్రాయాల్ని వ్యాప్తిలోకి తేవాలని మావో పిలుపునిచ్చాడు. దీని ప్రభావంతో విద్యార్థుల్లో 'red guards' అనే సంస్థ ఉద్భవించింది. ఇలాంటివి దేశవ్యాప్తంగా స్థాపించమని మావో పిలుపునిచ్చాడు. దాంతో పార్టి సెంట్రల్ కమిటీ చెంపోటా నాయకత్వంలో

సాంస్కృతిక విప్లవానికి పిలుపునిచ్చింది. దీనిద్వారా రెండు అంశాలకు వ్యతిరేకంగా పోరాడమని స్పష్టంగా పిలుపునిచ్చాడు మావో.

ఒకటి — కమ్యూనిస్టుపార్టి అధికారానికి వచ్చింతర్వాతకూడ ఉపరితలంలో అన్య వర్గ ధోరణులు వ్యాప్తిలో ఉంటాయని, అంటే శ్రామికవర్గ ప్రాపంచిక దృక్పథానికి సంబంధంలేని ఫ్యూడల్, పెట్టుబడిదారి భావజాలం, సంస్కృతి కొనసాగుతుంటుందని, ఈ Four Bonds - ideal, cultural, art, literatureలను నిర్మూలించకుండ చైనాలో సోషలిస్టు వ్యవస్థను అభివృద్ధి చేయలేమని చెప్పాడు. విభిన్న రకాలయిన వైరుధ్యాలు సమాజంలో కొనసాగుతాయని, ఉపరితలంలో పాతభావాల్ని ఛేదించకుండా సోషలిస్టు ఉత్పత్తిని పెంపొందించలేమని, పార్టిలో రివిజనిస్టు - capitalist roadersకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయమని మావో సాంస్కృతిక విప్లవంద్వారా ప్రజలకు పిలుపునిచ్చాడు. ఈ పిలుపును అందుకున్న చైనా ప్రజానీకం పెద్దయెత్తున మాదేళ్ళపాటు ఈ సాంస్కృతిక విప్లవం కొనసాగించింది.

మొదటి సంవత్సరం విద్యార్థులు యువజనులు రెడ్‌గార్డ్స్ రూపంలో అందరికీ విద్యాభ్యాసం కావాలని, ముఖ్యంగా శ్రామికవర్గం పిల్లలకు విద్యావకాశాలు పెంచాలని డిమాండ్‌చేస్తూ కేవలం విద్యాలయాలకే పరిమితంకాక ప్రభుత్వ, పార్టీ అధికారులు ఎవరైతే శ్రామిక వ్యతిరేకులై dictatorialగా, authoritative గా, బ్యూరాక్రటిక్‌గా ప్రవర్తించడం, అవినీతికి పాల్పడ్డం చేస్తున్నారో వాళ్ళను బహిరంగంగా విచారించి, వాళ్ళు చేసిన నేరాలను బోర్డురాసి వాళ్ళమెడలో తగిలించి, బఫూన్‌టోపీ పెట్టి ఊళ్ళో ఊరేగించేవారు. పార్టి కార్యకర్తలకు వ్యతిరేకంగా చాలాచోట్ల ఈ కార్యక్రమాలు red guards తీసుకోవడంతో, అప్పటికే బలంగాఉన్న capitalist roaders red guards లో ఉన్న సాధారణ పెట్టి బూర్జువా అవలక్షణాల్ని ఉపయోగించుకొని దాన్ని fractions గా విడగొట్టి వాటిమధ్య వైరుధ్యాల్ని పెంచి ఈ ఉద్యమాన్ని అణచడానికి కూడా ప్రయత్నం చేశారు. తత్ఫలితంగా 1966 చివరిదశ-1967 మొదటికి వచ్చేసరికి red guards లో ఘర్షణలు, కొట్లాటలు మొదలయ్యాయి అయితే 1967 కు వచ్చేసరికి red guards తో పాటు కార్మికులు కూడా ఉద్యమంలో పాల్గొనడం ప్రారంభమైంది. మొట్టమొదట షాంఘైలో కార్మికుల ఉద్యమం మొదలైంది. షాంఘైలో ఉన్న విభిన్న క్యాడర్ల కార్మికులు - టెక్నీషియన్స్, అప్రెంటీస్, పర్మినెంట్, టెంపరరీ - తమకున్న విభిన్న కారణాలరీత్యా విభిన్న associations గా ఉన్న

వన్నీ "వర్కర్స్ హెడ్ క్వార్టర్స్" అని ఒక effective ఫెడరేషన్‌గా ఏర్పడి స్థానిక ప్రభుత్వ - పార్టి నాయకులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు వీళ్ళు ప్రధానంగా నిరంకుశ, అవినీతికర పార్టి నాయకత్వం ప్రజాహితవు కోసం అనిచెప్పి వ్యక్తుల రాజకీయ దృక్పధాలకు సంబంధించి కార్మికులు, విద్యార్థులు, సామాన్య ప్రజానీకం మీద అక్రమంగా తయారుచేసిన Dociares (ఫైళ్ళు)ను తగలబెట్టాలని, నాశనం చేయలని పిలుపునిచ్చారు.

దీంతో పార్టి - ప్రభుత్వ నాయకత్వాలకు, వర్కర్స్ హెడ్ క్వార్టర్స్‌కు మధ్య ఘర్షణలు చెలరేగాయి. కార్మికులు తమ సమస్యలు నివేదించుకోవడానికి పెకింగ్‌కు వెళ్ళడానికి ప్రయత్నిస్తే పార్టినాయకత్వం, ప్రభుత్వ యంత్రాంగం వారిని నిర్బంధించడానికి పూనుకొంది. అప్పుడు "సాంస్కృతిక విప్లవ కమిటీ" ప్రతినిధులు జోక్యం చేసుకొని కార్మికుల న్యాయమైన సమస్యలు పరిశీలించి ఈ దోసియర్స్‌ని బహిరంగంగా తగలబెట్టడానికి పార్టియే పిలుపునిచ్చింది. అయితే తర్వాత ఈ కార్యక్రమాన్ని ఉపేక్షించింది, చివరగా వుపసంహరించింది. అంతేకాక పార్టినాయకత్వం పెద్దఎత్తున జరుగుతున్న ఈ తిరుగుబాటును చీల్చడానికి పూనుకుంది. పార్టీనాయకత్వం కార్మికులకు హఠాత్తుగా జీతాలుపెంచి, బకాయిల రూపంలో పెద్దమొత్తంలో డబ్బులిచ్చారు. ఆర్థిక సమస్యలకోసం ఇంకా ఉద్యమించండని వర్కర్స్ హెడ్‌క్వార్టర్స్‌కు వ్యతిరేకంగా కార్మికుల్ని రెచ్చగొట్టారు. దీంతో వర్కర్స్ హెడ్‌క్వార్టర్స్‌లో రెండు వర్గాలు తయారై సంఘర్షించుకోవడం మొదలైంది. అయినా ఈ వర్కర్స్ హెడ్‌క్వార్టర్స్ కొన్ని కమిటీలను నియమించి అన్నిరంగాలలోని కార్మికుల దగ్గరికెళ్ళి ఈ ఆర్థిక తత్వం పనికిరాదని, సమాజం గురించి, సమిష్టిప్రయోజనం గురించిన దృక్పధాన్ని పెంపొందించు కోవాలని వివరించడం చేసింది. తత్ఫలితంగా తమకు వచ్చిన మొత్తం డబ్బును వాపసు ఇచ్చేశారు. ప్రభుత్వాన్ని దివాళా తీయడానికి జరిగిన ఈ ప్రయత్నాన్ని కార్మికులు వమ్ముచేశారు. అంతేకాక అన్నిరంగాలకార్మికుల్ని తమ నాయకత్వంలోకి తీసుకొచ్చారు. అన్ని కార్యక్రమాల్ని కార్మికులే స్వయంగా నిర్వహిస్తూ వచ్చారు.

ఈ కాలంలోనే షాంఘైలో కమ్యూన్ అనేది రూపొందింది. షాంఘైకార్మికులతో పాటు వివిధ పట్టణాల్లో కూడా ఈ తిరుగుబాట్లు జరిగినా సంఘటితంగా కొట్లాడగలిగిన శక్తిని కాని, షాంఘై కార్మికులు ప్రదర్శించగలిగిన పరిణతకాని చూపలేకపోయారు. అటువంటిచోట్ల పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ నేరుగా జోక్యం

చేసుకొని వర్కర్స్‌ని సపోర్టు చేయాలని సాంస్కృతిక విప్లవ కమిటీ పిలుపు నిచ్చింది. ఈ నేపథ్యంలో "త్రీ-ఇన్-వన్" అనే విప్లవకర కమిటీలు రూపొందాయి. ఇందులో వర్కర్స్ పార్టీలో ఇంకా విప్లవ పంథాను అనుసరించేవాళ్ళు, పీపుల్స్ లిబరేషన్ ఆర్మీకి సంబంధించిన ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. షాంఘై కమిటి, త్రీ-ఇన్-వన్ కమిటీలలో దేన్ని కొనసాగించాలి అని చైనా కమ్యూనిస్టు పార్టీలో చర్చలు జరిగి, పార్టీకుండాల్సిన అవశ్యకత, దాన్ని కొనసాగించాల్సిన దృక్పథాన్ని దృష్టిలో వుంచుకొని షాంఘై కమ్యూన్ కంటె త్రీ-ఇన్-వన్ కమిటీలే బలంగా పనిచేయగలవని నిర్ణయానికివచ్చి, షాంఘై కమ్యూన్‌నుకూడా ఒక విప్లవకర త్రీ-ఇన్-వన్ కమిటీగా మార్చారు. అయితే కొన్నిసందర్భాల్లో P L A తో కూడా వైరుధ్యాలొచ్చాయి. మొత్తంగా P L A కూడ దిగజారిన పార్టీ కార్యకర్తల్నే కొన్నిచోట్ల సపోర్టుచేయడం జరిగింది. వూహాన్‌లో ఇలాగే జరిగింది. అటువంటి P L A కమాండర్స్‌ని తొలగించి విప్లవకరమైన వాళ్ళతోనే ఈ కమిటీలు రూపొందాయి. ఈ విధంగా 1966, '67లో కొనసాగిది.

1967 చివరిభాగం, '68 మొదటి భాగానికి వచ్చేసరికి సాంస్కృతిక విప్లవంలో కొన్ని అతివాద ధోరణులు తలెత్తాయి. నిజానికి ఈ అతివాద ధోరణులు సాంస్కృతిక విప్లవం మొదటిదశ నుంచికూడా కనబడతాయి. మావో రచనల్లో కొన్ని కొటేషన్స్‌ని నిత్యం వల్లెవేస్తేచాలు మొత్తం శ్రామికవర్గ ప్రాపంచిక దృక్పథం అలవడుతుందనే ఒక తప్పుడు అవగాహనతో వేసిన red Books చదవడమనే ధోరణి కొనసాగింది. దీన్ని గుర్తించినపార్టీ తర్వాత నివారించింది 1967 చివరిదశకొచ్చేసరికి మావోను ఒక దేవుడిలా చిత్రీకరించే ప్రయత్నాన్ని కూడా పూర్తిగా నివారించుకుంది. వీటన్నిటికిమించి రెడ్‌గార్డ్స్‌ల నుండి వచ్చిన అతివాదధోరణి ఎలా ఉందంటే మ్యూజియమ్స్, ఆర్ట్ గ్యాలరీలమీద దాడిచేసి సాంప్రదాయకంగా, చారిత్రకంగా వచ్చిన కొన్ని కళారూపాల్నికూడా ధ్వంసం చేయడం జరిగింది. అంతేకాక రోడ్లమీద ఎవరైనా బుద్ధిష్టు వేషధారణ కలిగిన వాళ్ళు కనబడితే వాళ్ళమీదకూడ దాడిచేయడం జరిగింది. పాత భావాల్ని, విలువల్ని, సాహిత్యాన్ని, కళల్ని నాశనం చేయాలనేదాన్ని ఇలా భౌతిక దాడులకు పూనుకొని, కేవలం చర్చలద్వారా పరిష్కరించుకోవడానికి అవకాశంవున్నా వినియోగించుకోవడానికి ప్రయత్నించక బలప్రయోగంతో ఒప్పించాలనే అతివాద ధోరణి అమలయింది. ఇది సాంస్కృతిక విప్లవం చివరిదశకొచ్చేసరికి ఇంకా

పెరుగుతూవచ్చింది. ఫలితంగా P L A సహాయంతో ఈ left deviations ని కంట్రోల్ చేసి రెవల్యూషనరీ కమిటీల్ని నిర్మించడానికి ప్రయత్నం చేయాల్సి వచ్చింది. తత్ఫలితంగా 1968కి వచ్చేసరికి త్రీ-ఇన్-వన్ అనేకమిటీలురూపొం దాయి. విద్యాలయాల కమిటీల్లో విద్యార్థి-వుపాధ్యాయ-పార్టి ప్రతినిధులు, గ్రామ కమిటీలో కమ్యూన్ నిర్వాహకులు, రైతాంగ ప్రతినిధులు, పార్టి - అధికారులు సభ్యులుగా వుండే సాంస్కృతిక విప్లవాన్ని ముందుకు తీసుకుపోవడం జరిగింది కానీ 1969 లో జరిగిన చైనా కమ్యూనిష్టుపార్టి 9వ మహాసభలో సాంస్కృతిక విప్లవాన్ని నిలిపివేస్తున్నామని, అయితే సాంస్కృతిక విప్లవం సమాజానికి అవ సరమనీ, సోషలిస్టు దేశాల్లో వైరుధ్యాలున్నంతకాలం దీన్ని కొనసాగించాల్సిన ఆవశ్యకత వుంటుందని ప్రకటించారు.

సాంస్కృతిక విప్లవం లేదా సాంస్కృతిక విప్లవంలో ఆవిర్భవించిన ఈ త్రీ-ఇన్-వన్ కమిటీలయొక్క విశిష్టతగురించి మనం చెప్పుకోవలసి వస్తే ఇది కేవలం పాతభావాల్ని, సాంప్రదాయాల్ని వ్యతిరేకించే దృక్పథాన్ని అను సరించి పార్టిలో రివిజనిస్టు, కాపిటలిస్టు రూడర్స్‌కు వ్యతిరేకంగా కేవలం ఉపరి తలానికి సంబంధించిన పోరాటంమాత్రమే కాదు. పాత భావాల్ని, విలువల్ని విమర్శిస్తూ కాపిటలిస్టు రూడర్స్‌కు వ్యతిరేకంగా జరిగే పోరాటక్రమంలో ప్రతి వ్యక్తి తనలోకూడ అలాంటి భావాలు, విలువలు ఉండేవాటిని నిర్మూలించుకొని శ్రామికవర్గ ప్రాపంచిక దృక్పథాన్ని ఇంకా బలంగా అలవర్చుకుంటాడని, అంటే వ్యక్తి తన్నుతాను విప్లవీకరించుకోవడంతోపాటు మొత్తం పార్టిని, సమాజాన్ని, ప్రజల్ని విప్లవీకరించుకోవడానికి కల్పించే ఒక మహత్తర పోరాటం ఈ సాంస్కృతిక విప్లవం అని చెప్పవచ్చు. ఈవిధంగా విప్లవీక రించిన వ్యక్తి రూపొందినపుడు చైనాలో సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం బలంగా కొనసాగించడానికి వీలవుతుందని, అపుడే ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుందని సాంస్కృతిక విప్లవం చెబుతుంది. అందుకే చైనాలో Gross revolution - Promote production అనే నినాదం ముందుకువచ్చింది. శారీరకశ్రమ అనేది మానసిక శ్రమకన్నా ఉన్నతమైంది అనే దృక్పథం సమాజంలో వ్యాప్తిలో ఉంది. శారీరకశ్రమే సమస్త వస్తుసంపదల సృష్టికి మూలకారణ మని, అందువల్లే కార్మికులకి, రైతాంగానికి విధాన నిర్ణయంలో ప్రాధాన్యతను పాత్రను పెంచినపుడుమాత్రమే శారీరకశ్రమపట్ల వ్యతిరేకత సమాజంలో తొలగిపోయి వారికి గుర్తింపు వస్తుందని CR చెబుతుంది. అందుకే Greatly Forward కాలంలో అనుసరించిన ఆర్థికాభివృద్ధి పంథాలో రెడ్‌గార్డ్స్ నినాదం

ఇచ్చినట్లు Four Bonds - Demons and Devils of the past and presentలను తొలగించకుండ ప్రజల్లో విప్లవచైతన్యం పెంపొందించలేమని, ఈ విప్లవ చైతన్యం పెంపొందించినపుడు మాత్రమే కమ్యూనిస్టు దిశగా వెళ్ళే ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుందని మావో చెప్పాడు. అంటే dialecticalగా సమాజాన్ని ఒక totalitiesగా చూడటంలో పెంగ్తేహువాయ్, స్టాలిన్ సైతం విఫలమయ్యారని ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఆటంకంగా ఉండే విలువల్ని నాశనం చేయకుండ విప్లవీకరించబడిన ఒక నూతన మానవుడు ఆవిర్భవించడని, ఆవిధంగా రూపొందిన మానవుడు విప్లవోత్తేజంతో అసమానతలకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో చొరవగా పాల్గొని, వస్తూత్పత్తిని పెంచి తద్వారా ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి తోడ్పడతాడని మావో చెప్పాడు. అంటే ఉత్పత్తి శక్తులు అభివృద్ధి అయితే వాటంతట అవే ఉత్పత్తి సంబంధాలు లేదా ఉపరితలం మారుతుందనే ఒక యాంత్రిక దృక్పథం అప్పటికి ఉండింది. దానికి వ్యతిరేకంగా పోరాడమని సాంస్కృతిక విప్లవం చెబుతుంది.

ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు ఒక గతితార్కిక సంబంధం ఉంటుందనేదాన్ని గుర్తించక, అంటే ఉత్పత్తిశక్తుల అభివృద్ధి క్రమంలోనే లేదా ఉత్పత్తిక్రమంలోనే ఉపరితలాంశాలు రూపొందుతాయని, వర్గసమాజంలో ఆధిపత్యంలో ఉన్న వర్గానికి సంబంధించిన భావజాలమే ఆధిపత్యం వహిస్తూ ప్రజల్లో మార్మికతను సృష్టించడానికి, ఆ వర్గవ్యవస్థ అలాగే కొనసాగడానికి అంతకన్నా అనివార్యపద్ధతి ఇంకొకటి లేదనే అభిప్రాయాల్ని కలిగించడానికి తోడ్పడుతుందని గుర్తించనందున అలాంటి యాంత్రిక దృక్పథం అలవడడానికి కారణమైంది. ఈ యాంత్రిక దృక్పథం సరయిందికాదని సాంస్కృతిక విప్లవం నొక్కిచెప్పింది. ఉత్పత్తిశక్తుల్ని విప్లవీకరించడం అనేది అనునిత్యం కొనసాగించాల్సిన పోరాటమని, అందుకోసం దానికి ఆటంకంగా ఉండే శక్తులకు వ్యతిరేకంగా పోరాడేటప్పుడు ఉపరితలంలో వాటికి సంబంధించిన అంశాలకు వ్యతిరేకంగాకూడ పోరాడినపుడు మాత్రమే విప్లవీకరించిన మానవుడు ఉద్భవించి ఉత్పత్తిసంబంధాలు మౌళికంగా మారుతాయని, తత్ఫలితంగా ఉత్పత్తిశక్తులుకూడ అభివృద్ధి అవుతాయని సాంస్కృతిక విప్లవం ముందుకు తెచ్చింది. ఈ దృక్పథంతో పనిచేసే కార్మికుడు తాను అనునిత్యం ఏర్పరచుకునే practical knowledge ద్వారా శాస్త్రీయంగా శిక్షణపొందిన వాళ్ళతో కలిసినపుడు మాత్రమే ఉన్నతమైన ఉత్పత్తిపద్ధతుల్ని రూపొందించుకోవడానికి వీలుంటుంది. దీన్ని త్రీ-ఇన్-వన్ కమిటీలో ఉండే పార్టీ ప్రతినిధి దేశ

వ్యాపితంగా వెలుగులోకి రావడానికి దోహదంచేస్తాడు. సాంస్కృతిక విప్లవం చెప్పే మరొక ముఖ్యమైన విషయం ఏమిటంటే పార్టీ అనేది శ్రామికవర్గ దృక్పథాన్ననుసరించి సమాజంలో రాజకీయంగా, ఆర్థికంగా భావజాలంలోను అన్నిరంగాల్లోను శ్రామికవర్గ ఆధిపత్యాన్ని కొనసాగించేందుకు ఉపయోగపడే ఒక సాధనమేకాని శ్రామికవర్గంమీద ఆధిపత్యం చెలాయించుకోవడంకోసం కాదని, ఈ సాధనం దిగజారిపోయినపుడు, అందులో దీన్ని కొంతమంది పెట్టుబడిదారి వ్యవస్థవైపు నడిపించడానికి ప్రయత్నిస్తున్నప్పుడు పార్టీని మౌళికంగా మార్చడానికికూడ పోరాడాలని చెబుతోంది. తత్ఫలితంగా పార్టీకి, ప్రజలకు **mass-contact** అనేది కొనసాగుతుంది.

ఇటీవలికాలంలో సోషలిస్టు డెమోక్రసీమీద విస్తృతంగా జరుగుతున్న చర్చల్లో చెబుతున్నట్లు సోషలిస్టు ప్రజాస్వామ్యం అనేది పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉన్నట్లు విమర్శించడానికి, నచ్చినట్లు బతకడానికి ఉండే స్వేచ్ఛకాదు. ఉత్పత్తిశక్తులమీద ఆధిపత్యం కార్మికవర్గానికి ఏర్పడి ఉత్పత్తి క్రమంలో భాగస్వామ్యం తీసుకునే అధికారం, స్వేచ్ఛ కలిగివుండడమే సోషలిస్టు డెమాక్రసీ అని, అటువంటి స్వేచ్ఛ సోషలిస్టు దశలో ప్రతి కార్మికునికి ఉంటుందని మొట్టమొదటిసారిగా గుర్తించింది, ఉండాలని సూచించిందికూడ ఈ సాంస్కృతిక విప్లవమే. ఈ శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం అనేది సోషలిస్టు సమాజాల్లో వచ్చేటటువంటి అనేక సమస్యల పరిష్కారానికి ఒక మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథాన్ని ఇచ్చింది. ఈ సాంస్కృతిక విప్లవం అనేక అంశాల్ని వెలుగులోకి తెచ్చింది. సైన్సు, టెక్నాలజీ, ఎకనమిక్ డెవలప్‌మెంట్, కాపిటల్ మొబిలైజేషన్, వర్కర్స్ పార్టీసిపేషన్ ఇలా మనం ఏ అంశాన్ని తీసుకున్నా 1965కు ముందు వచ్చిన గ్రంథాలకు, 1966 తర్వాత వచ్చిన గ్రంథాలకు మౌళికమైన తేడా కనబడుతుంది. అయితే ఇన్ని జరిగినా ఈ సాంస్కృతిక విప్లవ ఫలితాల్ని ఎలా **consolidate** చేసుకోవాలి, సోషలిస్టు ఆర్గనైజేషన్స్ ఎలా ఉంటాయి అనే **alternative forms** రూపొందడం జరగలేదు. ఇది ఒక్కసారికే సాధ్యమవుతుందని చెప్పడానికి వీలులేదు. అనేకసార్లు అనేక విడతలుగా, అనేక ప్రయత్నాలు జరిగినప్పుడు మాత్రమే ఒక రూపాన్ని సంతరించుకోవడం సాధ్యమవుతుంది కాబట్టి ఇంకా ప్రయత్నాలు జరగాల్సి ఉంది. ఈ ప్రయత్నాల్లో భాగంగానే **Greatly Forward Movement**ను రూపొందించుకోవడం జరిగింది. దీని వెనకాల ఉండే దృక్పథాన్నామోదింపజేసుకోవడానికి పార్టీలో అంతరంగికంగా ఐదేళ్ళు పోరాటం చేయవలసివచ్చింది

మరో మూడేళ్ళు సాంస్కృతిక విప్లవం చెలరేగింది. ఇంత సుదీర్ఘంగా ఒక పంథాకోసం ప్రయత్నం జరిగినప్పటికీ ఈ అనుభవాల్ని consolidate చేసు కొని ప్రత్యామ్నాయ రూపాల్ని ఏర్పరచడానికి వీలుకాలేదు. అనేకమైన ఆటంకాల్ని అధిగమించి దీన్ని సాధించడం అంత సులభమైందేమీ కాదు. ఏ విధంగా అయితే చైనాలో విప్లవం రాగానే సోవియట్ పంథాను అనుసరించారో అదేవిధంగా సాంస్కృతిక విప్లవం తర్వాత ఈ త్రీ-ఇన్-వన్ కమిటీలు వారికి తట్టాయి. ఈ త్రీ-ఇన్-వన్ కమిటీ అనేది ఒక విప్లవకరమైన అభివృద్ధే. కాదనడానికి వీల్లేదు. అయితే విప్లవకారుల్లో వచ్చిన చైతన్యాన్ని ఆధారంగా చేసుకొని ఇంకా ఏదయినా ఒక కొత్త వ్యవస్థను రూపొందించడానికి వీలు ఉండిందేమో అని ఒక అభిప్రాయం.

సాంస్కృతిక విప్లవం తర్వాత వచ్చిన పరిణామాల్ని మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథంతో స్పష్టంగా అంచనా వేసుకొని ఎక్కడైన లోపాలుంటే సరిదిద్దుకోవడానికి, ఏవిధంగానైతే GFMలో వచ్చిన నష్టాల్ని సమీక్షించి CRను నడపడానికి అవకాశం దక్కిందో, ఆవిధంగా చైనా కమ్యూనిస్టుపార్టీకి వీలుచిక్కలేదు. లిన్‌పియావోకు వ్యతిరేకంగా ఘర్షణ, CRకు ముందు, తర్వాత పరిణామాల గురించి రాయాలనుకుంటున్న మావో చనిపోవడం, చూ'ఏ చనిపో వడం జరిగింతర్వాత ఎవరికి వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమాలు చేశారో వాళ్ళం దర్నీ, efficiency పేరుతో, పార్టీని బలంగా నిర్మించాలనే పేరుతో, కార్మిక వర్గ దృక్పథాన్ని బలంగా కొనసాగించాలనే పేరుతో వాళ్ళందర్నీ మళ్ళీ కాపి టలిస్టు రూడర్స్ అందలా లెక్కించారు. ఇందులో మళ్ళీ వరదలా అధికారం లోకి వచ్చిన వాళ్ళలో తెంగ్‌సియావో పింగ్ కూడ ఉన్నాడు. GFM విఫలం అయింతర్వాత ఇతనేం చెప్పాడంటే 'Three Freedoms one contact' అంటే 1) Private plots ఉండాలి, 2) Private Enterprise profit baseగా నడవాలి, 3) వర్కర్స్‌కు Socialistic spiritనిబట్టి కాక పనినిబట్టి వేతనాలివ్వాలి - అయితే ప్రభుత్వం చెప్పిన పద్ధతిలో ఉత్పత్తిచేయాలి. పిల్లి నల్లదయితేనేమి, ఎర్రదయితేనేమి ఎలుకను బడితే చాలుననికూడ చెప్పాడు. ఈ రకమైన అభిప్రాయాలు కలిగిన తెంగ్‌కు వ్యతిరేకంగా మళ్ళీ ప్రచారం చెలరేగడంతో అతన్ని అధికారంనుండి తొలగించాల్సివచ్చింది. అధికారంలోకి వచ్చింతర్వాత ఈ elite group తమ రాజకీయ దృక్పథాన్ని అనుసరించి ఆర్థికపంథాను రూపొందించుకొని, ఆ ఆర్థికపంథా, ఆ రాజకీయదృక్పథం అవ సరం, ఇంతకు మించిన దృక్పథం ఇంకొకటి లేదు అని ఒకదానికొకటి సపు

# నేటి చైనా పరిణామాలు

—హరగోపాల్

ఈనాడు విరసం సున్నితమైన మానవ విలువల్ని పట్టించుకోవడంతో పాటు చైనా పరిణామాలు విశ్లేషించే బాధ్యతకూడ నెత్తినవేసుకుంది. భారత దేశంలో కమ్యూనిష్టుపార్టీలు ప్రజల బాధ్యతలు నెత్తిన వేసుకోవడంతోపాటు చాల బాధ్యతలు - ప్రపంచంలో జరిగే విషయాలుకూడ నెత్తినవేసుకొని మోస్తూ మోస్తూ అక్కడేవైన మార్పులు జరిగితే వాటిని ఎలా విదిలించుకొని ముందుకు పోవాలా అని ఆలోచిస్తుంటాయి. చైనా గురించికాని, లేదా గర్జించు రష్యా, గాండ్రించు రష్యా అనికాని లేదా తూర్పు యూరపు దేశాలగురించికాని మనం మాట్లాడుకున్నప్పుడు వాళ్ళగురించి, ఆ సమాజాల అభివృద్ధి గురించి, మార్పుల గురించి చాలా విషయాలు మాట్లాడుకుంటున్నాం. ఆ దేశాలు చాలా ముందుకు

---

ర్థించుకుంటూ ముందుకువచ్చింది. ఆ తర్వాత డెంగ్ మళ్ళీ అధికారంలోకి వచ్చీరాగానే CR దృక్పథాన్నే కొట్టిపారేస్తి, ఎక్కడా దానికి సంబంధించిన **positive** అంశాలు వెలుగులోకి రానీయకుండా నెగటివ్‌గా ప్రచారం చేయడం జరిగింది.

ఈ నేపథ్యంలో CR ద్వారా మూడో ప్రపంచ దేశాల్లోని విప్లవాలు నేర్చుకోవలసిన విషయాలు - పార్టీకి, ప్రజలకు సంబంధించి CRలో వచ్చిన దృక్పథాన్ని కొనసాగించడం చాలా అవసరం. అట్లాగే పునాదిని మార్చితే ఉపరితలం దానంతటదే మారుతుందనే యాంత్రిక దృక్పథాన్ని నిర్మూలించి ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఆటంకంగా ఉండే ఉపరితలాంశాలకు వ్యతిరేకంగా కూడా పోరాడాలనే CR దృక్పథంతో ఈ ఉద్యమాలు మరింత బలపడడానికి విప్లవీకరించి ముందుకు తీసుకుపోవడానికి ఈ అనుభవం ఉపయోగపడుతుందని చెప్పవచ్చు. అంటే పోరాటం చేస్తున్న వర్గాలు, వాటి పోరాటానికి దోహదం చేస్తున్న పరిస్థితులు, వాళ్ళ ప్రాపంచిక దృక్పథం విస్తృతంగా వెలుగులోకి రావడానికి, అది మరింతగా బలపడి మొత్తంగా విప్లవం విజయవంతంగా ముందుకు కొనసాగించడానికి సమాజంలో ఆధిపత్యం వహిస్తున్న పాలకవర్గ భావ జాలానికి వ్యతిరేకంగా పోరాడటానికి సాంస్కృతిక ఉద్యమానికి ఒక ప్రధానమైన పాత్ర ఉంటుందని మనం అర్థంచేసుకోవచ్చు.

వెళ్ళాయని మనం అనుకుంటున్నాం. అయితే ఈనాడు జరుగుతున్న సంక్షోభాల దృష్ట్యా, పరిణామాల దృష్ట్యా, వైరుధ్యాల దృష్ట్యా ప్రజలందరూ మనల్ని అడుగుతున్నారు. మీ చైనాలో ఏమయిందని? క్యాబినెట్ సబ్ కమిటీ కూడ చైనా, రష్యా, తూ. యూ. దేశాలు మారిపోతుంటే ఈదేశంలో ఇంకా విప్లవం ఏమిటయ్యా అని అంటున్నది. ఆ దేశాల్లో ఉద్యమాలు కొత్తసంక్షోభంలో పడ్డాయి కదా, కొంతవైఫల్యం చెందాయికదా ఇంక భారత దేశంలో విప్లవాలు, ఉద్యమాలు ఎందుకని ప్రశ్నిస్తున్నారు. అంటే అక్కడ విఫలమైతే ఇక్కడ విఫలమవుతాయని, ఆ దేశాల్లో సమస్యలు పరిష్కారం కాకుంటే ఈ దేశంలో పరిష్కారం కావని, కాబట్టి ఈ దేశంలోని సమస్యల పరిష్కారం గురించి అడగొద్దని వాళ్ళ ఉద్దేశ్యం. అందుకే నిజానికి చైనాలో ఏంజరిగిందని, రష్యాలో ఏం జరిగిందని, తూ. యూ. దేశాల్లో ఏంజరిగిందని అనే విషయాల్ని తప్పకుండ ఆలోచించి అర్థంచేసుకోవాలి. అంతకన్నా ఈ దేశంలోని దోపిడీ, ఆదిలాబాదు గిరిజనుడి పరిస్థితి, విపరీతమైన పేదరికం, నిరుద్యోగం గురించి మనం పట్టించుకోవాలి. ఎందుకంటే మనం సమస్యలో ఉన్నాం కాబట్టి. అక్కడ సంక్షోభం ఉందికాబట్టి ఇక్కడ ఉద్యమాలు ఎందుకనే నినాదం వస్తుంది కాబట్టి మనం ఆ దేశాలగురించి చర్చించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. అయితే మన దేశంలో అంతర్జాతీయ సోషలిస్టు ప్రయోగాలు, ఆ ఫలితాలు, వాటిలోంచివచ్చిన ఆ అనుభవాల వెలుగులో కానివ్వండి, వాటి నీడలో కానివ్వండి మన ఉద్యమాలు, ప్రజల సమస్యల పరిష్కారానికి ఇక్కడ జరుగుతున్న పోరాటాలకి, దాని లోంచి పాఠాలు నేర్చుకొని ఈ ఉద్యమాలు మరింత Sharp కావడం కాని మరింత Mature కావటంకాని జరగాలి.

చైనాలో సాంస్కృతిక విప్లవం గురించి, దానికుండేటటువంటి ఆర్థికపరమైన, సాంస్కృతిక పరమైన, రాజకీయ పరమైన కారణాల్ని పునాదిని, చారిత్రక నేపథ్యంలో ఇంతకుముందే తెలుసుకున్నాం. ఈ సందర్భంలో మనం గుర్తించాల్సిన విషయం ఏమిటంటే ఒక దేశంలో ఒక విప్లవం లేదా ఒక ఉద్యమం వచ్చింతర్వాత, ఆ విప్లవం రాజ్యాధికారం చేజిక్కించుకున్న తర్వాత విప్లవం సఫలం అయిందని కాని, గమ్యం చేరిందని కాని అనుకునే అవగాహన చాలా పొరపాటు ఒక చారిత్రక పరిణామదశలో ఒక దేశంలోని ప్రజలు ఒక ఉద్యమాన్ని నిర్మించి, ఆ ఉద్యమం ద్వారా రాజ్యాధికారం సాధించుకున్న తర్వాత లేదా విప్లవం ఆ దేశంలోని పాలకవర్గాలని ఓడించిన తర్వాత విప్లవం తన గమ్యాన్ని చేరిందా, లేదా విప్లవం ఒక మైలురాయిని దాటి ముందుకు సాగి

పోతుందా? అని మనం ఆలోచించాలి. ఒక సుదీర్ఘమైనటువంటి ప్రయాణంలో ప్రజలు ప్రయాణంచేస్తున్నప్పుడు ఒక్కొక్క మైలురాయిని దాటి ఒక నూతన ప్రపంచాన్ని చేరుకుంటున్నప్పుడు, ఒక గమ్యాన్ని చేరారని కాకుండా ఆ గమ్యాన్ని చేరే దిశలో ఒక్కొక్క మైలురాయిని దాటుతున్నారని అనుకుంటే బహుశా ఈనాడు ప్రపంచవ్యాపితంగా సోషలిస్టు దేశాల్లో జరుగుతున్న ఈ పరిణామాలేవైతేవున్నాయో ఇవన్నీకూడ ప్రజలు లేదా సమాజాలు ముందుకు పోవడానికి జరుగుతున్న ప్రయత్నంలో భాగంగా చూస్తే అప్పుడు మనకు నిరాశ నిస్పృహ కలగవు. ఎందుకంటె మనుషుల మీద, మానవ సమాజం మీద, శ్రామికుడిమీద, శ్రమమీద విశ్వాసం ఉన్నవాడు ఈ సుదీర్ఘమైన ప్రయాణంలో ప్రజలు ఎన్నెన్నో అవరోధాలు దాటవలసి ఉంటుందని, నూతన సమాజ ఆవిర్భావం అనేది ఒక్క రోజులోనో లేదా ఒక్క సంవత్సరంలోనో, ఒక్క విప్లవం ద్వారానో జరగవని మనం గుర్తించాలి.

ఒకవేళ మనజీవిత కాలంలోనే విప్లవం విజయం సాధించి రాజ్య యంత్రాంగం చేజిక్కించుకుంటే, ఆ తర్వాతికూడా విరసం, పౌరహక్కుల సంఘం కొనసాగవలసిందేనని ఈ అనుభవం ద్వారా తెలుస్తుంది. ఈ సంఘాలన్నీ వదిలేసి సమాజాన్ని ఎవరో చూసుకుంటారనీ, రాజ్యాంగ యంత్రమే మొత్తం సమాజాన్ని చూసుకుంటుందని, ఒక రాజకీయపార్టీ చూసుకుంటుందని అప్పజెప్పేసి ఊరుకోకుండా ఈ సాంస్కృతిక సంఘాలు, పౌరహక్కుల సంఘాలు ప్రజల తరపున మాట్లాడటానికి, నిరంతరం కొనసాగవలసిన అవసరాన్ని ఇవెప్పుడూ జాగ్రత్తగా వుండవలసిన అవసరాన్ని, ప్రజల సమస్యల పరిష్కారంలో ఎప్పుడూ భాగం పంచుకోవలసిన అవసరాన్ని విరసం అప్పుడుకూడ నెత్తిన వేసుకోవలసిందే. ఒక వుద్యమం విజయవంతం అయింతర్వాత అన్నీ దానికి వదిలేసి పౌరహక్కులసంఘాలు ఊరికే వుండాలనికాకుండా నిరంతరంగా ప్రజలు సమాజనిర్మాణంలో భాగస్వాములు కావాలనే ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా తీసుకోవలసి వుంటుందని అర్థంచేసుకోవాలి. అయితే సోషలిస్టు దేశాల్లో ముఖ్యంగా ఇటీవల జరిగిన పరిణామాలదృష్ట్యా సోషలిస్టుస్వాతంత్ర్యం అనేది చర్చకువచ్చింది. సోషలిస్టుస్వేచ్ఛ అనేది ఆదేశాల్లోని శ్రామికులు తమ కనుకూలమైన వ్యవస్థను నిర్మించుకునే స్వేచ్ఛయే సోషలిస్టు స్వాతంత్ర్యం. అంటే తనకక్కవలసిన ఒక వ్యవస్థ నిర్మాణానికి, ఆ వ్యవస్థ నిర్మాణంలో భాగస్వామ్యాన్ని లేదా ప్రజలు ఆ వ్యవస్థను నిర్మించుకునే హక్కు నిజమైనస్వేచ్ఛ.

స్వేచ్ఛ అంటే కేవలం ఒక **Liberal sense** లో నిర్వచించకుండ స్వేచ్ఛ అంటే ఒక విస్తృతమైన అర్థంలో మాట్లాడే స్వేచ్ఛ, లేదా స్వతంత్రంగా ప్రభుత్వాన్ని విమర్శించే స్వేచ్ఛ అనికాకుండా ప్రజలు తమ జీవనవిధానం మీద తమ సంపూర్ణమైన అధికారాన్ని కలిగివుండి తమకు కావలసిన ఒక ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థను నిర్మాణం చేసుకునేటటువంటి స్వాతంత్ర్యమే నిజమైన స్వాతంత్ర్యమని మనం నిర్వచించుకుంటే సోషలిస్టు స్వాతంత్ర్యం లిబరల్ బూర్జువా స్వాతంత్ర్యం కంటె ఎలాభిన్నమైందో మనకు అర్థం అవుతుంది. అందుకే చైనాలో వచ్చినటువంటి పరిణామాలనీ, చైనాలోవున్న మొత్తం **Controversy**నీ, విద్యార్థులు అడిగిన స్వేచ్ఛను, వాళ్ళుపెట్టిన డిమాండ్లని చర్చించే సందర్భంగా అదే నిజమైన స్వేచ్ఛనా అని ఈనాడు చాల చర్జనబర్జన జరుగుతోంది. దీన్ని మనం అంచనా వేయాలనుకున్నప్పుడు విద్యార్థులపై తియాన్మేన్ స్క్వేర్‌లో ప్రభుత్వయంత్రాంగం జరిపిన దౌర్జన్యం, అంతమంది విద్యార్థుల్ని నిర్దాక్షిణ్యంగా చంపివేసిన సంఘటనలద్వారా మనం చైనా గురించి చాలా ఆసక్తితో, ఆ **experiment**ను చూస్తున్న ప్రజలకూ, మనకి కలిగిన **response**ను, దానికి ఎలా **react** అయ్యాము, ఒక సోషలిస్టుదేశంలో రాజ్యం తన యంత్రాంగంద్వారా బలప్రయోగాన్ని, హింసను ప్రయోగించి విద్యార్థులు నిర్మిస్తున్న ఒక ఉద్యమాన్ని అణచివేయడమనేదాన్ని ఎలా అర్థంచేసుకోవాలి, ఎలా విశ్లేషించాలి, ఇలా ఎందుకు జరిగింది? అనే విషయాల్ని మనం ఈ సందర్భంగా తప్పకుండా ఆలోచించుకోవాలి, చర్చించుకోవాలి.

**Capitalist roaders** గురించి, పెట్టుబడిదారీ లక్షణాలు చైనావ్యవస్థలో రావడంగురించి, తర్వాత దానిపరిణామాలు ఎలావుంటాయో మనం ఇంతకుముందే తెలుసుకున్నాం. అయితే చైనాలో విప్లవం రావడంకాని, లేదా విప్లవ నిర్మాణంలో కాని, లేదా విప్లవం వచ్చింతర్వాత కాని **United Front** అనే **Concept** లోనేవున్న ఒకరకమైన వైరుధ్యం అనేది ఆ సమాజంలో వుందని మనం గనుక అంగీకరిస్తే మావో చారిత్రికంగా అంటే ఆనాటి అంతర్జాతీయ సందర్భాన్ని దృష్టిలో పెట్టుకొని చైనాలో ఆ సమాజంలో వున్న భిన్న వర్గాల ప్రజల్లో ఆనాడు ఎన్ని వర్గాలు తనతోవస్తే అన్ని వర్గాల్ని తనతో తీసికెళ్ళ దానికి ప్రయత్నం చేశాడు. అలా చేశాడుగనుకనే ఆనాటి చైనా ఒక వర్గసమాజమే అనే స్పష్టమైన అవగాహన మావోకు ఉండింది. కనుకనే ఆయన చైనాలో విప్లవం వచ్చింతర్వాత, రాజ్యాధికారం ప్రజలకు వచ్చింతర్వాత అంటే ఈ **united front** కు వచ్చింతర్వాత సమాజంలో వుండే విభిన్నవర్గాలమధ్య

వుండే వైరుధ్యాల్ని పరిష్కరించడానికి, నిజమైన సోషలిజాన్ని నిర్మించడానికి, సమాజాన్ని కమ్యూనిజం వైపు నడిపించడానికి మావో చేసిన ప్రయత్నమే Cultural revolution.

Cultural revolution చైనాలో రావడానికి ప్రధానకారణం ఆ సమాజంలో ఇంకా వర్గాలున్నాయనే. వర్గాలున్నంత కాలం అసమానతలుంటాయని, అసమానతలున్నంత కాలం సమాజంలో నిజమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండవని, ప్రజలందరూ సమానంగా ఉండాలంటే ఈ వర్గాలన్నీపోయి స్వేచ్ఛగా జీవించే సమాజ ఆవిర్భావం జరగాలనే అవగాహన మావోకు వుందికాబట్టే సాంస్కృతిక విప్లవం ద్వారా Heirarchyని, dominanceను, అథారిటీని అన్నింటిని ఛాలెంజ్ చేయాలని ఆయన ప్రజలకు ఒక పిలుపునిచ్చాడు. Cultural revolution రెండురకాలుగా గొప్ప experiment. ఒకటి సమాజంలోమార్పు రావడానికని ఆసమాజంలో ప్రజల సమానత్వానికి వ్యతిరేకంగావుండే విలువల్ని ప్రజల్ని సమీకరించి ప్రశ్నించే ప్రయత్నం చేయడం. రెండవది రాజ్య యంత్రాంగంలో భాగమైన మావో ప్రజలందరికి ఈ పిలుపునిచ్చి ఒక ఉద్యమనిర్మాణాన్ని చేసే ప్రయత్నం. రాజ్యయంత్రాంగం ఒకసారి అధికారంలోకి వచ్చింతర్వాత దాని స్వభావం ఎలావుంటుందంటే అది సమాజంలోని ప్రజల్ని ఉద్యమాల నిర్మాణానికి ఎప్పుడూ ప్రోత్సహించదు. మావో ఆగొప్ప experiment చేశాడు. ఆయన completeగా State లో వుంటూ Stateకి వ్యతిరేకంగా, తాను దేశంలో అధికారంలోవుండి తాను నాయకత్వం వహిస్తున్న పార్టీనాయకుడుగాకూడ ఉన్నప్పటికీ నిజమైన ప్రజాస్వామ్య నిర్మాణానికని, ఈ ఉద్యమం అనివార్యమని ఆయన అవగాహన చేసుకున్నాడు కాబట్టే ప్రజలు సమస్యలు పరిష్కరించు కోవడమన్నది ఇలాంటి వుద్యమరూపంలోనే అనేవిషయాన్ని మావో Cultural revolution ద్వారా చైనాకు, చైనా ద్వారా ప్రపంచానికి తానొక Important message ఇచ్చాడు.

వర్గాలమధ్య సంఘర్షణ మూడు ప్రక్రియలమీద ఆధారడి వుంటుంది. అంటే ఈ United Front Concept అనేది అంటే multiclass aliance అనేవైదైతే వుందో - multiclass aliance అంటేనే దాంట్లోకొన్ని implications వుంటాయి. మనం అర్థంచేసుకోవలసిన కొన్ని లక్షణాలుంటాయి.-దీంట్లో సంఘర్షణ వుంటుంది. ఒకటి - వర్గం అంటేనే దానికుండే లక్షణం తనప్రయోజనాల్ని తాను కాపాడుకోవడం. ఇది ఏ వర్గానికైనా సహజంగావుండే లక్షణం.

వర్గం తన ప్రయోజనాల్ని కాపాడుకోవడానికి ఎలాంటి పద్ధతుల్ని అవలంబిస్తుంది ఎలాంటి అధికారాన్ని అది ఎంచుకుంటుంది, ఆ అధికారానికి వుపయోగించే పద్ధతులు ఎలావుంటాయనేది. శ్రమజీవుల యొక్క వర్గచైతన్యం ఏ స్థాయిలో సమాజంలో వుందనేది రెండవది. శ్రమజీవుల యొక్క రాజకీయచైతన్యాన్ని బట్టే ఈ వర్గాలమధ్య సంబంధం నిర్ణయింపబడుతుంది కాబట్టి ప్రజలను ముందుకు నడిపించే పార్టీ ప్రజలచైతన్యాన్ని స్ఫూర్తిగా తీసుకొని ప్రజల్నిఎటువైపు నడిపిస్తుంధనేది మూడవ అంశం. వర్గాలు వాటి ప్రయోజనాలు కాపాడుకొనడానికి ఎన్నుకున్న పద్ధతులు, శ్రమజీవుల చైతన్యస్థాయి, పార్టీ ఏ పాత్రనిర్వహిస్తుందన్న ఈ మూడు ప్రక్రియలపై ఆధారపడి సంఘర్షణ కొనసాగుతుంది.

ఈనాడు ఇటీవల చైనాలో జరిగిన సంఘటనలవల్ల మనం తప్పకుండ అర్థంచేసుకోవలసిందేమిటంటే విప్లవం తర్వాత అధికారంలోకి వచ్చిన భిన్న వర్గాలు, కాపిటలిస్టు రూడర్స్ లేదా అధికారంవల్ల సంభవించిన classesవల్ల పార్టీలో వర్గాలుగా, వైరుధ్యాలుగా అంతర్గత చర్చల్లోను, చైనా సమాజంలోను అన్నింట్లోను కనిపిస్తుంది. అంటే ఈ వర్గాలమధ్య జరిగిన సంఘర్షణలో తాత్కాలికంగా పెట్టుబడిదారి శక్తులదే పైచేయి అయిందనేది మనం గుర్తించాలి. దీన్ని అంగీకరించినపుడు చైనా సమాజంలో వచ్చిన మావో చెప్పినట్లు ten contradictionsలో కూడ rural - urban, mental - physical labour, Heavy industries - Small industries, టెక్నీషియన్స్-వర్కర్స్-మేనేజర్స్, వ్యవసాయరంగం-పారిశ్రామికీకరణ - ఇవన్నీకూడ పెట్టుబడిదారి సమాజంలో ఉండేటటువంటి వైరుధ్యాలే. ఈ వైరుధ్యాలు అట్టడుగున ఉన్న ప్రజల తరపున పరిష్కరింపబడితే సమాజం ముందుకుపోతుంది. అయితే ఈ వైరుధ్య పరిష్కారంలో ఉన్నతవర్గానికి సంబంధించినవాడు, పెట్టుబడిదారీ వర్గానికి సంబంధించినవాడు, అధికారంలో ఉన్నటువంటివాడు మొత్తం తనకున్న హంగులన్నీ ఉపయోగించి తన ప్రయోజనాల్ని కాపాడుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. అందుకే మావో తన నాయకత్వంలో పార్టీలో ఈ వైరుధ్యాలను పరిష్కరించడంకోసం cultural revolution ద్వారా ప్రజలదగ్గరికి పోవడానికి ప్రయత్నం చేశాడు. కాని కొన్ని అవాంఛనీయ, అతివాద పరిణామాలు ఏవి వచ్చినప్పటికినీ తాత్కాలికంగా నయినా సాంస్కృతిక విప్లవ విరమణ అంటే ఆనాడు అధికారంలో ఉన్న వర్గాలు తమ అధికారం నిలబెట్టుకోవశంలో విజయం సాధించినట్లేనని మనం అంగీకరించాలి.

Cultural revolutionమీద విమర్శల్లో ముఖ్యంగా దేశంలో ఉత్పత్తి పడిపోతుందనే విమర్శకూడా చాలా పెద్దయెత్తున ముందుకొచ్చింది. చార్లెస్ బెతల్‌హాం 'Industrial Organisation & Cultural Revolution' అనే తన పుస్తకంలో ఒక మాట రాశాడు. మావో సాంస్కృతిక విప్లవం సందర్భంగా ఏం చెప్పాడంటే శ్రమజీవి ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తున్నప్పుడు – ఆ పనిద్వారా అతను ఎంత సంతృప్తిని పొందుతున్నాడు, ఎంత సంతోషం అనుభవిస్తున్నాడు, ఆ పనిద్వారా అతని వ్యక్తిత్వం లేదా స్వభావం వికాసం చెందడానికి ఎంతగా ఉపయోగపడుతోంది, పని ఏదో భౌతిక ఉత్పత్తికి కారణం కాకుండా పని అనేది మానవుడు సృజనాత్మకంగా తనయొక్క natureను, personalityని express చేయడానికి ఒక పద్ధతి అన్నాడు. ఈ పద్ధతిలో వర్కర్ తాను పనిచేస్తున్నప్పుడు సంతృప్తిని, ఆనందాన్ని పొందినప్పుడు భౌతిక ఉత్పత్తి పడిపోయినా పరవాలేదు అన్నాడు. ఎందుకంటే భౌతిక ఉత్పత్తికూడ మానవ సంతృప్తికొరకే అని అనుకున్నప్పుడు ఆ భౌతిక ఉత్పత్తి చేస్తున్న దశలో లేదా ప్రక్రియలో మనిషి తను సృజనాత్మకంగా ఆనందాన్ని పొందినప్పుడు భౌతిక ఉత్పత్తికూడ సెకండరీ కావచ్చు. అంటే పని అనేది కేవలం భౌతిక ఉత్పత్తికే సంబంధించిన విషయంకాదు, మానవుడి సంతోషానికి, సంతృప్తికి, ఆనందానికి ఒక మార్గం అన్నాడు. ఈ రెండింటికీ యూనిటీ కలిగినపుడు ఉత్పత్తి, మానవ సంతృప్తి ఉన్నతమైన దశకు చేరుకుంటాయి. అప్పుడు మానవుడు తన జీవితానికి ఒక మహోన్నత అర్థాన్ని చూస్తాడు. ఈ రెండింటి మధ్య ఒకవేళ వైరుధ్యం ఉన్నప్పుడు, మనిషి తాను చేస్తున్న పనిలో సంతోషాన్ని, ఆనందాన్ని పొందినప్పుడు, అతని ఆనందానికి సంతృప్తికి అనుగుణంగా ఆ పనిని ఎలా మార్చాలి అన్నదికూడా సాంస్కృతిక విప్లవం ముందుకు తీసుకొచ్చింది. కాని ఎవరయితే భౌతిక ఉత్పత్తే అసలైన అభివృద్ధి అని అనుకుంటున్నారో వాళ్ళుమాత్రం సాంస్కృతిక విప్లవంద్వారా ఉత్పత్తి పడిపోయింది, వర్కర్స్ పనిచేయడం మానేశారు, దేశంలో సంక్షోభం వచ్చేసింది, anarchism వచ్చేసింది అనే వాదనల్ని ముందుకు తీసుకొచ్చారు.

సాంస్కృతిక విప్లవాన్ని ఆపడంవల్ల కొత్తగా ఏర్పడిన వర్గాలు అంటే చైనాలో 1948-49 తర్వాత వచ్చినవి లేదా అంతకుముందున్న వర్గాలు ఆనాటి ఉత్పత్తి విధానంలోంచి వచ్చిన వర్గాలు – ప్రొఫెషనల్స్, బ్యూరాక్రాట్స్ లేదా పార్టీ బ్యూరోక్రాట్స్, డాక్టర్లు, ఇంజనీర్లు, యూనివర్సిటీ ప్రొఫెసర్లు, టెక్నీషియన్లు – కొన్ని కొత్తవర్గాల చేతుల్లో రాజ్యయంత్రాంగం

ఉండిపోయింది. దీనితో రాజ్య యంత్రాంగం ఎలా ఉండాలి? సోషలిస్టు దేశంలో రాజ్యం ఎలా ఉండాలి? దావి పాత్ర వైఖరి ఏమిటి? అనే ప్రశ్నలు ఈనాడు బలంగా మనముందుకు వచ్చాయి. అంటే విప్లవం తర్వాత state అనేది ప్రజల state అవుతుందని, అది దేశంలో ఇంకా మిగిలివున్న వర్గాలను eliminate చేసేసి gradualగా equality సాధిస్తుందని, అంటే ప్రజల తరపున తన పాత్రను నిర్వహిస్తుందని సోషలిస్టు థియరీ తెలిసినవాళ్ళు, సోషలిస్టు వ్యవస్థ ప్రజల సమస్యలు పరిష్కరిస్తుందని అనుకునేవాళ్ళందరి అవగాహన. కాని ఇప్పుడు జరిగిన అనుభవంవల్ల తెలుస్తున్నదేమిటంటే రాజ్యయంత్రాంగం, దాని స్వభావం అధికారంలో లేదా బలవత్తరంగా ఉన్న వర్గాలకే అది ఎక్కువ ఉపయోగపడుతుందని శ్రామికవర్గానికి దాన్ని పూర్తిగా ఉపయోగించుకునే శక్తి ఇంకా రాలేదని తెలుస్తుంది. చైనాలో ఈ కొత్త వర్గాలు సాంస్కృతిక విప్లవం తర్వాత ఉత్పత్తిని పెంచాలనే స్లోగన్‌తో Privatisation చేసింతర్వాత Private plots, Market ఎప్పుడయితే వచ్చాయో, in-equalities, in-income ఎప్పుడయితే introduce చేశారో సంఘర్షణలు తలెత్తాయి.

జియాంగ్‌జి అనే నగరంలో మేనేజర్ నియంతృత్వానికి విసుగుచెందిన కార్మికులు ఆ ఫ్యాక్టరీని బద్దలుకొట్టారు. మేనేజిమెంటుకు, అథారిటీ స్ట్రక్చర్‌కు వ్యతిరేకంగా షియాంగ్ అనే పట్టణంలో ఒక కార్మికుడు ఫ్యాక్టరీ ఓనర్‌ను వాడి అథారిటీకి, హింసకు తట్టుకోలేక ఓనర్‌ను చంపేశాడు. అతన్ని చంపినందుకు ఆ వర్కర్‌ని ఉరితీస్తే షియాంగ్‌లోని శ్రామిక జనమంతా ఆ కార్మికుడిని తమ folk heroగా గౌరవించడం జరిగింది. అంటే వర్కర్స్ ఈ authority structureను, heirarical structureను భిన్న ప్రాంతాల్లో భిన్న రకాలుగా resist చేస్తూనే ఉన్నారని ఈ ఉదంతాలద్వారా మనకు తెలుస్తుంది. అంటే వాళ్ళేమి sub-servantగా లేరు. ఒక విప్లవ అనుభవాన్ని కలిగిన వర్కింగ్ క్లాస్ తమమీద జరుగుతున్న నియంతృత్వాన్ని, అధికారాన్ని అంత సులభంగా ఒప్పుకోరు కనకనే వర్కర్స్ ఫ్యాక్టరీల్లో కానివ్వండి, అడ్మినిస్ట్రేషన్‌లో కానివ్వండి resistance చేస్తూనే ఉన్నారు. దీన్ని మనం సాంస్కృతిక విప్లవం యొక్క కొనసాగింపుగా చూడొచ్చు. అది individual అయిపోయుండొచ్చు diffuse అయిపోయుండొచ్చు కాని resistance కొనసాగుతూనే ఉంది. Private plots వచ్చాయి గనుక గ్రామ ప్రాంతాల్లో ఒక new class - వ్యవసాయరంగంలోంచి వచ్చిన ధనిక రైతాంగం, ఫ్యాక్టరీ ఓనరు, ప్రొఫెష

నల్ క్లాస్, పార్టీ - బ్యూరాక్రసీ ఇవన్నీ చైనాలో రాజ్య యంత్రాంగాన్ని లేదా స్వభావాన్ని తియాన్మెన్ స్క్వేర్‌లో విద్యార్థుల్ని చంపడానికి వాడుతున్నారు.

అంటే what is the social base of authoritarianism ? అని ప్రశ్నించుకుంటే ఈ భిన్న వర్గాలే authoritarianismకు social baseగా తయారయ్యాయి. కాని ప్రజలు, శ్రామికులు, వ్యవసాయ రంగంలో పని చేస్తున్న కూలీలు ఏదో తమ ఖర్మ అని అనుకునే దశలో లేరు కాబట్టి ఈ resistance జరుగుతూనే ఉంది. అంతేకాక modernisation మరియు privatisation ద్వారా, ఉత్పత్తిని పెంచడంద్వారా సమాజంలో ఉన్న సమస్యలు పరిష్కరింపబడతాయి అని పార్టీ, రాజ్య యంత్రాగం దేన్నయితే ముందుకు తీసుకొచ్చిందో దానిద్వారా శ్రామికుడికి, కూలీకి, అట్టడుగున ఉన్న ప్రజలకి తమ జీవనస్థాయిలోగాని, ఆర్థికస్థాయిలోగాని మార్పు కనుపించనందువ చైనా సమాజంలో restlessness ఉన్నదని గుర్తించాలి. తమ జీవనం మారాలని, తాము సంతోషంగా, సంతృప్తిగా జీవించాలని కలలుగని ఒక విప్లవ అనుభవం ఉన్న సమాజంలో working classయొక్క జీవనస్థాయి పడిపోవడం, ద్రవ్యోల్బణం, ధరలు పెరగడాన్ని తట్టుకోలేక restlessness build up అవడం చైనాలో మొదలయింది. అంటే జీవనస్థాయి పడిపోవడం, జీవనం సంపూర్ణంగా మారకపోవడం అనేదికూడ చైనాలో సంక్షోభానికి ఒక ప్రధానమైన కారణం.

ఎప్పుడైతే శ్రామికుడు తనజీవనస్థాయి పడిపోవడం మూలంగా, తను చేసిన శ్రమకు తగినఫలితం తీసుకోలేనప్పుడు, శ్రమ ఒక ఉన్నతదశకు చేరుకోనప్పుడు శ్రామికుడు తన సంపూర్ణమైన శ్రమను ఉత్పత్తిలో వినియోగించడు అప్పుడు తప్పకుండ ఉత్పత్తిలో సంక్షోభం వస్తుంది. శ్రమే ఉత్పత్తికి మూలమనుకున్నప్పుడు శ్రామికుడు తన సంపూర్ణ శ్రమను ఉత్పత్తికి ధారపోయనప్పుడు తప్పకుండ ఉత్పత్తి పడిపోవడానికి కారణమవుతుంది. కాని శ్రామికుడు తన సంపూర్ణశ్రమను వినియోగించడానికి సిద్ధంగా లేడు అనే ఒక విశ్లేషణ యివ్వకుండా పెట్టుబడిదారి పద్ధతుల్ని ఇంకా ఎక్కువగా introduce చేసి ఉత్పత్తిని పెంచవచ్చు అనే ఒక అశాస్త్రీయ విశ్లేషణను ఈనాడు చైనాలో dominantగా ఉన్నవాళ్ళు చైనా ప్రజలకి చెప్పడం ప్రారంభించారు. చైనాలో ఉత్పత్తి పడిపోవడానికి ఆ దేశంలోవున్న శ్రామికుల్ని సమీకరించడంలోకాని, వారి శ్రమను వినియోగించుకోవడంలో కాని, వాళ్ళు పనిచేసే పద్ధతుల్లో కాని

మౌలికంగా అంటే Production relationsని సంపూర్ణంగా మార్చకపోవడం వల్ల కూడ ఉత్పత్తి పడిపోయిందని మనం అర్థంచేసుకోవాలి. కాబట్టి ఉత్పత్తి సంబంధాల్లో మార్పేరానప్పుడు heirarchy, authoritarianism, అసమానతలు గల ఆ సామాజిక నిర్మాణం ఆ సమాజంలోని ఉత్పత్తిని పెరగనీయకుండ, ఉత్పత్తి శక్తులు అభివృద్ధికాకుండ అడ్డుకుందని మనం గుర్తించాలి.

మానవసంబంధాలు లేదా ఉత్పత్తి సంబంధాలు మౌలికంగామార్చి భౌతిక ఉత్పత్తిని పెంచాలనే దిశగా కాకుండా ఉపరితలనిర్మాణాన్ని మార్చకుండ భౌతికఉత్పత్తిని మాత్రమే పెంచాలని చేసేప్రయత్నం పెట్టుబడిదారి విధానం వైపు పోతుందేకాని సోషలిజం వైపు, ఆ తర్వాత కమ్యూనిజం వైపు పోదనే శాస్త్రీయ వాస్తవికతను కూడ మనం ఈ సందర్భంగా గుర్తించాలి, చైనా అనుభవం ఇదే నిరూపిస్తోంది. ఉత్పత్తి సంబంధాల్ని revolutionarise చేయక పోవడంవల్ల, ఉత్పత్తి విధానాన్ని పెట్టుబడిదారి విధానంవైపు తీసికెళ్ళడానికి ఎప్పుడైతే ప్రయత్నాలు ఎక్కువయ్యాయో, పునాదిలో పెట్టుబడిదారి విధానాలు ఉపరితలంలో పెట్టుబడిదారి సంబంధాలకి దారితీయకపోతే పునాదికి వుపరితలానికి వైరుధ్యం, సంక్షోభం తప్పకుండ వస్తుంది. ఈ contradiction productionకి production relations ఎప్పుడైతే వస్తుందో ఉపరితలం తప్పకుండ readjust చేసుకోవలసి వస్తుంది. కనుకనే చైనా విద్యార్థులు సోషలిస్టు డిమాండ్ల కంటే కూడ Liberal democratic demands నే ఎక్కువగా పెట్టారు సోషలిజానికి, సమానత్వానికి, revolutionarised relations of productionకి సంబంధించిన వాటికంటె liberal democracy కి సంబంధించినవే ఎక్కువగా వున్న విద్యార్థులు పెట్టిన ఈ డిమాండ్లకు, డెంగ్, అతని అనుయాయులు తెచ్చిన సంస్కరణలకి నిజానికి ఎక్కడా వైరుధ్యంలేదు. వాళ్ళిద్దరికి ఒక autoganistic వైరుధ్యం అంటే ఆర్మీని తీసుకొచ్చి విద్యార్థుల్ని చంపాల్సినంతటి autoganistic contradiction లేదు. ఎప్పుడైతే పునాదిలో పెట్టుబడిదారి వ్యవస్థకు సంబంధించిన ప్రయత్నాలు చేశారో అందుకు తగినట్లుగా, ఉపరితలం readjustment - corresponding relations వుండాలి కాబట్టి వాటిని పెట్టమని, Liberate చేయమని అడిగారు. విద్యార్థులు డెంగ్ ప్రవేశపెట్టిన పంథాలోనే నడుస్తున్నప్పుడు విద్యార్థులకి, అధికారయంత్రాంగానికి ఎందుకింత వైరుధ్యం వచ్చింది, తియాన్మెన్ స్క్వేర్‌లో విద్యార్థుల్ని ఎందుకంత నిర్దాక్షిణ్యంగా చంపవలసి వచ్చిందనేదే యిక్కడ ప్రత్యేకంగా చర్చించాల్సింది. దీన్ని అర్థంచేసుకుంటే చైనా పరిణామాలు పూర్తిగా అర్థంకావచ్చు.

చైనా విద్యార్థులు పెట్టిన డిమాండ్లని పరిశీలిస్తే పెట్టుబడిదారి విధానంలో భౌతికఉత్పత్తిని పెంచాలనే ప్రయత్నానికి, ఉత్పత్తిసంబంధాలకు వచ్చినవైరుధ్యం వల్ల వచ్చినవి కొన్ని, ప్రజలకు సంబంధించిన డిమాండ్లు కొన్ని వున్నాయి. మొత్తం మీద విద్యార్థులు విద్యాలయాల్లోంచి బయటికొచ్చి ప్రభుత్వాన్ని ప్రశ్నించి మాకీ డిమాండ్లు కావాలి అని అడగడమనే సంఘటనేదైతే వుందో, దాంట్లో చైనా పాలకులు రెండు రకాలైన ప్రమాదాల్ని పసిగట్టారు. ఒకటి విద్యార్థులు అడుగుతున్న డిమాండ్ల కంటె వాళ్ళుదిగిన పద్ధతి - సమాజంలో కొత్త ఉద్యమాల నిర్మాణానికి ఊపిరిపోస్తుందని, ఈ ఉద్యమమే నిజంగా వారికి వ్యతిరేకమైంది కాకపోయినా ఈఉద్యమంలో వాళ్ళు చూసిందేమిటంటే ప్రజలు ఉవ్వెత్తున పాల్గొనడం, ఎలాగూ frustation, discontent వుంది కనుక ఇది ఇంకో ఉద్యమానికి, నిజమైన సాంస్కృతిక విప్లవం లాంటి ఉద్యమానికి దారి తీయవచ్చునని వారి భయం. రెండవది విద్యార్థులకు ప్రజలనుండి పెద్ద ఎత్తున మద్దతు లభించడం. లక్షలాది ప్రజలు, కార్మికులు, వ్యవసాయరంగంలో పని చేస్తున్నవాళ్ళు, యితర రంగాలలోనివాళ్ళు ఈ ఉద్యమానికి పెద్ద ఎత్తున సపోర్టు చేశారు. ప్రజలు మద్దతు తెలిపింది వాళ్ళు పెట్టిన డిమాండ్లకా లేదా వాళ్ళు నిరసన తెలిపినటువంటి పద్ధతికా అని ఆలోచిస్తే డిమాండ్లకంటె కూడ నిరసన పద్ధతికేనని చెప్పవచ్చు. విద్యార్థులు పెద్దఎత్తున ముందుకొచ్చి ప్రభుత్వాన్ని ప్రశ్నించడం, అంతే కాక ప్రజలకి సంబందించిన డిమాండ్సుకూడ కొన్ని వుండటంతో ప్రజలు కూడా పెద్దఎత్తున మద్దతు తెలిపారనుకోవచ్చు.

పెట్టుబడిదారి వ్యవస్థకు వుండే లక్షణాలన్నీ చైనాలోను, పాలకులకు కూడ వచ్చేశాయి. కొడుకులు, అళ్ళుళ్ళు అధికారంలోకి రావడం, మనదేశంలో మాదిరిగా, corruption లాంటివి అన్నిరకాల అనుభవాలు అక్కడే వచ్చేశాయి విద్యార్థులు corruption గురించి ప్రశ్నించారు. corruption గురించి ఎప్పుడైతే వాళ్ళు ప్రశ్నించారో వాళ్ళు రాజ్యాన్ని, రాజ్యయంత్రాంగంలో వుండేవాళ్ళ legitimacyనీ ప్రశ్నించినట్లయింది. ఎప్పుడైతే ప్రజలమద్దతుతో విద్యార్థులు అడుగుతున్న డిమాండ్లు గనుక సాధించారనుకోండి అక్కడితో ఆగదుసమస్య. ఎందుకంటె unemployment వుంది, discontent వుంది దీనిద్వారా ఇంకో డిమాండు ముందుకొస్తుంది. అంటే జియాంగ్‌లో కార్మికులు ఫ్యాక్టరీలను ధ్వంసం చేయడం కాని, షియాంగ్‌లో ఫ్యాక్టరీ ఓనర్‌ను కార్మికుడు చంపిన సంఘటనలద్వారా చైనాలో restlessness వుందని, వాళ్ళ చైతన్యస్థాయి ఆ దశలో ఉంది కాబట్టి, ఒక విప్లవాన్ని చూసిన సమాజం కనుక ఒక పెద్ద ఉద్యమ

నిర్మాణాన్ని చేయగలరనే భయం చైనాలో అధికారంలో వున్నవాళ్ళకి విద్యార్థుల విరసనలో కనిపించింది. కనుకనే అధికారంలో వున్నవాళ్ళు విద్యార్థుల నిరసనను కాని, డిమాండ్లను కాని చర్చించి ఏదోఒక రకంగా పరిష్కారం చేయాలని కాకుండా ఇది ఎక్కడికి పోతుందో, దీనిరూటు ఎలా మారుతుందో, ఇది తప్పకుండా ఇంకా ముందుకు పోతుందని, cultural revolution 1969లో వదిలేసిన ఏ చారిత్రక పరిణామం ఉందో దాన్ని మళ్ళీ చైనా ప్రజలు ముందుకు తీసుకెళ్ళతారనే విషయాన్ని చైనా పాలకులు పసికట్టారు. అంటే విద్యార్థులమీద జరిగిన ఈ attack కేవలం విద్యార్థుల మీద జరిగింది కాకుండా చైనాలో ఉన్న శ్రామికజనం, కష్టజీవులలో పెరుగుతున్న చైతన్యస్థాయిమీద ఒక పెద్ద దెబ్బ అని మనం అర్థంచేసుకుంటే బహుశా మొత్తం ఈ హింస, దౌర్జన్యం, రాజ్యయంత్రాంగం స్వభావాన్ని అర్థం చేసుకోవచ్చు.

అదే మన భారతదేశంలో అయితే లక్షలమంది విద్యార్థులు ఢిల్లీకి వెళితే ఇంతకన్నా బాగా handle చేసేవాళ్ళు. ఆర్మీని తీసుకురాకుండా జైళ్ళలో పెట్టో, అబద్ధాలు చెప్పో ఏదోవిధంగా handle చేసేవాళ్ళు. మరి చైనాలో ఒక discussion లేదు, ఒక dialogue లేదు, ఒక idealogical debate లేదు, discourse లేదు, సమస్యల పరిష్కారానికి negotiations లేవు. ఏం లేకుండా ఇంత దారుణం ఎందుకుచేశారంటే విద్యార్థుల నిరసనలో దాగి ఉన్నటువంటి ప్రజాచైతన్యం ఒక ప్రమాదకరమైన indicatorగా వాళ్ళకు కనిపించినందుకే. అంత పెద్ద దెబ్బకొడితే ప్రజలు వెనుకంజ వేయవచ్చని, మారుతున్న చైతన్యాన్ని కొంతవరకు కంట్రోల్ చేయవచ్చునని చైనా పాలకులకు అవగాహన ఉంది కాబట్టే ఇంత దౌర్జన్యానికి పూనుకున్నారనుకోవచ్చు. ఈ dissentను రెండవరకంగా రాజ్యవ్యతిరేక dissentగాకూడ వాళ్ళు పరిగణించారు. అందుకే డిమాండ్లను అంగీకరించకపోవడంతోపాటు రాజ్యాధికార యంత్రాంగాన్ని ప్రశ్నించిన dissentలో ఉన్న విప్లవకరమైన దానిమీద పాలకులు దెబ్బకొట్టారు. ఇంకో విషయమేమిటంటే మార్కెట్ద్వారా కలిగిన ప్రయోజనాలకు state protection కావాలి. కాబట్టి కాపిటలిస్టు రూడర్స్ యొక్క సామాజిక సంబంధాల్ని protect చేయడానికని, ఈ ప్రయోజనాల్ని కాపాడడం కొరకని సమాజంలో నిర్మించిన ఒకేఒక legitimate యంత్రాంగం, అంటే అధికారాన్ని, బలప్రయోగాన్ని, హింసను ఉపయోగించడానికిగల ఒకేఒక అథారిటీని కలిగినటువంటి యంత్రాంగం రాజ్యం కనుక ఈ మొత్తం class forcesను కాపాడవలసిన బాధ్యతగల రాజ్యాధికార యంత్రాంగాన్ని

ప్రశ్నిస్తే ఈ మొత్తం classesను ప్రశ్నించినట్లే. సివిల్ సొసైటీలో మార్కెట్‌ను అంటే classesను ఛాలెంజ్ చేయడంకంటె కూడా వాళ్ళ అథారిటీని ప్రశ్నించడం ప్రమాదకరంగా భావించడం జరుగుతుంది. ఇది మన ఇండియాలోకూడ చూడవచ్చు. ముఖ్యంగా interior tribal ప్రాంతానికి వెళితే అక్కడ మనకు classes కనిపించవు. స్టేట్ ఎక్కువగా కనిపిస్తుంది. వాళ్ళ జీపులు, పోలీసులు, ఫారెస్టు అధికారులు, బ్యూరాక్రసీ - ఇవే మనకు ఎక్కువగా కనిపిస్తాయి. నిజానికి గిరిజన సమాజంలో అతనికి కొన్ని వైరుధ్యాలున్నా - land lords, మిగతా వర్గాలేవైనా ఉంటే - వాటికన్నా ఎక్కువగా స్టేట్ కనిపిస్తుంది. అంటే రాజ్య యంత్రాంగం ఎక్కడెక్కడయితే classes లేవో తాను అక్కడికెళ్ళి అదనపు ఉత్పత్తిని చేజిక్కించుకొని, అంటే అటవీ సంపద అయితేనేమి, గిరిజనుడి శ్రమనైతేనేమి దోచుకొని సమాజంలోని మిగతా వర్గాలకు పంపిణీచేస్తుంది. కనుకనే రాజ్యాన్ని ప్రశ్నించడమంటే లేదా అధికారంలో ఉన్నవాళ్ళని ప్రశ్నించడమంటే, వాళ్ళు corrupt అన్నా, వాళ్ళెందుకు ఇన్ని privileges కలిగివున్నారనికాని ప్రశ్నిస్తే అది ఆమొత్తం classesని ప్రశ్నించినట్లే. ఏ classes అయితే రాజ్య యంత్రాంగంయొక్క అథారిటీమీద బేస్ అయివున్నాయో వాళ్ళందర్నీ ప్రశ్నించినందుకే చైనాలో రాజ్యం అంత దౌర్జన్యంగా ప్రవర్తించాల్సి వచ్చిందని మనం గుర్తించాలి.

ప్రజలు విద్యార్థుల ఉద్యమానికి మద్దతు తెలపడం, వారి చైతన్యం పెరుగుతుండడం, విద్యార్థుల ఉద్యమం ఇవన్నీ సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలకి సంబంధించిన ప్రశ్నలను ముందుకుతెచ్చింది. అట్లాగే రాబోయే కాలంలో చైనా ప్రజలు, శ్రామికులు ఏ డిమాండ్లతో, ఏ అవగాహనతో ఉద్యమనిర్మాణం చేస్తారు, వాళ్ళు ఎలా ముందుకు వెళతారు అనే ప్రశ్నలుకూడ ఈ సందర్భంగా తలెత్తడం సహజం. తాత్కాలికంగా ఆ దేశంలో ఉన్న పాలకవర్గాలు లేదా కొనసాగిన వర్గాలు, ప్రజా చైతన్యంమీద దెబ్బకొట్టి కొంత విజయం సాధించారు. కాని చరిత్ర అక్కడ ఆగిపోదు. చరిత్ర నిరంతరంగా సాగేది కనుక అది ముందుకు పోవలసివస్తుంది. ఇక్కడనుంచి చైనా ఎటువేపు వెళుతుంది, చైనా ప్రజలు ఏ మార్గాన్ని ఎంచుకుంటారు, చైనాలో సోషలిజాన్ని, సమానత్వాన్ని సాధించడానికి ఇంక ఏమి జరుగుతుంది అనే ప్రశ్నలు విద్యార్థులమీద జరిగిన దౌర్జన్యంద్వారా మన ముందుకు వస్తున్నాయి. అంటే వర్కింగ్‌క్లాస్‌కు సంబంధించిన సమస్యలే కాకుండా సోషలిస్టు ఉత్పత్తి విధానమంటే ఏమిటి, ఉత్పత్తి సంబంధాల్ని ఎలా విప్లవీకరించాలి, సమానత్వాన్ని ఎలా సాధించాలి,

ఈనాడు ఉత్పత్తిలో ఉన్న సంక్షోభంనుండి బయటపడటానికి సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు ఎలా సాధించాలి, మానవ సంబంధాల్ని ఎలా మార్చాలి అనే విషయాల్ని, సోషలిస్టు చైతన్యాన్ని నేటి చైనా సంఘటనలు అక్కడి ఉద్యమాల్ని sharpen చేస్తాయని, అక్కడి ప్రజలు రానురాను ఈ ఫైట్ ముందుకు తెస్తారని మనం అనుకోవచ్చు. అంటే సాంస్కృతిక విప్లవం వదిలేసిన బాధ్యతని ఆ చారిత్రక పరిణామాన్ని బహుశా చైనా ప్రజలు ఎంచుకునే మార్గంకావచ్చు. అలాగే చైనా విద్యార్థులు మార్క్సిస్టులా, ప్రజలకొరకు పనిచేసేవాళ్ళా, ప్రజలు విద్యార్థులను హీరోలుగా పరిగణిస్తారా అనే విషయాలను మనం తీసుకుంటే నిజానికి ప్రజల బాగుకొరకు చనిపోయారని కాకుండా రాబోయే నూతన చైతన్యానికి ఈ సంఘటనలు పునాది అవుతాయి కనుక చైనా ప్రజలు విద్యార్థులను చాలాకాలం గుర్తుపెట్టుకోవచ్చు. తప్పకుండ గుర్తుపెట్టుకుంటారు. విద్యార్థులు కూడ అనివార్యంగా చారిత్రకంగా జరిగిన పరిణామాల దృష్ట్యా ఇప్పుడు పెట్టిన డిమాండ్లు కాకుండా. వాళ్ళు ఒక కొత్త తరహాలో ఆలోచించాల్సి వస్తుంది. పెట్టిన డిమాండ్లు ఎందుకిలా అయిపోయాయి, చైనా కాపిటలిస్టు మార్గంలోనే వెళుతున్నప్పటికీ తాము పెట్టిన డిమాండ్లు ఒప్పుకోలేదు కనుకనూ విద్యార్థుల్లో చాలమందికి తప్పకుండ సోషలిస్టు చైతన్యం రావచ్చునని చెప్పుకోవచ్చు. విద్యార్థులు ఈ కొత్త అనుభవంతో సోషలిస్టు చైతన్యాన్ని పెంపొందించుకొని ప్రజల్లోకి ప్రజలతో మమేకం అయి మొత్తం మార్పుకి, మళ్ళీ ప్రజా ఉద్యమ నిర్మాణానికి కావలసిన సోషలిస్టు చైతన్యం విద్యార్థులకు రావచ్చు.

మనం ఆలోచించుకోవలసిన ఇంకొక విషయం అసమానతలు లేకుండా భౌతిక ఉత్పత్తిని పెంచడానికి వీలులేదా? సమాజంలో అసమానతలు సృష్టించకుండా ఇది సాధ్యంకాదా? ఈనాడు చైనాలో వున్న పాలకులు ఏమనుకుంటున్నారంటే అసమానతలనేవి ఉంటే తప్పించి మనిషి competition, race లేకుండా ఉత్పత్తిని పెంచడం కష్టమని వాళ్ళు అనుకుంటున్నారు. ప్రకృతి మీద మానవుడు జరిపే పోరాటమే ఉత్పత్తిశక్తుల అభివృద్ధి అని అనుకుంటే అసమానతలు తగ్గిస్తూ సమిష్టి చైతన్యంతో ఉత్పత్తిచేయడానికి ఉత్పత్తిసంబంధాలని మౌళికంగా మార్చకుండా ఉత్పత్తిలో పెరుగుదల జరగదు అనేది ఒక శాస్త్రీయ, చారిత్రక అనుభవం, అదే చైనా చరిత్ర పేర్కొంటున్నది. ఈ అనుభవంలోంచి చూసినపుడు ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఆటంకంగా వుండే ఉత్పత్తిసంబంధాలను మార్చడానికి భవిష్యత్తులో చైనాలో రాబోయే ఉద్యమాలేవైతే వున్నాయో అవే ప్రపంచ చరిత్రను ముందుకు నడిపిస్తాయి.

భారత దేశంలో ఉద్యమనిర్మాణం చేస్తున్నవాళ్ళు, ప్రజాస్వామ్యనిర్మాణం చేస్తున్నవాళ్ళు, ప్రజలు చైనా అనుభవంద్వారా ఉద్యమం కేవలం రాజ్య యంత్రాంగం సాధించుకుంటేనే పూర్తి గమ్యాన్ని చేరినట్లని భావించకుండా సామాజిక మార్పు అనేది ఒక నిరంతరమైన ప్రక్రియ అని అర్థంచేసుకుంటే రాజ్య యంత్రాంగాన్ని హస్తగతం చేసుకున్నతర్వాత ఉద్యమాల్ని విరమించకుండా నిరంతరంగా ప్రజలు వుద్యమనిర్మాణం చేస్తూ, చైతన్యవంతమవుతూ, నూతన మానవవిలువల్ని సాధించుకుంటూ, ప్రకృతిమీద జరిగే పోరాటాన్ని ముందుకు తీసికెళ్తూ ఒక నూతన సమాజ ఆవిర్భావం జరగాలనే ఒక అవగాహనని చైనా అనుభవం చెప్పగలిగితే మన దేశంలోని వుద్యమాలకి అది ఒక కొత్త స్ఫూర్తిని ఇచ్చినట్లే. ఈ అవగాహన మనకొస్తే మనం ఒక మైలురాయిని దాటి ఇంకా మనమనుకుంటున్న ఒక కొత్త సమాజంవైపు వెళుతున్నామనే ఒక అవగాహన మనకు కలిగితే చైనా పరిణామాలు, వాటి వైరుధ్యాలు, వైరుధ్య పరిష్కారాలు, తియనెన్మెన్ స్క్వేర్‌లో విద్యార్థుల త్యాగం వీటన్నిటికీ ఒకే అర్థం చారిత్రకంగా ఇవి సమాజాన్ని ముందుకు తీసుకెళ్ళే సంఘటనలేనని అంగీకరించవచ్చు.



# 20 ఏళ్ళ విరసం మహాసభల విశేషాలు - వివరాలు

## 20 ఏళ్ళ విరసం మహాసభల రిపోర్టు

విప్లవ రచయితల సంఘం 20 ఏళ్ళ క్రితం 1970 జులై 4న హైద్రాబాద్‌లో పుట్టింది 1980లో విరసం దశాబ్ది మహాసభలు హైద్రాబాద్‌లోనే జరిగాయి. ఈ ఇరవైయేళ్ళలో ఎన్నో నిర్బంధాలను ఎదుర్కొని, ఆటుపోట్లను తట్టుకొని 20 ఏళ్ళ మహాసభల్ని కూడా హైద్రాబాద్‌లోనే జరుపుకొంది. ఈ మూడు సంఘటనలూ హైద్రాబాద్‌లోనే జరగడం యాదృచ్ఛికం అయినా కాకపోయినా అలా జరగడంలో ఒక ఔచిత్యం వుంది. కొన్ని శతాబ్దాల నుంచీ అది రాజకీయ అధికారానికి కేంద్రం. ఆనాటి రాజుల రాజధాని నగరం. నేటికి ఆంధ్రరాష్ట్ర రాజధాని. ఎందరో విప్లవవీరులు భూమికోసం, భుక్తికోసం మానవజాతి విముక్తికోసం తమ రక్తాన్ని ధారపోసిన తెలంగాణా నడిగడ్డ. ఆనాటి మహత్తర తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం నుంచి ఈనాటి ఉత్తర తెలంగాణా జిల్లాలోని గిరిజన రైతుకూలీల పోరాటం దాకా ప్రజా ఉద్యమాలను అణచివెయ్యడానికి క్రూరంగా ప్రవర్తించే దోపిడీ పాలకవర్గ అధికారం అక్కడే కేంద్రీకృతం అయివుంది. పీడిత ప్రజల పక్షం వహించే విప్లవ రచయితల, కళాకారుల, మేధావుల సంఘమైన విరసం సభలు అక్కడ జరగడం ఔచిత్యంతోపాటు దాని శక్తికి ఒక పరీక్ష.

20 ఏళ్ల విరసం మహాసభలు దిగ్విజయంగా జరిగాయి. ఊహించిన దానికి రెట్టింపుగా 2047 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అంచనాలకు మించి లక్షకుపైగా ఊరేగింపుకూ, బహిరంగసభకూ వచ్చారు. సామాన్యప్రజల నుంచి పెద్దపెద్ద మేధావులదాకా అందరినుంచీ మంచి ప్రోత్సాహం లభించింది.

జనవరి 11, 12, 13 తేదీలు కా॥ మేడ్ చెరబండరాజునగర్. ఆ మూడు రోజులూ కట్టలు తెంచుకొన్న జనప్రవాహం. హద్దులుమీరిన విప్లవోత్సాహం. బాధ్యతాయుతమైన భావప్రకటనా స్వేచ్ఛపైన, ప్రజారచయితల స్వాతంత్ర్యం పైన, ప్రజల మద్దతు ఉన్న విప్లవ సాహిత్యోద్యమంపైన ఉక్కుపాదం మోప డానికి ప్రయత్నించే పాలకవర్గ క్రూర స్వభావాన్ని ప్రజాసాహిత్యం, ప్రజలు ఓడించిన సమయం అది. విరసం చరిత్రపథంలో ఈ దృశ్యం ఒక మైలురాయి.

***11వ తేది ఉదయం 9 గంటలకు—***

విప్లవకవి, అమరవీరుడు కా॥ చెరబండరాజు భార్య కా॥ శ్యామల అమరవీరుల పతాకావిష్కరణ చేశారు. వంగపండు దళం "సుత్తికొడవలి గుర్తుగ వున్న ఎర్రనిజెండా ఎగురుతున్నది" అన్న పాట పాడింది. పాట ఆగగానే నినాదాలు మిన్నుముట్టాయి. తర్వాత AILRC కార్యదర్శి కా॥ కె.వి ఆర్ విరసం జెండా ఆవిష్కరించారు. కా॥ రుద్రజ్వాల "ఎత్తినాం విరసం జెండా" అనే విరసం పతాకగీతాన్ని పాడాడు. మళ్ళీ నినాదాలు. కా॥ అరుణ్ సన్యాల్ (బెంగాల్) AILRC జెండా ఆవిష్కరించారు. కా॥ అనూరాధ బృందం "ఓ అరుణ పతాకమా ..." అనే పాట పాడారు. కా॥ విమల (అరుణోదయ) తదితరులు "ఎత్తిన జెండా...." (విరసం అమరవీల పాట) పాడారు. మళ్ళీ విప్లవ నినాదాలు. పుస్తక ప్రదర్శనను కన్నాభిరాన్ ప్రారంభించారు.

తర్వాత జనం అంతా కా॥ జ్ఞానేశ్వర్ కీర్తి హాల్‌లో ప్రవేశించారు. సిటీ యూనిట్ కన్వీనర్ కా॥ విపుల ప్రారంభ సమావేశం అధ్యక్షులుగా విరసం కార్యదర్శి కా॥ వి. చెంచయ్యను, ప్రారంభోపన్యాసకులుగా కా॥ కె.వి.ఆర్.ను ఆహ్వానసంఘాధ్యక్షులుగా కా॥ కాళోజీని వేదికపైకి ఆహ్వానించారు. వంగపండు పాడిన "కష్టజీవులం మేము కమ్యూనిస్టులం" పాటతోనూ, యన్.కె. పాడిన "పాడుతాం పాడుతాం" పాటతోనూ ప్రారంభ సమావేశం ప్రారంభమైంది. అధ్యక్షులు కా॥ వి. చెంచయ్య 20 ఏళ్ల సభలు జరుపుకొంటున్న విరసాన్ని పరిచయం చేశాడు. ప్రారంభోపన్యాసకులు కా॥ కె.వి.ఆర్ విరసం పుట్టుక నేపథ్యాన్నీ, విరసం సాధించిన విజయాలనూ, సాధించవలసిన అంశాలనూ గూర్చి ప్రసంగించారు. కా॥ కాళోజీ విరసం అవసరాన్నీ, దాని పాత్రనూ గూర్చి మాట్లాడారు.

తర్వాత సందేశాలు ప్రారంభమైనాయి. ఎన్నో సంస్థలు, ఎందరో వ్యక్తులు విరసం చేస్తున్న కృషిని అభినంధిస్తూ, ఇంకా చెయ్యవలసిన

దాన్ని విశదీకరిస్తూ, నిర్మాణాత్మకమయిన సూచనలిస్తూ సందేశాలిచ్చారు. ఈ సందేశాల కార్యక్రమం కూడా ఉత్సాహభరితంగా సాగింది. దీని తర్వాత జరగవలసిన పుస్తకావిష్కరణ ఒక్కసారిగా గాక అంచెలంచెలుగా సాగింది. 18 పుస్తకాలు ఆవిష్కరింపబడ్డాయి. అరుణతార (ప్రత్యేక సంచిక), సృజన (పునః ప్రారంభ సంచిక), జర్జునకరి ఝునారే (ధ్వని ముద్రిణతో కలిపి), జగిత్యాలపల్లె, సంక్షోభగీతం, నేలతల్లి విముక్తికోసం (అసంపూర్ణ కథా సంకలనం), నిశ్శబ్దం చీడకావద్దు, కిరణ్ సంస్మరణ, మనసలందరి, అడవి ఉప్పొంగిన రాత్రి, అక్షరం సార్థకమౌతుంది, మరోప్రస్థానం టీకాటిప్పణి సాంస్కృతికరంగంలో నిర్మాణ సమస్యలు (గద్దర్), స్త్రీ విముక్తి (నృత్య రూపకం), ముక్తకంఠం, తర్జని, సృజన సంపాదకీయాలు, జననాట్యమండలి పాటలు ఆవిష్కరింపబడ్డాయి.

*11వ తేది మధ్యాహ్నం 3 గంటలకు—*

కా॥ చలసాని ప్రసాద్ అధ్యక్షతన సభ ప్రారంభమైంది. కా॥ వరవరావు విరసం చరిత్ర చెబుతూ విరసం సాహిత్యకక్షినీ, విరసం కమిట్మెంట్నూ, విరసం ఎదుర్కొన్న నిర్బంధాలనూ గూర్చి ప్రసంగించారు. "ప్రజాసంస్కృతి- కళలు- మన కర్తవ్యాలు" అనే అంశంపైన కా॥ కాకరాల ప్రసంగించారు. ఈ దేశంలో ఈస్టిండియాకంపెనీ అడుగుపెట్టిన క్షణంనుంచే ప్రజల ప్రతిఘటన మొదలైందనీ, గిరిజన తిరుగుబాట్లు వచ్చాయనీ, ఈ గిరిజన పోరాటాల్లో పాట గిరిజనుడి చేతి బాణమైందనీ, కానీ అప్పుడది నాగరికమైదానాల్లోని విద్యావంతులకు వినిపించలేదనీ అన్నాడు. జాతీయోద్యమంలో గాంధీ నాయకత్వంలో 'రఘుపతి రాఘవరాజారాం' పాటలు గిరిజన రైతుల సాయుధ పోరాటాన్ని నగరమైదానాలు వినకుండా జోలపాడి జోకొట్టాయన్నారు ఆ పిమ్మట ప్రజా నాట్యమండలి చేతిలో పాటలు రాజకీయచైతన్యానికి వాహికలయ్యాయన్నారు. నక్సల్బరీ శ్రీకాకుళ ఉద్యమాల ప్రేరణతో వచ్చిన జననాట్యమండలి చేతికో పాట వర్తమాన పోరాట చైతన్యాన్ని నింపుకుందనీ, ఆ ఉద్యమానికి ప్రతినిధిగా గద్దర్ ప్రజాయుద్ధనౌకగా ప్రయాణించారనీ అన్నారు. ఇలా కాకరాల పాట పరిణామాన్ని వివరించారు. ఇదే అంశంపైన కా॥ ఇస్లాం (నిశాంత్ నాట్యమంచ్, ఢిల్లీ) పంపిన వ్యాసాన్ని కా॥ నారాయణస్వామి చదివాడు. సాహిత్యంపై విరసం వేసిన ప్రభావాన్ని గూర్చి ఆహ్వాన సంఘ సభ్యులు కా॥ హరి ప్రసంగించారు. కా॥ పరిటాల శ్రీరాములు హాలులో విరసం

చరిత్ర తెలిపే ఫోటోలతో విప్లవోద్యమ స్ఫూర్తికలిగించే బొమ్మలతో ఉన్న ప్రదర్శనను ప్రతినిధులు చూశారు. రాత్రి 8 గంటలకు కా॥ నారాయణస్వామి, కా॥ ఎన్.కె.ల ఆధ్వర్యంలో కవిసమ్మేళనం కొనసాగింది.

**12వ తేది ఉదయం 9 గంటలకు—**

కా॥ కె.వి.ఆర్. అధ్యక్షతన సభ ప్రారంభమైంది. చైనా సాంస్కృతిక విప్లవం గురించి 'స్వేచ్ఛ' సంపాదకులు కోదండరామిరెడ్డి ప్రసంగించారు. వ్యక్తి తన్ను తాను విప్లవీకరించుకోవడంతోబాటు మొత్తం పార్టీనీ. సమాజాన్ని ప్రజల్ని విప్లవీకరించుకోవడానికి అవకాశం కల్పించే ఒక మహత్తర పోరాటమే ఈ సాంస్కృతిక విప్లవమని దాని పూర్వాపరాల్ని వివరించారు. ఇటీవలి చైనా పరిణామాల గురించి డా॥ హరగోపాల్ మాట్లాడుతూ మానవ సంబంధాలు లేదా ఉత్పత్తి సంబంధాలు మౌలికంగా మార్చి భౌతిక ఉత్పత్తిని పెంచాలనే దిశగా కాకుండా ఉపరితల నిర్మాణాన్ని మార్చకుండా భౌతిక ఉత్పత్తిని మాత్రమే పెంచాలని చేసే ప్రతి ప్రయత్నం పెట్టుబడిదారీ విధానం వైపు పోతుందేగాని, సోషలిజం వైపు పోదనే శాస్త్రీయ వాస్తవికతను చైనా పరిణామాలు నిరూపిస్తున్నాయన్నారు.

**12వ తేది మధ్యాహ్నం 3 గంటలకు—**

పెరిస్త్రోయిక - తూర్పు యూరపు దేశాల్లోని పరిణామాల గురించి డా॥ బాలగోపాల్ ప్రసంగించారు. ఈ దేశాల్లో వచ్చిన మార్పులు అకస్మాత్తుగా వచ్చినవి కావనీ, ఉత్పత్తి శక్తుల సిద్ధాంతం యొక్క అంతిమ వైఫల్యం అనీ చెప్పారు.

ఈరోజున జరిగిన ఈమూడు ప్రసంగాలూ వివరంగానూ, సోదాహరణం గానూ సాగాయి. ఇవాళ ప్రపంచవ్యాప్తంగా ఈ అంశంపైనే చర్చ జరుగుతోంది. కమ్యూనిజం భవితవ్యం గూర్చి అనుమానాలు రేకెత్తుతున్నాయి విఫలమయింది నకిలీ కమ్యూనిజమేగాని, అసలు కమ్యూనిజం కాదని చెప్పాల్సిన బాధ్యత, ఈ పరిణామాల నేపథ్యాన్ని వివరించాల్సిన చారిత్రక పాత్ర విరసంపై వుంది కాబట్టి ఈ అంశాలకు ఒకరోజంతా కేటాయించడం జరిగింది. ప్రతినిధులు కూడా అత్యంతాసక్తితో ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టుకున్నారు. ఈరోజు రాత్రి జననాట్యమండలి, అరుణోదయల సాంస్కృతిక కార్యక్రమాలు సాగాయి. అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి భాగస్వాములైన ఇతర రాష్ట్రాల యూనిట్లు కూడా సాంస్కృతిక కార్యక్రమాలనిచ్చాయి:

*13వ తేది ఉదయం 9 గంటలకు—*

కా॥ సుధాకిరణ్ అధ్యక్షతన సభ ప్రారంభమైంది. పర్యావరణ సమస్యల్ని గూర్చి కా॥ అనూరాధ, స్త్రీల సమస్యల గూర్చి కా॥ రత్నమాల, దళితుల సమస్య గూర్చి కా॥ రాంమోహన్, ఆదివాసీ సమస్యల గూర్చి కా॥ ఎన్. వేణుగోపాల్‌లు ప్రసంగించారు. ఊరేగింపులో పాల్గొనడానికి, బహిరంగసభకు హాజరుకావడానికీ ఆ రోజు ఉదయం నుంచే జనం తండోప తండాలుగా రావడం ప్రారంభించారు. ఈ ఉదయం సెషన్ క్రిక్కిరిసిన జనం మధ్యనే అయినా ప్రశాంతంగానే సాగింది.

*13వ తేది మధ్యాహ్నం 3 గంటలకు—*

ఊరేగింపు ప్రారంభమైంది. జననాట్యమండలి, అరుణోదయల పాటలతో, నృత్యాలతో, దిక్కులు పిక్కటిల్లేటట్లు వినిపించే విప్లవ నినాదాలతో 3 గంటల పాటు ఊరేగింపు సాగింది.

*13వ తేది సాయంత్రం 6 గంటలకు—*

కా॥ సుబ్బారావు పాణిగ్రాహినగర్‌లో (బుద్ధపూర్ణిమ పార్క్) బహిరంగ సభ ప్రారంభం. నూతన కార్యదర్శి కా॥ వి. చెంచయ్య అధ్యక్షత వహించారు. విరసం చేసిన తీర్మానాలను వివరించారు. 19 మందితో కూడిన నూతన కార్యవర్గాన్ని ప్రకటించారు. వక్తలు కాళోజీ, బాలగోపాల్, నారాయణస్వామి, వరవరరావులు ప్రజలపైన, ప్రజాఉద్యమాలపైన, ప్రజాసాహిత్యంపైన సాగుతున్న నిర్బంధాల్ని ఖండించారు. విప్లవోద్యమంగానీ, దాని ప్రభావంతో వచ్చిన విప్లవసాహిత్యోద్యమంగానీ అజేయం అన్నారు. ఆ తర్వాత చాలాసేపు సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి. దాదాపు రాత్రి 2 గంటల ప్రాంతంలో సభ ముగిసింది.

ఈ 20 ఏళ్ళ విరసం సభలకు వచ్చిన ప్రతినిధులు నూతనోత్సాహాన్ని నింపుకొని, విప్లవ స్ఫూర్తితో, అపూర్వమైన అనుభూతిని పొంది సంతృప్తిగా తిరిగి వెళ్లారు.



# సందేశాలు

ఇప్పటి సాహిత్య చరిత్రల స్వరూపాన్నీ, స్వభావాన్నీ ప్రశ్నించడానికి కలకాలం నిలిచేదే గొప్ప సాహిత్యమని చెప్పే సాహిత్య శాస్త్ర సిద్ధాంతపు సామాజిక తత్వాన్నీ ప్రశ్నించడానికి తెలుగు సాహిత్య చరిత్రలో ఇప్పుడు మనకొక గొప్ప అవకాశం దొరికింది. ఇరవై యేళ్ల విరసం సాహిత్య చరిత్ర ఆ అవకాశాన్ని మనకిస్తుంది.

నారాయణరెడ్డికి లక్షరూపాయల జ్ఞానపీఠం అవార్డు వస్తుంది. గద్దర్ తలమీద లక్షరూపాయల రివార్డు ప్రకటించబడుతుంది. కొన్నాళ్ళ తర్వాత "ప్రామాణిక" తెలుగు సాహిత్య చరిత్రలో నారాయణరెడ్డిని గురించి రాయబడుతుంది. గద్దర్ పేరు విస్మరింపబడుతుంది.

ఈ పొరపాటుకు తావివ్వకుండా ప్రజల సాహిత్యానికి సరయిన స్థానం కల్పించి, సాహిత్య చరిత్ర సిద్ధాంతాలని రుజువులతో సాక్ష్యాలతో సాధికారికంగా సవరించడానికి ఇప్పుడు మనకో అవకాశం కలిగింది. అందుకు అవసరమైన అన్ని వివరాలనూ, సాక్ష్యాలనూ భద్రపరచడం మూలంగానూ మనం ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలి.

మాడిసన్, — వెల్చేరు నారాయణరావు

2-1-1990.

బొట్టు బొట్టుగా నా నెత్తురును ఈ నేల విముక్తికై విత్తనంగా చల్లుతాను, నన్ను కదిపినా, ఖండించినా మళ్ళీమళ్ళీ అలల్లాగా పుట్టుకొస్తూనే ఉంటానని నినదించి — ప్రభుత్వం తన మీద విసిరిన కుట్రకేసుల పంజాలను, అన్నిరకాల నిర్బంధాలను సవాలుచేస్తూ, తన గుండె నిండా ఉద్యమం జెండాని ఎగరేస్తూ విప్లవోద్యమంలో ప్రాణాలు అర్పించిన కా॥ చెరబండరాజు బాటలో అప్రతిహతంగా పురోగమిస్తూ, మరో ప్రపంచం బాటలో నెత్తుటి తర్పణలు చేస్తూ అమరులైన కా॥ శ్రీశ్రీ, కా॥ కొడవటిగంటి కుటుంబరావు రచనల ఊపిరిని ఆయువుగా చేసుకొని జనం గుండె గొంతుకల్ని తూర్పు గుండెల్లో ఆవిష్కరించి ఇరవై వసంతాల్ని చూసిన విప్లవ రచయితల సంఘానికి ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ విప్లవాభినందనలు తెలియచేస్తుంది.

—ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్
హైదరాబాదు

పాలకుల అణచివేతను గత 20 సం॥ల నుండి ప్రతిఘటిస్తూ, నూతన ప్రజాస్వామిక, సాహిత్య, సాంస్కృతిక, కళారూపాల్లో ప్రజల్ని ఉత్తేజ పరుస్తున్న విరసాన్ని అభినందిస్తూ తన కృషిలో మరింత ఎదగాలని కోరుతూ, సభలు జయప్రదం కావాలని కోరుతూ—

న్యూ డెమొక్రటిక్ వర్కర్సు
విశాఖపట్నం.

రెండు దశాబ్దాలుగా ప్రజల పక్షాన నిలబడి ప్రజాపోరాటాలను అక్షర బద్ధంచేస్తూ, నిత్య నిర్బంధాలను ఎదుర్కొంటూ ముందుకుసాగుతున్న విరసం ఇరవయ్యేళ్ళ సభలు జరుపుకుంటున్న సందర్భాన ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ విప్లవాభినందనలు తెలుపుతున్నది.

—APTF

...సంస్కరణవాదాలు పెరిస్త్రోయికాలు రివిజనిస్టువాదాలు ప్రజావిప్లవాలకు మరో ప్రమాదం తెచ్చిపెడుతున్నది. ఇది సర్దా పురుషుల సోషలిస్టు ముసుగు దీనిని ఎదుర్కోవలసిన పరిస్థితి కమ్యూనిస్టుల మీద వుంది. దీనికి ప్రజాకవులు విప్లవ రచయితలు ఎంతైనా కృషి చేయాల్సివుంది.

—గంజి రామారావు
అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ రైతుకూలీ సంఘం.

**RWA is a source for Inspiration for Revolutionary Writers to Write for Liberation of Toiling Masses.**

**—GURSHARAN SINGH**

ఇరవై సంవత్సరాల విప్లవ పురోగమనానికి తోడ్పాటుగా నాలాంటి ఎందరో కవులకి ప్రేరణనిచ్చిన విప్లవ సాహిత్యకారులు కామ్రేడ్ పాణిగ్రాహి, చెరబండరాజు, శివసాగర్, శ్రీశ్రీ, వరవర్, గద్దర్ లతో పాటు. ఇంకా కొన సాగుతున్న విప్లవ సాహిత్య వారసత్వానికి సారథ్యం వహిస్తున్న విరసం, ఎన్ని ఇబ్బందుల్లోనైనా మరింత ముందుకే పోగలుగుతుందనే నమ్మకంతో, విరసం సభలు దిగ్విజయంగా జరగాలని ఆశిస్తూ, విరసం సారథ్యాన్ని మనసా ఆహ్వానించే,

మాడిసన్ — జయప్రభ
2-1-1990 — విప్లవాభినందనాలు

Wish your Twentieth Conference will year mark as Newstride in Revolutionary Cultural Movement in AP as well as in India

ASIT KUMAR
Peoples Art and Cultural Forum

1970లో వెలసిన విరసం ఈనాడు సుమారు 20 ఏళ్ళ జీవితం సంతరించుకొని ఎన్నో ఒడిదుడుకుల సుడిగుండాల నుండి పయనించి, బయటపడి తన సుదీర్ఘ పోరాట చరిత్రలో ఎల్లప్పుడూ అలగా జనం ప్రక్కన నిలబడే ఒక మహత్తరమైన తెలుగు సాహిత్యాన్ని 'సృజించి', దాన్ని 'అరుణారుణ' రంగుల 'తార'లతో రంగరించి భారత దేశ విముక్తి పోరాట పథాల్లో పయనించి అమరత్వం పొందిన వీరుల వీరగాథలతో సన్నిహితాన్ని సంపాదించిపెట్టింది.

—కలకత్తా విరసం అభిమానులు

రచయిత రచనకే పరిమితం కాకుండా సుబ్బారావు పాణిగ్రాహి, పరిటాల శ్రీరాములు గార్ల స్ఫూర్తితో ప్రజాపోరాటాలు నిర్మించడంలో కూడా తమ బాధ్యతను గుర్తించాలని మరోసారి గుర్తుచేస్తూ సభలు జయప్రదం కావాలని ఆశిస్తున్నాం.

—స్టడీ సర్కిల్
S K. యూనివర్సిటీ, అనంతపురం.

గత 20 సం॥లుగా తెలుగు సాహిత్యంపై విరసం గణనీయమైన ముద్ర వేసింది. విప్లవ సాహిత్యాన్ని పెద్దఎత్తున సృష్టించింది. ఫ్యూడల్, బూర్జువా సంస్కృతులకు వ్యతిరేకంగా పోరాడింది. నూతన ప్రజాస్వామిక సంస్కృతి కోసం కృషిచేసింది. సాహిత్యాన్ని ప్రజలకు దగ్గరగా తీసుకెళ్ళింది.

విప్లవాభినందనలతో
ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం

అత్యంత నిర్బంధాల మధ్య అనేక ఆటుపోట్లకు తట్టుకుంటూ, అతివాద మితవాదాలకు వ్యతిరేకంగా పోరాడుతూ రోజు రోజుకు పురోగమిస్తున్న భారత సాయుధ రైతాంగ విప్లవాన్ని ప్రచారం చేయడంలోనైతేనేమి, మరే విషయంలోనైతేనేమి సాంస్కృతిక సైనికుల్లా శక్తివంచన లేకుండా కృషిచేస్తూ తమ వంతు పాత్రను ప్రతిష్టాత్మకంగా నిర్వహిస్తూ దిన దినం పుంజుకుంటున్న 'విరసం' సంస్థ జరుపుకోబోతున్న మహాసభలకు నా హార్దికాభివందనాలు. మరో

వసంతంలో అడుగుపెడుతున్న మీరు మరింత బలం పుంజుకోవాలనీ మనసారా కోరుకుంటున్న

—మీ సాధన

మీ ఆహ్వానానికి కృతజ్ఞతలు

మీ సభలు జయప్రదం కావాలని కోరుతూ

విప్లవాభినందనలతో
నమ్మ

"శ్రమజీవుల శక్తిముందు ఏ శక్తులు నిలవగలవు" అని చెర అన్నట్లుగానే బొగ్గు గనుల్లో పనిచేస్తున్న కార్మికులు తమ సమస్యలను సి.కా.స నాయకత్వంలో పరిష్కరించుకొంటూ ముందుకుసాగుతున్నారు. కార్మికుల ఈ పోరాటాలను ప్రజలలో మరింత విస్తృతంగా ప్రచారం చేయడంలో విరసం తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తిస్తుందని ఆశిస్తూ సభలు విజయవంతంగావాలని కోరుకుంటున్నాము.

విప్లవాభినందనలతో
సి.కా.స.

మన రాష్ట్రంలో పెచ్చుపెరిగిపోతున్న వ్యాపార సంస్కృతిని, సాహిత్యాన్ని నిరోధించే లక్ష్యంతో ముందుకు పోవాలని, సాంస్కృతిక కార్యకర్తలను, కళాకారులను, రచయితలను, సామాజిక శాస్త్రవేత్తలను ప్రజలకు, ప్రజల సమస్యలకు సన్నిహితం చేసిన విరసం మరిన్ని కాలాలపాటు కొనసాగాలని మా ఆకాంక్ష.

—భారత నాస్తిక సమాజం, ఆం.ప్ర. కమిటీ

నక్సల్బరీ, శ్రీకాకుళ విప్లవాగ్నులనుండి పుట్టి, కత్తినీ కలాన్నీ బట్టి విప్లవకవికి కొత్త నిర్వచనాన్నిచ్చిన కామ్రేడ్ పాణిగ్రాహి విప్లవ వారసత్వాన్ని పునికిపుచ్చుకున్న విరసం గత 20 ఏళ్ళుగా విప్లవపథాన మునుముందుకే సాగింది. నిర్బంధాలు, నిషేధాలు వేటినీ లెక్కించక పీడితప్రజల పక్షాన నిలిచింది. వారి పోరాటాలను గానంచేసింది. మన రాష్ట్రంలో బలమైన విప్లవ సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించడమే గాకుండ, అఖిల భారత విప్లవ సాంస్కృతికోద్యమానికి బాటలు వేసింది.

విప్లవాభివందనాలతో
ఆంధ్రప్రదేశ్ రాడికల్ యువజన సంఘం

ఏ ఉద్యమానికైనా, ఏ సంస్థకైనా ఆటుపోట్లు తప్పవు. అదేవిధంగా పాజిటివ్, నెగటివ్ అంశాలుకూడా దాని అభివృద్ధి క్రమంలో చోటు చేసుకోక తప్పవు. నూతన ప్రజాస్వామిక విప్లవాల కనుగుణమైన విధానాల ప్రాతిపదిక పైన విరసం గత మహాసభనుండి ఇప్పటివరకు తను నిర్వర్తించిన కర్తవ్యాలలో, తన సభ్యుల కృషికి (రచనలకు) సంబంధించి పాజిటివ్, నెగటివ్ అంశాలపైన వాస్తవ పరిస్థితిని పరిగణనలోకి తీసుకొని ధైర్యంగా, సూటిగా విమర్శనాత్మకంగా అంచనా వేసుకుంటుందని, ఆవిధంగా భవిష్యత్కార్యాచరణకు విలువైన గుణపాఠాలను అందిస్తుందని ఆశిస్తున్నాం.

—ఆంధ్రప్రదేశ్ రైతుకూలి సంఘం

Pen and Gun are the two eyes of a revolutionary movement.

The songs strengthen the struggle. The struggles pillarised the songs. Both are interlinked as skin and nails.

We hold this sword tightly to achieve our goal. To achieve this goal, this Conference will definitely Candle the fortitudeness in us. It encourages and awards the Kinetic spirit in us. Also this Conference Create a new scheme, we believe.

On behalf of the Tamil people and agrarian revolutionaries, MAKKAL KALAI MANRAM convey Revolutionary wishes to this Conference. Red Salute!

అగ్ని సరసున వికసించిన వజ్రపుష్పం విరసం. పోరాట జీవితంలో ప్రతిధ్వనించిన అక్షర సంగీతం విరసం. అడుగడుగునా గుండెనెత్తురులు తర్పణ చేస్తూ రాక్షస నిర్బంధాన్ని అధిగమిస్తు మునుముందుకే తోసుకుపోతున్న నిరంతర గోదావరిలోయ పోరాట ప్రవాహం విరసం. ఈ తన పోరాట చరిత్రను మరింత ఉన్నత శిఖరాలకు చేర్చడం కోసం ... ఈ రాష్ట్ర మహాసభల వేదికను శక్తివంతంగా ఉపయోగించుకుంటుందని ఈ మహాసభలు చారిత్రాత్మకం కావాలని

PDSU (విజృంభణ)
రాష్ట్రకమిటీ, ఆంధ్రప్రదేశ్.

అభ్యుదయ రచయితల సంఘం పట్టుమని పది సంవత్సరాలు కూడా చురుకుగా సాగలేకపోయింది. అటువంటిది ఇంతటి సంక్లిష్ట అంతర్జాతీయ,

జాతీయ పరిస్థితులలో ఒక రచయితలసంస్థ 20 సం॥లపాటు నిషేధాలనూ నిర్బంధాలనూ తట్టుకుంటూ ప్రజలకు నిబద్ధమై సజీవంగా నిలవటం ప్రముఖంగా పేర్కొనవలసిన విషయం. ఎన్ని ఆటుపోటులెదురైనా ప్రజావిప్లవపంథా ఆనాటినుండీ ఆగకుండా సాగుతుండటం దీనికొక కారణంగా చెప్పవచ్చు.

సినిమాలు - సాహిత్యం పత్రికలు రేడియో టీవీల ద్వారా అంధవిశ్వాసాలను, ఫ్యూడల్ విలువలను అశాస్త్రీయభావాలను ప్రజల మెదళ్ళలోనికి ఎక్కిస్తున్నారు. యువతరంపై వెర్రెక్కించే జుగుప్సాకరమైన అరాచక సంస్కృతీ ప్రభావాలను రుద్దుతున్నారు. కులమత ద్వేషాలను పెంచి మానవత్వాన్ని మరపింపచేసే ఆటవికతత్వాన్ని పెంపొందిస్తున్నారు. మాఫియాగ్యాంగు లీడర్లను హీరోలుగా ప్రజానాయకులుగా చిత్రించి అధికారపీఠాల్ని ఎక్కిస్తున్నారు.

స్త్రీలపై సాగుతున్న లైంగిక అణచివేతను పట్టించుకో పనిలేని సర్వసాధారణ విషయమా.... అన్నట్లు తయారుచేశారు. వరకట్న హత్యలు, లైంగికదాడులు, అత్యాచారాలు విచ్చలవిడిగా పెరిగినా ప్రజలలో వాటికి వ్యతిరేకంగా తగినంత స్పందన కలుగనీయకుండ చేస్తున్నారు. ఫ్యూడల్ సంస్కృతిలో భాగమైన పురుషాధిక్యతాభావాలను ప్రోత్సహిస్తున్నారు. మరొక పక్క సామ్రాజ్యవాద సంస్కృతీరూపమైన విశృంఖలత్వాన్ని విముక్తివాదం పేరుతో ప్రచారం చేస్తున్నారు.

అన్యాయాలనూ, అసమానత్వాన్ని, అణచివేతను, ప్రజలు ఎక్కువ కాలం సహించరని పోరాడితీరుతారనీ, ఉద్యమాల చరిత్ర రుజువుచేస్తోంది. ఈ పోరాట సంస్కృతిని అభివృద్ధిచేయడం ప్రజారచయితల, కళాకారుల తక్షణ కర్తవ్యం.

దివికుమార్
కార్యదర్శి, జనసాహితి.

వెన్నెలలో కరచాలనం చేసి చీకటిరోజుల్లో వెలుతురుపాటకు గొంతులిచ్చినవాళ్ళమూ, గుండెలనిచ్చి అక్షరాలని చెక్కినవాళ్ళమూ కావడమే, మనలను ఒకరిపక్కన మరొకరిని నిలుపుతున్నది.

విరసం ఇరవైఏళ్ళ మహాసభలు విజయవంతంకావాలని కోరుకుంటూ అమరవీరులకు అరుణారుణజోహార్లర్పిస్తున్నాం.

హైదరాబాద్ — విప్లవాభినందనలతో
11-1-90 — అరుణోదయ రాష్ట్ర కార్యవర్గం.

విప్లవ విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి విరసం స్ఫూర్తి గణనీయంగా తోడ్పడింది. ప్రజా సంస్కృతి వికాసానికి, విప్లవ కళల అభివృద్ధికి విరసం సల్పిన కృషి దానిని విప్లవ సాంస్కృతికరంగాన Vanguard (అగ్రగామి)గా నిలిచింది. పీడిత ప్రజల పోరాటాలే ఊపిరిగా, ప్రజల ఆకాంక్షలకు అద్దం పట్టింది. సృజనాత్మక రూపాలనిచ్చింది. ఆ క్రమంలో పాలకుల ఆగ్రహాన్ని, ప్రజల అభిమానాన్ని సంపాదించింది.

—ఆంధ్రప్రదేశ్ రాడికల్ విద్యార్థి సంఘం.

పీడితప్రజల విముక్తిపోరాటంలో అవిభాజ్యమైనది సాంస్కృతిక విప్లవం విరసం కూడా నక్సల్బరీ, శ్రీకాకుళం, గోదావరిలోయ రైతాంగ పోరాటాల ప్రేరణతో, నేపథ్యంతో ఆవిర్భవించింది. విరసం ప్రారంభం నుండి తిరోగమన వ్యక్తులను సవాలుచేసింది వారు ప్రచారం చేసిన ఫ్యూడల్-సామ్రాజ్యవాద సంస్కృతులను ఎండగట్టింది. కుహనా అభ్యుదయ శక్తులపై రాజీలేని పోరాటాన్ని సాగించింది. ప్రజాకళారూపాలు, పీడితుల ఉద్యమాలకు బాసటగా నిలిచే సాహిత్య సృష్టిని సాగించింది. సాంస్కృతికోద్యమ రహదారిపై వెలుగు ప్రసరించింది. ఈ క్రమంలో నిర్బంధపు పడగ నిత్యం విరసాన్ని వెంటాడింది. త్యాగాలకు వెనుదీయక ముందుకే సాగింది విరసం.

సాంస్కృతికోద్యమం విస్తరించడానికి విశాల ప్రజా ఉద్యమ స్వరూపం తీసుకోవడానికి అవసరమైన అనుభవాలను, పాఠాలను రెండు దశాబ్దాల చైతన్యవంతమైన కృషి మనకందించింది. వీటిని మథించి పై కర్తవ్యాలను నిర్వహించేందుకు అవసరమైన పథకాలనూ, ప్రణాళికలను ఈ మహాసభలలో రూపొందించుకుంటారని ఆశిస్తూ....

విప్లవాభివందనములతో

భా.క.పా. (క-లె), రాష్ట్ర కమిటీ.

పీడిత రైతాంగ పోరాటాలు, ప్రజా ఉద్యమాలే విరసం జీవశక్తిగా, విరసం పీడితప్రజల ఆశలకు ఆకాంక్షలకు పోరాటాలకు సృజనాత్మకంగా ప్రతిస్పందిస్తూ ప్రతిధ్వనిస్తూ విరసం ప్రజాపోరాటాలని గానంచేసింది. గత ఇరవై యేళ్ళ విరసం చరిత్ర నిర్బంధాల, నిషేధాల, వేధింపుల చరిత్రయింది. మన దేశంలో ఏ సాంస్కృతిక సంస్థ గురికానంతటి నిర్బంధానికి విరసం గురయింది.

విప్లవశక్తులపైనా ప్రజాఉద్యమాలపైనా ఫాసిస్టు నిర్బంధాన్ని ప్రయోగిస్తున్న పాలకవర్గాలు సాంస్కృతికరంగాన సెక్స్, క్రైం, హింస, క్షుద్ర

# కార్యదర్శి నివేదిక

*[14-1-90 న హైదరాబాద్‌లో జరిగిన విరసం సర్వసభ్య సమావేశంలో చదివిన కార్యదర్శి నివేదిక]*

కామ్రేడ్స్,

ఈ 20 ఏళ్ళ విరసం మహాసభలు విరసం చరిత్రలో ఒక ప్రత్యేకతను సంతరించుకున్నాయి. విప్లవ రచయితల సంఘానికున్న ప్రజాపునాది ఏమిటో ఈ సభలు చాలా స్పష్టంగా తేటతెల్లంచేశాయి. అంతేకాదు, విరసం బాధ్యత మరింతగా పెరిగిందన్న విషయాన్ని ఈ సభలు గుర్తుచేస్తున్నాయి ఇవి 20 ఏళ్ళ విరసం మహాసభలయినా, నిజానికివి 12వ మహాసభలు. 20 ఏళ్ళలో 12 మహాసభలే జరుపుకోగలగడానికి - కొంతకాలంగా రెండేళ్ళకోసారి సభలు జరుపుకోవాలని విరసం పెట్టుకున్న నియమం ఒక కారణమైతే, ప్రభుత్వ నిర్బంధం మరో కారణం. 'ప్రజాస్వామ్యం' వెల్లివిరుస్తున్న ఈ దేశంలో ప్రభుత్వం పోలీసులు తమ శాయశక్తులా కృషిచేసి కొన్నిసార్లయినా విరసానికి సభలు జరుపుకొనే హక్కును లేకుండా చెయ్యగలిగారు. విరసం పీడిత ప్రజలపక్షం వహించే రచయితల, కళాకారుల సంస్థ గనక పాలకవర్గాలు కలిగించే

---

సాహిత్యాన్ని, క్షుద్ర సంస్కృతిని వ్యాప్తిచేస్తూ ప్రజలను నిర్వీర్యంచేయ ప్రయత్నిస్తున్నాయి. సాంస్కృతికరంగాన పాలకవర్గాల ఈ క్షుద్ర దాడిని తిప్పికొట్టవలసిన చారిత్రక కర్తవ్యం విప్లవ సాంస్కృతికోద్యమంపై వున్నది.

విప్లవాభినందనలతో

భా.క.పా (మా-లె) (పీపుల్స్‌వార్)

రాష్ట్ర కమిటి.

ఇంకా ఉద్యోగక్రాంతి, జననాట్యమండలి, నవనిర్మాణ్ (బాంబే), షేక్ లాల్ (IFTU), గోపగాని నర్సయ్య (రైతుకూలి సంఘం), కొందరు వ్యక్తులు సందేశాలిచ్చారు. వారి సందేశాలు వ్రాతపూర్వకంగా లేవు. అందువల్ల వాటిని ఇవ్వడం సాధ్యంకాలేదు.

విరసం కృషిని పరిశీలనాత్మకంగా సమీక్షించి, నిర్మాణాత్మకమైన సూచనలిచ్చి, బాధ్యతాయుతంగా అభినందించి, సందేశాలిచ్చిన వారందరికీ విరసం కృతజ్ఞతలు. —సం॥

ఈ అడ్డంకులు తాత్కాలికమే. శ్రీశ్రీ అన్నట్టు "విరసానిది వచ్చేకాలం విరసం-విరోధులది పోయేకాలం". సమాజపరంగా చెప్పాలంటే ప్రజలది వచ్చే కాలం ప్రజావిరోధులది పోయేకాలం. దీన్నే మరోసారి స్పష్టంగా రుజువుచేశాయి ఈ 20 ఏళ్ళ విరసం మహాసభలు. అందువల్ల మన అధ్యయనాన్నీ, ఆచరణనూ మరింత పదునెక్కించుకోవాల్సిన అవసరం మనకుంది.

విప్లవ రచయితల సంఘం గత రెండేళ్ళుగా సాగించిన తన కార్యకలాపాలతీరును వివరించడంవరకే ఈ నివేదిక పరిమితం. నిజానికి దీన్ని సభలకు ముందుగానే తయారుచేసి కార్యవర్గ సమావేశంలో మొదట చదవాల్సివుంది. కారణాలు ఏవైనా ఆ పని చెయ్యలేకపోయాను. ఈ అంశాల్ని దృష్టిలో పెట్టుకొని ఈ నివేదికను చూడాల్సిందిగా కోరుతున్నాను.

సంస్థ కార్యకలాపాల్లో సంస్థ ఆధ్వర్యంలో నడిచే 'అరుణతార' ముఖ్యమైంది. కాబట్టి దానితోనే ప్రారంభిస్తాను.

గత రెండేళ్ళుగా అరుణతారను సాధ్యమైనంతవరకు క్రమం తప్పకుండా తీసుకురావడానికి ప్రయత్నం జరిగింది. అదివరకే ప్రసిద్ధులైన రచయితలేగాక కొత్త రచయితల్నీ, రచయిత్రుల్నీ అరుణతార ద్వారా పరిచయం చేశాం. ఈ రెండేళ్ళలో 4 ప్రత్యేక సంచికలు తీసుకురాగలిగాం- 100వ సంచిక, కథల ప్రత్యేక సంచిక, గిరిజన ప్రత్యేక సంచిక, 20 ఏళ్ళ విరసం మహాసభల ప్రత్యేక సంచిక. కొందరు సభ్యుల, కొన్ని యూనిట్ల, ఎందరో అభిమానుల సహాయ సహకారాలవల్లనే అరుణతారను ఈమాత్రమైనా నిర్వహించగలిగాం. అనేక ప్రాంతాలలో విరాళాలు వసూలుచేసి చాలా కాలంగా ఉన్న అప్పును తీర్చుకోగలిగాం. అయితే అప్పుతీరిపోయిందని సంతోషపడనక్కరలేదు అయిదువేల అప్పు ఏర్పడ్డానికి రెండు నెలలు చాలు పత్రిక నిలదొక్కుకోడానికి ఈ విరాళాలు పనికొచ్చాయేగాని ఇకముందు నిర్వహణకు కాదు. పత్రికను కాపాడుకోడానికి ఇంకా ఎంతో శక్తివంచనలేని కృషిని నిరంతరం సాగించాల్సిన అవసరం ఉంది. అరుణతార నిర్వహణలో నావల్ల దొర్లిన రెండు పొరపాట్లున్నాయి. ఒకటి ఒంగోలు సర్వసభ్యసమావేశంలో అనుకున్న విధంగా పాత అరుణతారలోని ఎంపిక చేసిన రచనల్ని 100వ సంచికలో వెయ్యలేకపోవడం. రెండు అరుణతారలో సాగిన సైద్ధాంతిక చర్చల ధోరణి. విరసం సభ్యులే భేదాభిప్రాయాల్ని వ్యక్తం చేసుకునే పద్ధతిని ఇంకా నేర్చుకోలేదేమో అనిపిస్తుంది ఆ చర్చల ధోరణి చూస్తే. శత్రువుపై దాడిచేసే పద్ధతిలో కూడా ఆ చర్చలు

కొంతవరకు సాగాయి. అయితే వాటిని సరైన సమయంలో సరైన పద్ధతిలో అదుపుచెయ్యడంలో సంపాదకుడుగా నేనూ విఫలమయ్యాను. ఇలాంటివి ముందుముందు జరగకుండా మనందరం జాగ్రత్తపడాల్సిన అవసరం ఉంది.

సభ్యులలో అధ్యయనాన్ని పెంచడంకోసం ప్రతిసంవత్సరం నిర్వహించే వేసవి పాఠశాలల్ని ఈ రెండేళ్ళలోకూడా జరుపుకోగలిగాం. 1988 వేసవిలో కర్నూల్‌లోనూ, 1989 వేసవిలో హైద్రాబాద్‌లోనూ ఈ పాఠశాలలు జరిగాయి. అయితే ఈ పాఠశాలల్లో ముందుగా అనుకొన్న విషయాల్ని కొన్నిటిని వదిలి వెయ్యాల్సివచ్చింది. పాఠాలు చెప్తామని బాధ్యతతీసుకొన్నవాళ్లు తమ బాధ్యతను నిర్వర్తించలేకపోవడం లాంటివి జరక్కుండా చూసుకోవాలి. ఈ రెండు పాఠశాలల్లోనూ ముఖ్యంగా కర్నూల్ పాఠశాలలో విరసం సభ్యుల్లో ఇదివరకు పెద్ద అనుభవంలేని వాళ్ళచేతకూడా పాఠాలుచెప్పించాం. పాఠాలుచెప్పేవాళ్ళ అవసరం విరసానికెంతో ఉంది. మన సభ్యుల చైతన్యాన్ని పెంచడానికీ, ఇంకా ఎవరైనా మనల్ని కోరినప్పుడు మన దృక్పథాన్ని విశదీకరించడానికీ విరసం సభ్యుల్లో ఎక్కువ మంది అనేక అంశాలపైన తీవ్ర అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. రెండేళ్ళకొకసారి జరిగే సాహిత్య పాఠశాలను 1989 జనవరిలో జరుపుకోలేకపోయినా కాస్త ఆలస్యంగానైనా మార్చి 22, 23 తేదీల్లో నెల్లూర్లో జరుపుకోగలిగాం.

1988 జులైలో కృష్ణాజిల్లా సభలూ, 1988 డిసెంబర్‌లో రాయలసీమ జిల్లాల సభలు, 1989 డిసెంబర్‌లో ఉత్తరాంధ్ర, నెల్లూరు జిల్లాల సభలు జరిగాయి. రాష్ట్ర మహాసభల సందర్భంగా తక్కిన జిల్లాలు కూడా ఈ సభల్ని జరుపుకోగలిగి ఉంటే బాగుండేది. కనీసం విరసానికి 20 ఏళ్ళు పూర్తవుతున్న సందర్భంగా 1990 జులైలోగాసయినా తక్కిన యూనిట్లు జిల్లా సభల్ని నిర్వహించగలిగితే మంచిది.

ఈ రెండేళ్ళలో విరసం సభ్యులుగానీ, యూనిట్లుగానీ, రాష్ట్ర సంస్థగానీ తగినన్ని ప్రచురణలే తీసుకొచ్చింది. శ్రీశ్రీ సాహిత్య సర్వస్వంలో భాగంగా సిప్రాలి, మన గురజాడ, మరోప్రస్థానం వెలువడ్డాయి. వీటిని వెలువరించడంలో కా॥ చలసాని ప్రసాద్ కృషిని తప్పనిసరిగా అభినందించాలి. శ్రీశ్రీ సాహిత్య సర్వస్వానికి సంబంధించిన సంపాదక, ఆర్థిక బాధ్యతల్ని రెండిట్నీ ఆయన మొయ్యగలుగుతున్నారు. అలాగే విరసం రాష్ట్ర సంస్థ తరపున 5 సంపుటాలలో ప్రచురించాలని నిర్ణయించుకున్న కుటుంబరావు వ్యాసాలలో సైన్సు వ్యాసాల్ని ప్రచురించగలిగాం. ఇక సభ్యులు, యూనిట్లు అనేక పుస్తకాల్ని వెలువరించారు.

ముఖ్యంగా ఈ 20 ఏళ్ళ విరసం సభల సందర్భంగా దాదాపు 20 పుస్తకాలదాకా తీసుకురాగలిగాం. విప్లవ రచయితలు వాసిలోనూ, రాశిలోనూ తగినన్ని ప్రచురణల్ని తీసుకురాగలిగారు.

విరసం రచనలకే పరిమితం కాలేదు. ఎంతో కొంత మేరకు సామాజిక సమస్యల్ని పట్టించుకోవడం, ఇతర సంస్థలతో కలసి పనిచెయ్యడం, ఈ విధంగా సామాజిక ఆచరణని కలిగివుండడం జరుగుతూనే ఉంది. పాలకవర్గాలు అణువిద్యుత్ కేంద్రాల్ని పెట్టి ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే విధానాన్ని విరసం తీవ్రంగా ఎదుర్కొంది. అణువిద్యుత్ కేంద్రాలు పెట్టడంలో పాలకవర్గాల కుట్ర పూరిత స్వభావాన్ని విరసం కరపత్రాల ద్వారా, సభలద్వారా బయటపెట్టింది. కృష్ణా యూనిట్ ఈ విషయంలో విశిష్టమైన కృషి చేసింది. 'అదృశ్య మృత్యుశక్తి' పేరుతో ఒక బుక్‌లెట్‌ను కూడా ప్రచురించింది. దానికి రాష్ట్రవ్యాప్తంగా విశేషమైన ఆదరణ లభించింది. అలాగే 59వ రాజ్యాంగ సవరణ, టాడాచట్టం, కల్లోలితప్రాంతాల చట్టం మొదలైన ప్రజావ్యతిరేక చర్యలకు ప్రభుత్వాలు పాల్పడడాన్ని, దానికి వెనకున్న ఆంతర్యాన్ని విరసం స్వతంత్రంగా గానీ, APCLC వంటి ఇతర సంస్థలతో కలసిగానీ ఎండగట్టింది. ప్రకాశం, గుంటూరు జిల్లాలలో పత్తిరైతుల ఆత్మహత్యలు జరిగినపుడు కొద్దిమంది స్పందించి రచనలు చేసినా, రచనలపరంగాగానీ, ఆచరణాత్మకంగాగానీ విస్తృత కార్యక్రమాన్ని చేపట్టలేకపోయాం. వాస్తవం చెప్పుకోవాల్సి వస్తే కార్యదర్శి, కార్యవర్గ సభ్యులతోసహా విరసం సభ్యులకు ఆచరణలో చొరవ ఇంకా చాలా పెరగాల్సివుంది. కనీసం రచనల రూపంలోనైనా మన కనీసపు ఆచరణను ప్రతి సందర్భంలోనూ చాటుకోవలసిన బాధ్యత మనపై ఉంది. ఈ చొరవను పెంచే ఉద్దేశంతోనూ, సాహిత్యానికీ, సమాజానికీ ఉన్న సంబంధం దృష్ట్యానూ కొన్ని సంవత్సరాల క్రితమే విరసం గ్రామాలకు తరలండి అనే పిలుపునిచ్చింది. అది పిలుపుగానే ఉండిపోయింది. ఒకరూ అరా అలా వెళ్ళినా అది అంతకు ముందే వాళ్ళకున్న చొరవలో భాగమే తప్ప పిలుపు ప్రభావంగా కనబళ్ళేదు. కొంతవరకు నెల్లూరు, అనంతపురం యూనిట్లలోని కొందరు సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. నెల్లూరు సాహిత్య పాఠశాల సందర్భంగా జరిగిన సర్వసభ్యసమావేశంలో దీన్నే 'ప్రజలతో సంబంధాలు' అనే పేరుతో మరో రూపంలో చర్చించాం. అయినా అదీ ఫలించలేదు. ఇది విరసం తీవ్రంగా ఆలోచించాల్సిన విషయం. ఇప్పుడు మనం జరుపుకున్న ఈ 20 ఏళ్ళ మహాసభల సందర్భంగా చాలా యూనిట్లు, చాలామంది సభ్యులు విరాళాలు వసూలు

చేయడంలోగానీ, బ్యానర్లు రాయడంలోగానీ, అనేకరూపాల్లో శ్రమలో పాలు పంచుకోవడంలోగానీ కొంత చొరవ ప్రదర్శించారు. ఈ సభల సందర్భంగా మనం జనందగ్గరకు వెళ్ళినప్పుడు వాళ్ళు చూపిన అభిమానం, చొరవ మనం మర్చిపోకూడదు. విరసానికి జనంతో ఉన్న ఆ అభిమానాన్నీ, విరసం కృషి పట్ల వాళ్ళకున్న నమ్మకాన్నీ మనం నిలబెట్టుకోవాలి.

కాలుష్యానికి వ్యతిరేకంగా కృషిచేసిన కర్నూలు యూనిట్టూ, స్త్రీ సమస్యల విషయంలోనూ, స్థానికంగా ఉన్న డ్రైనేజి సమస్యల్ని వెలుగులోకి తేవడంలోనూ పశ్చిమ గోదావరిజిల్లా యూనిట్టూ, పురుషాధిక్య వ్యవస్థకు బలైపోయిన స్త్రీల విషాదకర సంఘటనల వెనుకవున్న వాస్తవాల్ని నిర్భయంగా బయటపెట్టడంలో ప్రగతి మహిళా వేదికలో భాగంగా గుంటూరు యూనిట్ సభ్యులూ, వారం వారం స్టడీ సర్కిల్స్ నిర్వహిస్తూ, కొన్ని స్థానిక సమస్యల గురించి ఆచరణాత్మక కార్యక్రమాల్ని చేపడుతున్న నెల్లూరు యూనిట్టూ ప్రదర్శించిన, ప్రదర్శిస్తోన్న చొరవ విరసం ఇంకా పటిష్టంగా మారడానికి దోహదం చేసేదే.

ఇటీవల దేశంలో కులతత్వం, మతోన్మాదం విజృంభించడం మనం చూస్తున్నదే. రామజన్మభూమి - బాబ్రీ మసీదు వివాదం సందర్భంగా మత శక్తులు మరింత పెరిగాయి. చరిత్రనుండి గుణపాఠాలు తీసుకునే పద్ధతితోగాక చరిత్రను పునర్నిర్మించే కార్యక్రమాన్ని అవి చేపట్టి ప్రజల్ని పక్కదారి పట్టించే ప్రయత్నం చేస్తున్నాయి. దీని పూర్వాపరాల్ని వివరిస్తూ సిటీ యూనిట్ ఒక కరపత్రం వేసి విస్తృతంగా పంచింది. కానీ ఈ విషయంలో సంస్థ చెయ్యాల్సినంత చెయ్యలేదు - రచనలద్వారాగానీ, ఇతర కార్యక్రమాలద్వారాగానీ. విశాఖ యూనిట్, AILRC సంయుక్తంగా నిర్వహించిన కులం సెమినార్ లాంటివి ఇంకా విస్తృతంగా జరగాల్సిన అవసరం వుంది.

ప్రజా కళాకారుడు సఫ్దర్ హష్మీని రాజకీయ గూండాలు హత్యచేసినప్పుడు విరసం రచయితల, కళాకారుల సంస్థగా సరిగ్గానే ప్రతిస్పందించింది.

విరసం చొరవతో ఏర్పడిన AILRCని ఆంధ్రలో ఫోకస్ చెయ్యడంలో విరసం విఫలమైందనే చెప్పాలి. సభ్యులు వ్యక్తిగతంగానూ, విరసం సంస్థగానూ ఈ విషయంలో ఆత్మవిమర్శ చేసుకోవాలి. AILRC సంస్థాపక యూనిట్లలో ప్రముఖమైన విరసం దాన్ని కాపాడుకునే విషయంలోకూడా ఇంకా శ్రద్ధ చూపించాల్సివుంది.

ఇంతవరకూ సాంస్కృతిక రంగంలో విరసం నిర్వహించిన పాత్ర గొప్పదే అయినా, ఇవాళ అది నిర్వహించాల్సిన పాత్ర ఇంకా పెద్దది. ఇవాళ వ్యాపార రచయితలు, పత్రికలు సాహిత్యాన్ని కేవలం వ్యాపార సరుకుగా మార్చేశాయి. సాహిత్యాన్ని ప్రజలనుంచి వేరుచేసి తమ స్వార్థానికి పావుగా ఉపయోగించుకుంటున్నారేగాని రచయిత బాధ్యతను నిర్లక్ష్యం చేస్తున్నారు. మల్లాదివంటి రచయితలు రచయితల కుండాల్సిన స్వేచ్ఛను ప్రజలవైపునుండి గాక, దోపిడీ వర్గస్వభావంనుండి చూస్తున్నారు. ఇది తెలియక చేసే పనికాదు, తెలిసి చేసేపనే. మరోవైపు సాహిత్యంలోనూ, సినిమాల్లోనూ, ఇతర కళల్లోనూ అశ్లీలాన్ని, హింసాప్రవృత్తినీ ఎక్కువచేస్తున్నారు. ప్రజల బలహీనతలను డబ్బుగా మార్చుకొంటున్నారు. ఈధోరణుల్ని ప్రతిఘటించడం విరసం బాధ్యత దానికోసం ఎక్కడికక్కడ ఏ పద్ధతులు సాధ్యమైతే ఆ పద్ధతుల్లో విరసం సభ్యులు యూనిట్లు కార్యక్రమాల్ని చేపట్టాలి. సాహిత్య సృజనపరంగా అన్ని ప్రక్రియ ల్లోనూ ప్రజాసాహిత్యాన్ని ఇంకా విస్తృతంగా సృష్టించాలి. ఇందులో భాగంగా అరుణతారలోనే గాక ఇతర పత్రికల్లోనూ రచనలు చెయ్యాలి. ప్రజాసంస్కృ తిని నిర్మించే ప్రతి ప్రయత్నంలోనూ విరసం పాత్ర ఉండాలి. ఇలాంటి ప్రయత్నం ఇప్పటికి లేదనికాదు, ఇంకా ఎక్కువస్థాయిలో పెంచుకోవాల్సిన అవసరాన్ని గుర్తుచెయ్యడమే.

విరసానికి గత రెండేళ్ళలో 2 విషాద సన్నివేశాలు ఎదురయ్యాయి. 1988 అక్టోబర్ 9న ఈశ్వరి ఆత్మహత్య-కాదు హత్య- ఒకటైతే నెలతిరక్కుం డానే నవంబర్ 4న అబ్రహాం మరణం రెండోది. పురుషాధిక్యతకూ, పురుషా హంకారానికి బలైపోయిన ఈశ్వరి విషాద సంఘటన ప్రభావం సంస్థపై పడింది మరణించిన ఈశ్వరి గత జీవితాన్ని తవ్వి ఆమె ఆత్మహత్యకు విరసం సభ్యులే కారణమని పోలీసులు వక్రీకరించడానికి చేసిన కుట్రపూరిత స్వభావాన్ని విరసం గట్టిగా ఎదుర్కొంది. ఈశ్వరి ఆత్మహత్యకు కారకుడు దుర్గారావే అని రుజువు చెయ్యడంలో విరసం తన బాధ్యతను సక్రమంగానే నిర్వర్తించింది. దాదాపు వృద్ధాప్యంలో విరసంలో చేరిన అబ్రహాం తన తుది శ్వాస వరకు విరసం గురించి, సాహిత్యాన్ని గురించి మాట్లాడ్డం, విరసం పట్ల ఆయనకున్న కమిట్ మెంట్‌ను తెలియజేస్తోంది. వారిద్దరికి విరసం జోహార్లర్పిస్తోంది.

కామ్రేడ్స్, చివరగా విరసం సభ్యుల **sense of belonging** ను గూర్చి నిర్మొహమాటంగా కొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను. చాలామంది విరసం సభ్యులుగా తమ కనీసపు బాధ్యతల్ని కూడా నిర్వర్తించటంలేదు.

# తీర్మానాలు

## *14-1-90న హైద్రాబాద్‌లో జరిగిన విరసం సర్వసభ్య సమావేశం ఆమోదించిన తీర్మానాలు*

## 1. పౌర ప్రజాతంత్ర హక్కుల ఉద్యమానికి విరసం సంఘీభావం.

ఆవిర్భావకాలం నుంచి కూడా పౌర, ప్రజాతంత్ర హక్కుల ఉద్యమంలో ముందడుగుగా నిలిచిన విరసం తన ఇరవయ్యేళ్ళ విరసం మహాసభల ఉత్సవాలను పురస్కరించుకొని ఈ పోరాట కార్యాచరణకు తనను తాను పునరంకితం చేసుకుంటున్నది.

1. ఈ సందర్భంగా విరసం సభ్యులపై వున్న అక్రమ కేసులన్నీ ఎత్తివేసుకోవాలని విరసం డిమాండు చేస్తున్నది. మా సభ్యుడు అద్దేపల్లి గత మూడు సంవత్సరాలుగా రాజమండ్రి జైలులో అనేక కేసుల్లో అండర్ ట్రయల్‌గా వున్నాడు. ఆయనను వెంటనే బేషరతుగా వ్యక్తిగత పూచీపై వదిలివేయాలి.

2. ప్రజాకళాకారుడు కా॥ గద్దర్‌పై రామనగర్ కుట్రకేసు వెంటనే ఉపసంహరించుకోవాలని విరసం డిమాండు చేస్తున్నది. కా॥ గద్దర్‌పై రాంనగర్ కుట్రకేసు ఎత్తివేసుకొనేలా ప్రభుత్వంపై ఒత్తిడి తేవాల్సింగా దేశంలో కళాకారులు, రచయితలు, మేధావులు, ప్రజాతంత్రవాదాలందరికీ విరసం విజ్ఞప్తి చేస్తున్నది.

---

వాళ్ళంతట వాళ్ళే సభ్యత్వం, అరుణతార చందా కట్టడం లాంటి టెక్నికల్ అంశాల్లో ఇది చాలామందికి వర్తిస్తుంది. మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానాన్ని ఆమోదించే విరసం సభ్యులుగా మన బాధ్యతలు చాలా ఎక్కువ. చూడడానికి చిన్న చిన్న విషయాలుగానే కనిపించినా సంస్థ నిర్మాణ విషయాల్లోనూ, రచనలపరంగానూ, ఇతర కార్యక్రమాల్ని చేపట్టడంలోనూ మన బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించగలమని ప్రజలకు హామీ యిద్దాం. దాన్ని నిలబెట్టుకోవడానికి శక్తివంచనలేకుండా కృషిచేద్దాం.

విప్లవం వర్ధిల్లాలి, విరసం వర్ధిల్లాలి.
ప్రజాకళలు, ప్రజాసంస్కృతి వర్ధిల్లాలి.

3. రాజకీయ ఖైదీలందరినీ బేషరతుగా వదిలిపెట్టి వాళ్ళపై 1983 నుంచీ తెలుగుదేశం ప్రభుత్వంమోపిన అక్రమ కేసులన్నీ ఎత్తివేసుకోవాలని విరసం డిమాండు చేస్తున్నది. రాజకీయ ఖైదీలను విడుదలచేసే విషయంలో శిక్షపడిన వాళ్ళూ, విచారణలో వున్నవాళ్ళూ, ఈ రాష్ట్రంలో వున్న కేసులా, పొరుగు రాష్ట్రాల్లోవున్న కేసులా అన్నవి ప్రభుత్వానికి చిత్తశుద్ధి వుంటే అధిగమించలేని సమస్యలు కావు. అవి ప్రజాతంత్రవాదులైన న్యాయవాదులతో చర్చించి పరిష్కరించవచ్చు. అవి టాడా కేసులయినాసరే ఉపసంహరించుకోవాలి. ఇక ముందు టాడా చట్టాన్ని ప్రయోగించబోమని విస్పష్ట ప్రకటన చేయాలి.

4. జగిత్యాల, సిరిసిల్లాలతో పాటు 1969, 76 లలో శ్రీకాకుళం, తూర్పు, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, కరీంనగర్ జిల్లాలలో ప్రకటించిన కల్లోలిత ప్రాంతాల చట్టాన్ని ఎత్తివేయాలి.

5. విరసం సాహిత్యంపై, విరసం సభ్యుల సాహిత్యంపై, విప్లవోద్యమ సాహిత్యంపై అమలవుతున్న ప్రకటిత అప్రకటిత నిషేధాన్ని ఉపసంహరించుకోవాలి.

6. అన్ని ప్రజాసంఘాలపై ఆరేళ్ళుగా అమలవుతున్న అప్రకటిత నిషేధాన్ని (ban) ఆచరణలో ఉపసంహరించుకొని విప్లవ ప్రజాసంఘాలు స్వేచ్ఛాయుత, ప్రజాస్వామిక వాతావరణంలో పనిచేసే అవకాశం కల్పించాలి.

7. యూనివర్శిటీ, కాలేజీలలో విద్యార్థిసంఘాలకు ప్రజాస్వామిక వాతావరణంలో ఎన్నికలు జరిగి విప్లవ విద్యార్థిసంఘాలు వాటిలో స్వేచ్ఛాయుత వాతావరణంలో పాల్గొనే ఏర్పాటుచేయాలి.

8. కామ్రేడ్స్ ఐలయ్య, రాజమల్లులతోపాటు 'మిస్సింగు' కేసులన్నీ కూడా జస్టిస్ టి.ఎల్.ఎన్. రెడ్డి కమీషన్‌కు అప్పగించి, ఆ కమీషన్ ముందు హాజరయ్యే సాక్షులు స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా వాఙ్మూలం యిచ్చే వీలుకల్పించాలి. నేరం రుజువయిన అధికారులను వాళ్ళు ఏ స్థాయిలోవున్నా కఠినంగా శిక్షించాలి.

9. భార్గవ కమీషన్‌ను పనిచేయకుండా చేసిన చెన్నారెడ్డి ఎన్‌కౌంటర్ల హత్యల విషయంలో సుప్రీంకోర్టు న్యాయమూర్తితో విచారణ చేయవలసిన నైతిక బాధ్యతను చేపట్టవలసివున్నది. 1969 నుంచి 89 దాకా ఇరవై సంవత్సరాలపాటు కాంగ్రెస్, తెలుగుదేశం ప్రభుత్వాల హయాంలో హత్యచేయబడిన వందలాదిమంది విప్లవకారులు, సానుభూతిపరుల విషయంలో సుప్రీంకోర్టు న్యాయమూర్తితో సమగ్ర దర్యాప్తు జరిపించి బాధ్యులను శిక్షించాలి.

ఇక ముందు బూటకపు ఎన్‌కౌంటర్లు వుండవని కూడా ప్రభుత్వం నుంచి విస్పష్టమైన ప్రకటన, హామీ ఇవ్వాలి.

10. లాకప్ హత్యల విషయంలో లాంఛనప్రాయమైన న్యాయవిచారణలు కాకుండా, ఆ విచారణలలో తేలిన అంశాలపై చర్య వుండాలి. ఎన్‌కౌంటర్లు, లాకప్ హత్యల విషయంలో ముందుగా 302 సెక్షన్ కింద హత్యకేసులు నమోదు చేసి విచారణప్రారంభించాలి.

ఈ పై డిమాండులన్నీ ప్రభుత్వం చర్చల పేరుతో నాన్చకుండా ఏక పక్షంగా అమలు చేసి చర్చలకు అవసరమైన వాతావరణం కల్పించిందన్న విశ్వాసం కలిగించాలి.

కాళోజీ చొరవతో 1985 జూన్‌లో 70 మంది మేధావులు, రచయితల సంతకాలతో అప్పటి ముఖ్యమంత్రి ఎన్టీరామారావును కలిసి ఆంధ్రప్రదేశ్‌లో అమలవుతున్న పోలీసురాజ్యం గురించి వివరించాడు. అది కంఠశోషయే ఐంది. అయినా ప్రజాస్వామిక వాతావరణం నెలకొనడానికి విరసం చర్చలకు వ్యతిరేకంకాదని మాత్రం స్పష్టంచేయదలుచుకున్నాము.

## 2. రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనను విరసం వ్యతిరేకిస్తుంది.

రాజ్యాంగంలో హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతుల ప్రజలకొరకు వున్న రిజర్వేషన్లను మరొక పది సంవత్సరాలకాలం పొడిగించిన సందర్భంగా భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో కూడా రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమం ప్రారంభమైంది.

మన మీ రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమ అసహ్యాన్ని ఇదివరకొకసారి 1986 లో సహించివున్నాం. మళ్ళీ ఇప్పుడది సంపన్నవర్గాల, అగ్రకులాల ప్రోత్సాహంతో తన విషకోరలను ప్రదర్శించాలని చూస్తున్నది.

సమాజంలో సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక అసమానతలు ఉన్నంత కాలం ఉద్యోగాల్లో, చదువులో జనాభా ప్రాతిపదికపై రిజర్వేషన్లు వుండితీరాలన్నది విరసం దృఢమైన అభిప్రాయం. లోగా రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమ కాలంలో మేం సభల ద్వారా, రచనలద్వారా ఆ తిరోగమన ఆందోళనను వ్యతిరేకించివున్నాం. ప్రతిఒక్కరికీ చదువు, ప్రతిఒక్కరికీ ఉద్యోగం ఉపాధి కల్పించే వ్యవస్థకోసం మనం పోరాడవల్సివుందని విద్యార్థులకు విజ్ఞప్తిచేస్తూ

సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ అసమానతలు వున్నంతకాలం రిజర్వేషన్లు జనాభా ప్రాతిపదికపై వుండితీరాలని మేం పునరుద్ఘాటిస్తున్నాము.

## 3. రాయలసీమ సమస్యల పరిష్కారానికి పోరాటమే మార్గం.

ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ చాలా వెనుకబడిన ప్రాంతము. ప్రభుత్వ నిర్లక్ష్యము, పక్షపాత వైఖరివల్ల మౌళికమైన అభివృద్ధి కార్యక్రమాలు చేపట్ట లేదు. అనంతపురం జిల్లా కరువుకు నిలయమై ఆకలి చావులు కూడా సంభవిం చాయి. రాష్ట్ర బడ్జెటులో రాయలసీమ సమస్యలను, పరిస్థితిని బాగుచేయడానికి ప్రత్యేకమైన నిధులు కేటాయించడంలేదు.

రాష్ట్రంలో ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా రాయలసీమప్రాంతం అభి వృద్ధికి కృషిచేయకుండా ఆ సమస్యను రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించు కుంటున్నారు. కాంగ్రెస్ పార్టీ ఆ సమస్యను తెలుగుదేశం పార్టీకి వ్యతిరేకంగా ఉపయోగించుకొని అధికారంలోకి వచ్చింది. తెలుగుదేశం పార్టీ అధికారం పోయిన తర్వాత అదే సమస్యను ఉపయోగించుకుంటున్నాయి. ఇప్పుడు అధి కారంలో వున్న రాయలసీమ MLA లు రాయలసీమ సమస్యమీద నోరుమెదప టంలేదు. అయితే రాయలసీమ ప్రజానీకం, విద్యార్థులు, యువకులు, కార్మికులు పోరాటం తప్ప వేరే మార్గం లేదని ఉద్యమానికి సన్నద్ధమవుతున్నారు.

అసెంబ్లీ సమావేశాలు జరుగుతుండగా కడపలో రాయలసీమ సమస్యలపై నిరాహారదీక్షలు జరుపుతున్న వాళ్ళను కిడ్నాప్‌లు చేయడం కూడా జరిగింది అంతకుముందు ఉద్యమంలో ఒక విద్యార్థి తుపాకి గుళ్ళకు బలైపోయాడు. కావున రాజకీయపార్టీల మోసపూరిత వాగ్దానాలకు, హామీలకు మోసపోకుండా విద్యార్థులు, యువకులు, కార్మికులు రాయలసీమ అభివృద్ధికై ఉద్యమించాల్సిందిగా విరసం విజ్ఞప్తిచేస్తున్నది. మొన్న కడపలో కార్యకర్తలను కిడ్నాప్ సంఘట నను ఖండిస్తున్నది. రాయలసీమ సమస్యల పరిష్కారానికి పోరాటం తప్ప వేరే మార్గం లేదని విరసం భావిస్తున్నది.

## 4. 'మేడిపండు' పార్లమెంటరీ రాజకీయాలు.

అతిపెద్ద ప్రజాస్వామిక దేశమని ప్రచారంచేసుకునే మన దేశంలో జరిగిన అసెంబ్లీ, పార్లమెంటు ఎన్నికల్లో ఇదివరకెన్నడూలేనంత పెద్ద ఎత్తున రిగ్గింగ్ జరిగింది. సుమారు 500 లకు పైచిలుకు కేంద్రాల్లో రీపోలింగ్ జరిగింది. ఇక

ప్రాణనష్టం, ఆస్తినష్టం గురించి బూర్జువా పత్రికలే వ్రాయక తప్పనిసరైంది. ధనబలంతోనూ, జులుంతోనూ పాలకవర్గం ముందుకొస్తూ, వాగ్దానాలు కురిపిస్తూ జనం కళ్ళుకప్పి కాలం వెళ్ళబుచ్చుకోజూస్తున్నారు. చైతన్యవంతమైన జనాన్ని బలవంతంగా ఎన్నికల్లో పాల్గొనమని నెట్టుతున్నారు. తమ ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టుకోవడానికి విఫలప్రయత్నం చేస్తూనేవుంది. తమ అధికారం నిలబెట్టుకోవడం కోసం ప్రజలపై మతం, కులం, ప్రాంతీయ ద్వేషాలను రెచ్చగొట్టి పబ్బంగడుపుతున్నారు ఎన్నికల ఫలితాలు తెలిసిన వెంటనే పాలకవర్గ పార్టీలు తమ ప్రజాస్వామ్య ముసుగు చించుకొని తమ వికృతరూపాన్ని బయటపెట్టుకున్నాయి - తానధికారంలోకి రాగానే తనకు ఓటుపడని గ్రామాలపై భయంకరమైన దాడులుచేస్తూ ప్రజల్ని, ఆస్తుల్ని తగలబెట్టే కాంగ్రెసుపార్టీ తాను తెలుగుదేశ ఫాసిస్టు నియంతృత్వానికి యేమాత్రం తీసిపోదని నిరూపించింది. బసాయిగడ్డ తాండాలో గిరిజనులపైదాడి, అనంతపురం జిల్లాలోని గ్రామాల్లో కొన్ని లక్షలరూపాయల ఆస్తి తగలబెట్టి, ప్రజల్ని దారుణంగా హింసించడం, దాన్ని పోలీసు యంత్రాంగం నిర్లిప్తంగా చూడటమేగాక బాధితులనే అరెస్టు చెయ్యడం యివన్నీ పాలకవర్గ పార్టీల బూటకపు ప్రజాస్వామ్యాన్ని తెలియచేస్తూంది. అనంతపురం జిల్లాలో ఆ పీడిత ప్రజలకు విప్లవకారులే సహాయంగా నిలబడుతున్నారే తప్ప వారి ఓట్లను పొందిన తె.దే మాత్రం పత్తాలేకుండా పోవడంతో ప్రజలు తమ పక్షాన ఎవరు నిజంగా పోరాటంచేస్తారో గ్రహిస్తున్నారు. ఇలాంటి బూటకపు ఎన్నికల నిజస్వరూపాన్ని తెలియచెప్పి పార్లమెంటరీ రాజకీయాల 'పేడిపండు'ను విప్పిచూపి, ప్రత్యామ్నాయంగా నక్సల్‌బరీ వెలుగులో ప్రజాపోరాటాల్ని చేయాలని ప్రజలకు విరసం విజ్ఞప్తి చేస్తూంది. ప్రజల బ్రతుకులు, వారి సంస్కృతి మారాలనుకుంటే అది ప్రజాపోరాటంలో తప్ప మరేవిధంగానూ సాధ్యంకాదని, తమ్ము తాము రక్షించుకొనుటకు వాటి పోరాటాల్లో పాల్గొనాలని విరసం పిలుపునిస్తుంది.

## 5. గిరిజన యువతులపై అత్యాచారం అశేషపీడిత ప్రజానీకంపై కొనసాగుతున్న రాజ్యహింసలో భాగమే.

పోలీసు సర్పం మరోసారి పడగవిప్పి కాటేసింది. రాజ్యహింస విచ్చలవిడిగా మృత్యుపాదాలతో క్రూరంగా కర్కశంగా గిరిజనుల జీవితాలపై విలయతాండవం చేసింది. కరీంనగర్ జిల్లా ఎల్లారెడ్డిపేట పోలీస్‌స్టేషన్‌కు చెందిన

ముగ్గురు పోలీసులు ఒక నిందితునికి సమీప బంధువులైన ముగ్గురు గిరిజన లంబాడీ యువతులను అత్యంతదారుణంగా మూడురోజులు వరుసగా మానభంగం చేశారు. ప్రభుత్వాలు మారినా నాయకులు మారినా రాజ్యం స్వభావం మారదని అది అమాయక పీడిత ప్రజానీకంపై తీవ్రమైన హింసాకాండ అమలుచేస్తుందని ఈ సంఘటన ఋజువుచేస్తున్నది. వికృతమైన పోలీసు సంస్కృతి రాజ్యమేలుతున్న వ్యవస్థలో పోలీసు హింస నగ్నంగా ముందుకొచ్చి తన నికృష్ట స్వభావాన్ని బట్టబయలు చేసుకున్నది. పితృస్వామిక వ్యవస్థలో పురుషాహంకారానికి ఖాకీ క్రౌర్యం తోడై జరిపిన ఈ అమానుష అత్యాచారాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తున్నది. తక్షణమే ముగ్గురు పోలీసులపై చర్యతీసుకోవాల్సిందనీ, పీడిత ప్రజానీకంపై హింసాకాండను ఆపివేయాలని డిమాండ్ చేస్తుంది.

## 6. కార్టూనిస్ట్ శంకర్ మరణంపట్ల సానుతాప తీర్మానం.

సుప్రసిద్ధ కార్టూనిస్టు, భారత దేశంలో రాజకీయ కార్టూన్‌కళకు ఆద్యుడు, శంకర్స్‌వీక్లీ సంపాదకుడు శంకర్‌పిళ్ళే మరణం పట్ల విరసం తన ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తంచేస్తున్నది.

జవహర్లాల్ నెహ్రూతో వ్యక్తిగత మిత్రుడైనా ఆ సంబంధాలను ఎక్కడా తన రాజకీయ (కార్టూన్) వ్యాఖ్యల్లో అడ్డుపడనీయకుండా ప్రజాస్వామిక చైతన్యాన్ని ప్రదర్శిస్తూ ఆయన 'శంకర్స్‌వీక్లీ' నిర్వహించాడు. ఈనాడు దేశంలో వున్న సుప్రసిద్ధ కార్టూనిస్టులు అందరూ దాదాపుగా ఆయన శిష్యులే.

కార్టూన్‌కళతో పాటు శంకర్ పిల్లలలో చిత్రకళను, సృజనాత్మకతను పెంపొందించడంలో కూడా తన జీవితమంతా కృషిచేసాడు. ఢిల్లీలో ఆయన చిరస్మరణకు సంకేతంగా ఆయన ఏర్పాటుచేసిన బాలల చిత్రకళ ప్రదర్శన నిలిచిపోతుంది.

ఎమర్జెన్సీలో భావప్రకటనా స్వేచ్ఛపై విధించిన ఆంక్షలకు నిరసనగా ఆయన శంకర్స్‌వీక్లీ ఆపేసాడు.

ఆ ఉత్తమ కార్టూనిస్టుకు విరసం నివాళి అర్పిస్తూ ఆయన కుటుంబానికి తన సానుభూతిని అందచేస్తున్నది.

## 7. పెనామా వ్యవహారంల్లో అమెరికా జోక్యం.

మన్రో సిద్ధాంతం కాలంనుంచీ ఉభయ అమెరికా ఖండ దేశాలను అమెరికా సంయుక్తరాష్ట్రాలు తన ఆధిపత్యం కిందికి తెచ్చుకొనేందుకు ఎన్నోసార్లు అక్రమ

జోక్యం చేస్తూవచ్చింది. దీనికి తాజా ఉదాహరణ పెనామా రిపబ్లిక్ వ్యవహారాల్లో ముక్కుదూర్చి, ఆ దేశాధ్యక్షుడైన జనరల్ నోరీగాను సైనికచర్యద్వారా పదవీభ్రష్టుణ్ణి చెయ్యడం, మాదకద్రవ్యాల వ్యాపారంలో మునిగితేలుతున్నాడంటూ ఒక కారణం చూపి, అమెరికా తన దళాలను పెనామా రిపబ్లిక్‌లోకి పంపి నోరీగాను గద్దెనించి దింపి చివరకు అరెస్టుచేసి, ఫ్లొరిడాలోని మియామీలో విచారణ జరిపించడం, అంతర్జాతీయ న్యాయసూత్రాలకు, పెనామాసార్వభౌమావికి చెంపపెట్టు. ఈ అక్రమ అమెరికన్ దుశ్చర్యను విప్లవ రచయితల సంఘం తీవ్రంగా గర్హిస్తూంది.

*విరసం, AILRC సంయుక్త తీర్మానం :*

## "కామ్రేడ్ గోవిందప్రసాద్ అమర్‌హై!"

విరసం భాగస్వామిగావున్న అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి (AILRC) సభ్యుడైన (ఢిల్లీ యూనిట్) కామ్రేడ్ గోవిందప్రసాద్ గత నవంబర్ 28వ తేదీన హఠాత్తుగా గుండెజబ్బుతో అమరులైనారు.

కా॥ గోవిందప్రసాద్ 80 ఏళ్ళుపైబడినా, ఒంటరిగా తిరగలేని ఆరోగ్య స్థితి వున్నా, శారీరకంగా వికలాంగులైవుండీ, ఢిల్లీలాంటి పెద్ద నగరంలో కన్నుమూసే క్షణంవరకూ యూనిట్ కార్యక్రమాల్లో తమ వంతు బాధ్యతను చురుకుగా నిర్వహించారు. డాక్టర్లు పదేపదే వారించినా చివరినిముషంలోకూడా చైనాలో ఈ మధ్యకాలంలో జరిగిన సంఘటనలకు సంబంధించిన వ్యాసాన్ని మరణశయ్యమీదనే అనువదించారు.

అంతటి కార్యదీక్షగల కా॥ గోవిందప్రసాద్‌ను కోల్పోయినందుకు విరసం AILRC లు తమ ప్రగాఢ సంతాపాన్ని తెల్పుతూ లాల్‌సలామ్‌లు చెప్తున్నాయి; ఆ కామ్రేడ్ కుటుంబ సభ్యులకు సానుభూతిని తెల్పుతున్నాయి.

కామ్రేడ్ గోవిందప్రసాద్‌కు జోహార్లు!



# 20 ఏళ్ళ విరసం మహాసభల జమా ఖర్చుల వివరాలు.

| జమ | రూ. పై. |
|---|---|
| ఆహ్వానసంఘ సభ్యుల ద్వారా | 10,250-00 |
| విరసం సిటీ యూనిట్ ద్వారా | 12,942-00 |
| విరసం ఇతర జిల్లాల యూనిట్ల ద్వారా | 20,260-00 |
| మెదక్ జిల్లా సాహితీ మిత్రుల ద్వారా | 3,000-00 |
| డెలిగేషన్ ఫీజు ద్వారా | 24,175-00 |
| బహిరంగసభలో వచ్చిన మొత్తం | 4,210-00 |
| విడివిడిగా వసూళ్ళు | 15,641-75 |
| ఖర్చు మినహాయింపులు | 998-50 |
| మొత్తం | 91,477-25 |

| ఖర్చు | |
|---|---|
| మీటింగ్‌హాల్ అద్దె | 4,700-00 |
| కరపత్రాలు, పోస్టర్లు | 6,900-00 |
| ప్రెస్ ఖర్చులు (జనవరి 'అరుణతార' ఖర్చుతో కలిపి) | 8,196-00 |
| ప్రచారం ఖర్చులు | 1,589-00 |
| టెంట్ హౌస్ అద్దెలు, ఖర్చులు | 12,778-00 |
| మైక్ & లైటింగ్, పెట్రోమాక్స్‌లైట్లు | 3,810-00 |
| ఫోటోలు | 900-00 |
| పుస్తక, చిత్రకళా ప్రదర్శనలు | 300-00 |
| కూరగాయలు | 6,222-00 |
| కట్టెలు | 3,060-00 |
| వంటసామాగ్రి | 20,243-25 |
| వంటవాళ్ళ ఖర్చు | 1,200-00 |
| వంటహాల్లో ఖర్చు | 770-00 |
| బహిరంగసభ స్టేజి, మైక్, లైటింగ్ | 5,900-00 |
| బంటింగ్స్, కవర్స్ | 1,116-00 |

| | |
|---|---|
| వాలంటీర్స్ ఖర్చులు | 2,897-00 |
| ప్రయాణం ఛార్జీలు | 300-00 |
| ఇతర ఖర్చులు | 3,245-50 |
| మొత్తం | 84,107-25 |
| మొత్తం జమ | 91,477-25 |
| మొత్తం ఖర్చు | 84,107-25 |
| మిగులు | 7,370-00 |

మిగులు మొత్తాన్ని ఈ కింది విధంగా కేటాయించడం జరిగింది.

| | |
|---|---|
| విప్లవకవితా సంకలనం కోసం | 4,000-00 |
| కా॥ బి.యస్. రాములు కుటుంబ సహాయ నిధికి | 1,000-00 |
| ఏప్రిల్ 14, 15 తేదీల్లో బొంబేలో జరగబోయే AILRC కమ్యూనలిజం సెమినార్‌కు | 2,000-00 |
| అరుణతార ఫండ్ | 370-00 |
| | 7,370-00 |

20 ఏళ్ళ విరసం మహాసభల కార్యాచరణ కమిటీ 10-2-90 న హైదరాబాద్‌లో సమావేశమై పై జమాఖర్చుల వివరాల్ని పరిశీలించి ఆమోదించింది.

# యుద్ధం మాకెప్పుడూ వర్తమానమే

నేనో కాందిశీకుణ్ణి, ఆకలితో అలమటించినవాణ్ణి
గాయాలు పూసిన మోదుగు చెట్టయినవాణ్ణి
నిజానికి - పోగొట్టుకోవడానికీ, భయపడ్డానికీ
ఏమీ లేని ఉత్త దేశదిమ్మరులం మేం.
చిట్లిన మా పెదవుల్తో ముద్దిడుకొనడానికీ
అలసిన మా కాళ్ళు సేదదీరడానికీ
మాకంటూ ఓ మాతృభూమి లేదు.
తుఫాను హోరుమధ్య మాకు ఏ భద్రతా లేదు.
కాని - మీరు మా కాళ్ళకింద భూమిని తొలుస్తున్నంత కాలం
మా నిర్వాసితుల గాయాలమీద మీ విలాసాలు వికసించినంతకాలం

ఎప్పుడూ, ఎప్పుడూ మిమ్మల్ని ప్రశాంతంగా ఉండనివ్వం
మీ భద్రతమీద దాడిచెయ్యడానికి గడ్డిపుల్ల సైతం మాకు ఆయుధమే
వేటాడుతూ, వేటాడబడుతూ, ఎడతెగని పోరులో
మీ భద్రతా సరిహద్దుల్లోకి చొచ్చుకు వస్తూనే ఉంటాం
యుద్ధానికొక స్థిరత్వమూ లేదు, దాని ఫలితాలనూ ఇప్పుడు చెప్పలేం
షేం నివసించడానికి
భూమ్మీద అంగుళమంగుళమూ వెతుక్కున్నంతకాలం
నిరంతర యుద్ధంలో నిలబడి మీ భద్రతమీద దాడిచేస్తూనే ఉంటాం
తుఫానుమధ్య పోటెత్తిన అలలమై తరలివస్తూనే ఉంటాం
మా దేహాలమీద కత్తిలాంటి కాలం
నిన్న-నేడు-రేపుల మార్పుల్ని చూపవచ్చు
అయితేనేం? రక్తసిక్తమైన మా మాతృభూమి సాక్షిగా
యుద్ధం మాకెప్పుడూ వర్తమానమే.

[ఓ పాలస్తీనా డెలిగేట్ మాటలకు స్పందించి...
ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సౌజన్యంతో] —ఉదయమిత్ర

# సజీవదృశ్యాలు

గతరాత్రి మిగిల్చిన అపజయాలను ప్రభాతసమయంలోనే సమాధిచేసెయ్యి!
పుష్పించిన ఆశలు విరాళ పవనాలను ప్రేమగా నిమురుతాయి
పుటల మధ్యన దాగే నిర్బంధపు ముడులు విప్పుతాయి స్వేచ్ఛాక్షరాలు
దూరతీరాల పిలుపులు - విహంగాలను వాటి గూటిలోనుంచి లాక్కుపోతున్నాయి
ఒంటరి రేణువులు సంఘటితపు గదుల్లోకి బారులు తీర్చాయి
సెలయేటి చేరువలో చిట్టకవి రెప్పలు కదిలిస్తోంది
అజ్ఞాత దారులలో సంచరించే ఆత్మల గానం
జనారణ్యాన్ని అప్రమత్తం చెయ్యాలనుకొంటోంది
ఊపిరి సలపని పనుల్లో ఉన్నా తప్పకుండా వినాలి
శబ్దంలోకి నిశ్శబ్దంగా ప్రవేశించి తిరుగులేకుండా నమ్మాలి
దురదృష్టం అన్ని మూలలనుంచీ మెరుపుదెబ్బలు కురిపిస్తున్నా,
విజయం తునాతునకలయినా, చీకటినీడలు మువ్వలనాట్యం చేసినా,
ఓటమి రెట్టింపు ఉత్సాహంతో పరుగులు తీస్తోంది గెలుపుకోసం
జీర్ణవస్త్రాన్ని కప్పుకొన్న ఆకాశంలోంచి చుక్కలనే చిల్లులు ప్రకాశిస్తాయి
వీరులు కాలగర్భంలో కలిసినా-
నాకింకా జ్ఞాపకమేనంటూ నిట్టూరుస్తుంది చరిత్ర. —జె. లక్ష్మి

BCF

# వందనాలు నీకు అన్నా సెంద్రన్న

— గద్దర్

వందనాలు నీకు వందనమన్నో - సెంద్రన్నా
పేదోల పీడోల వందనమన్నో - సెంద్రన్నా
నీ చావు సంగతి విన్న నిను గన్న నీ తల్లి
నిజంబాదు జిల్లా నిప్పులు గక్కింది నింగెత్తు లేచింది
డిచ్‌పల్లి పల్లెలు దండోరి వేసినయ్
ఆరుమూరు చూడు ఆయుధాలెత్తినయి
నిజంబాదు పల్లె నిను మరవనందో - సెంద్రన్నా
నీ భుజం పోతే నా భుజమిస్తనందో - సెంద్రన్నా
నీ చావు సంగతి విన్న పప్పు సాయిలన్నా
పెద్దపులి దరువేసి యుద్ధభేరిని పెంచె
మంగలి మల్లన్న కత్తెటుబాయెందు
కమ్మరి ఈరన్న సుత్తె దోలాడిందు
కుత కుత కుత కుత వూరంత ఉడికింది
పట పటా పట పటా పండ్లన్ని కొరికింది
తల్లులు సెల్లెండ్లు గొల్లునా ఏడ్సి - సెంద్రన్నా
కన్నీళ్లుబోసి నీకాలు కడిగింద్రో - సెంద్రన్నా
నీ చావు సంగతి విన్న కూలోల్ల సెల్లెమ్మ
కాళమ్మలా లేసి కండ్లు నిప్పులు చేసి
కొడుకెటుబాయెని అటు ఇటు ఉరికింది
సచ్చె ముసలిది లేసి నీపురెటుబాయెనె
కారంపొడి దుత్త కానరాదని అరిసె
తల్లిలా తోడుగా సెల్లెల్లొచ్చింద్రో - సెంద్రన్నా
మల్లెలా దండలు నీకు తెచ్చింద్రో - సెంద్రన్నా
నీ చావు సంగతి విన్న బస్సులో డీజిలేమొ
బగ్గునా మండింది బాంబయ్యి పేలింది
లారీల చక్రాలు తిరుగపోమన్నాయి
కాయన్నా దొరకొడుకు వూరిడిసి వురికిందు
కాలినడకన పోయె కూలినాలోల్లు - సెంద్రన్నా
నీ కతలు చెప్పుకుంట కదిలిపోయింద్రో - సెంద్రన్నా
దొంగెదురు కాల్పుల్లో నిను కాల్చి చంపినా
C.I , S.I గాల్లు సెలవుగావాలంద్రు
నిజంబాదు S.P బదులు కావాలందు
కోడెండ్ల గాడేమొ జారిగాడ్దెడనె
పేదోల్ల కన్నీలు పెనుమంటలయ్యె - సెంద్రన్నా
ఎంటోడి పాలనను చుట్టుముట్టింద్రు - సెంద్రన్నా



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M102 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | OI, BCI ,32B,32D |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Jayamma |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |